# స్వగతం

అంతటి నరసింహం ఎం. ఏ.,
(ఆంధ్రోపన్యాసకులు-ప్రభుత్వకళాశాల, రాజమండ్రి.)

పబ్లిషరు
మలిశెట్టి రామకృష్ణ,
కోడూరు. (కడపజిల్లా)

# అంకితము

కన్నతండ్రి యెపుడుగూడ
కన్నెకు దగు వరుడు దొరికె
నేని యెన్న నెక్కినంత
యానందము పొందునుగద

అట్లాగే నేనుగూడ
నా కృతికన్యామణికై
తగిన వరుని వెదకివెదకి
తుట్టతుదకు పట్టినాను

ఘనతకెక్కినట్టి కడప
మండలమున తాళ్లపల్లె
వెలమవారి పల్లెవాసి
మహానందినాయుడుండె

ఆతడు తన సతియందున
సుబ్బయ్యను, పెద్ద చెన్న
కేశవులను, నారాయణ
స్వామిగారలను కనియెను

వారికంటె చిన్నవాడు
చెన్నకేశవులనాయుడు
ఉన్నత విద్యలనుపొంది
ఉన్నతఉద్యోగియయ్యె

చేపట్టెను లక్ష్మీసమ
నాగమసతి నామెయందు
రామచంద్రవరప్రసాద
మౌ రామప్రసాదుగనియె

మితభాషియు మృదుభాషియు
వినయశీలుడౌ నాయుడు
నిరాడంబరుడు సరసుడు
సహృదయుడు సన్మిత్రుడు

శక్తి నెఱిగి మాట నిచ్చు
ఇచ్చిన మాటను దాటడు
చేస్తానన్నట్టి దాని
చేసితీరు తిరుగులేదు

వింటి నతని గుణగణములు
కంటి నాతనిని ఖుద్దున
అందులకే కృతికన్యను
అంకితముగ నొసగినాను.

# ఒ క మా ట

"స్వగతం" 1953 ఆదిలోనే ఆరంభమయింది. కాని ముగియడానికి ఒకసంవత్సరంకంటే ఎక్కువ పట్టింది. మరి అచ్చుకావడానికి ఆపైన అయిదు సంవత్సరాలుపట్టింది. దీనికంతా కారణం పాఠకులనుండి ప్రకాశకులకు ప్రోత్సాహం లేకపోవడమూ, ప్రకాశకులనుండి రచయితలకు ప్రోత్సాహం లేకపోవడమూను. ఇతర భాషాప్రాంతాలలో ఇట్లా లేదుకాని మన ఆంధ్రజాతికే ఈ దుర్గతి పట్టుకొంది. పుస్తకాలు కొని చదివే అలవాటు ఇకనైనా మన ఆంధ్రులు అలవరచుకోవాలి.

అతిముఖ్యములైన సాంఘికసమస్యా పరిష్కారార్థం ఇది వ్రాయబడినది. ఇప్పటికైనా ఇది ఒక పుస్తకరూపాన్ని ధరించి ఆంధ్రలోకంలోకి అవతరించడం నా కత్యంతముదావహమైన విషయం. ఏతద్రచనావతరణకు ప్రోత్సాహమిచ్చిన మిత్రులందరికీ నా ధన్యవాదాలు.

ముఖచిత్రం వ్రాసియిచ్చిన మా విద్యార్థి చిరంజీవి శీలా వీర్రాజుకు నా ధన్యవాదాలు.

ఈ నవలలో చిత్రితమైన పాత్రలు, స్థలాలు, సంఘటనలు కేవలము ఊహాకల్పితాలు. ఏ ఒక్కరినీ ఉద్దేశించి వ్రాసినవిగావు.

'ర చ యి త'

నా జీవితమంతా నిరీక్షతోనే సాగిపోయింది. ఇక ఆనిరీక్షణకు గూడ అవకాశం దాటిపోయింది. ఈ నాడు నా నలభయ్యవయేట కూర్చొని గడచిన నా జీవితాన్నంతా సింహావలోకనం చేసుకుంటూ వుంటే- నేనెంత అసమర్థతతో - అజ్ఞానంతో - ఆ యా ఘట్టాల్లో ప్రవర్తించానో - నాకైనాకే ఎంతో చిన్నతనం వేస్తుంది. ఎంతో బాధగూడా కలుగుతుంది. విజ్ఞతకలిగివుండి గూడా అంత అజ్ఞతతో ప్రవర్తించాను గదా అని ఈ నాడనిపిస్తున్నది! అవకాశాల నెన్నిటినో అహంకారంతో కాలదన్నేసుకున్నాను గదా అని ఈ నాడనిపిస్తున్నది!

ఇంత చదువు చదివి నేనేం ప్రయోజనం పొందాను? ఇంత అనుభవం గడించి నేనేం లాభాన్ని పొందాను? అసలీ చదువే లేకపోతే బాగుండేదనిపిస్తుందొకొక్కప్పుడు. నా యీనిరాశాపూరిత జీవితానికి సంపూర్ణంగా కాకపోయినా కొంతవఱకైనా బాధ్యత వహిస్తుందీ చదువు. ఈ విద్యయొక్క అర్థాన్ని నేను సక్రమంగా పాటించే వుంటే సత్ఫలితాన్ని మాత్రం పొందివుండే దాన్ని.

ఆశల జయించగల మన్నది కేవలం ఆదర్శవాదం. లౌకిక జీవితానికి బద్ధులమై వున్నంతకాలం దాన్ని ఆచరించడం కష్టం. పారమార్థికదృష్టి అలవరచుకొని తదనుగుణంగా ఆచరించిననాడే కోరికల కొంతవరకూ జయింపగల మేమో! విముక్తి పొందాలని అనుకోవడమే గాని విడనాడడం కష్టం! అణిచిపెట్టే కొద్దీ

యీ కోరికలు ఉబికిఉబికీ పైకివచ్చి విశృంఖల విహారం చేస్తాయ్ ! వాటికి సంబంధించిన పాత ఘట్టాలను స్మృతిపథంలోకి తీసుకొస్తాయ్ !

నా బాల్యమంతా పల్లెటూళ్లో గడిచి పోయింది. ఆజీవితాన్ని తల్చు కున్నప్పుడల్లా నా గుండెల్లో ఝల్లుమంటుం దీ నాడు గూడా. ఆ నా డనుకున్నట్టే చేసివుంటే ఈ నాటికి నే నేమై వుండేదాన్నో. వుంటే యే స్థితిలో వుండేదాన్నో. నిరాశతోనూ నిర్లిప్తతతోనూ నిండిన యీ ప్రస్తుత జీవితం కంటేగూడా చాలా అధమస్థితిలో మాత్రం వుండి వుండేదని బాగా వూహించ గలను.

ఆ పల్లెపట్టునుండి నన్ను తప్పించిన మామయ్యకు నాధన్య వాదాలు. ఈనాటికి గూడా నా హృదయంలో ఆయనకు దేవుడి కున్నంత స్థానం వున్నది. అప్పట్లో ఆయన వుద్యోగం చేస్తున్నా డని పేరేగాని చేతికీ నోటికీ అందేదేగాదు. మా తల్లి చనిపోయి వుండడంవల్లా - మారుదల్లి చీటికీ మాటికీ మాడ్చుక తింటూ వుండడంవల్లా- నా మచ్చను కడిగివేయాలనే వుద్దేశంవల్లా- నన్ను తాను పెంచడానికే నిశ్చయించు కున్నాడు మామయ్య. ఆ విషయం ఆ నాడు మా నాన్నతో అన్నపుడు మా నా న్నెంతగా గింజుకు న్నాడో, అదిదురభిమాన పూరితులైన,తలిదండ్రులకే అర్థంకావాలి. నాసంగతి తెలిసిగూడా మామయ్య నన్ను తనింట్లో వుంచుకోడానికి ఒప్పుకున్నా డంటే, అతనెంత ఉదార హృదయుడో అర్థమవు తుంది.

మానాన్న ఒప్పుకోక పోవడానికి ముఖ్యకారణంయేమిటంటే మామయ్య నన్ను చదివించా లన్నాడు గాబట్టి. ఆనాడు వాగ్వాదంలో నేను చేసినతప్పు ప్రసక్తికి వచ్చినపుడు, "ఈ వెధవకు చదువెందుకు? ఏ చవటనో చూచి ముడివేస్తే పోతుంది తెలియని చోట" అన్నాడు. ఈ చదువులు చదివితే పాడైపోతారని ఆయన అభిప్రాయం మా నాన్నమాదిరి యెగిరెగిరి కేకలు వేసేవాడు గాడు మామయ్య. ఆయన అక్కసలు-నేరారోపణలు-నిర్ధారణలు-అయినంతవఱకు మౌనంగా వుండి "కావచ్చు కావచ్చు" అంటూ తలవూచి ఆయన కాస్తతగ్గినాక "పాతధోరణిలో ఆలోచించకు బావా! పిల్లతనంలో యేదో పొరపాట్లుచేస్తే అది జీవిత పర్యంతం అంటిపట్టుకొని వుంటుం దనుకోకు. వయసునుబట్టి- వాతావరణాన్ని బట్టి- సహవాసాన్ని బట్టి- ఏదో కొన్ని పొరపాట్లు చేయవచ్చు. అదంతా అజ్ఞానంవల్ల జరిగేది. అజ్ఞాన వినాశనానికి విద్యే విరుగుడు" అన్నాడు. అప్పటికి మానాన్న తగ్గాడు. "ఇష్టమయితే యిక్కడ వుంచుకోగాని ఈమాల చదువులు మాత్రం చెప్పించకు" అని ఆవేశంతో వెళ్ళాడానాడు.

తర్వాత నాకుచదువూ సాగింది. ఆవిషయం మాయింట్లోనూ తెలిసింది. మొదట మొదట కాస్త యిష్టంలేకున్నా తర్వాత పరిపాటైపోయింది. మా నాన్నగూడ తర్వాత యేమీ అనలేదు. ఏదయినా అంతే! సంస్కారవాసనాబలంవల్ల మనం కొత్తవి ప్రవేశపెట్ట దలచుకుంటాం. పాతవాళ్ళ కవి గిట్టవు. వాళ్ళు మన అభిరుచి నందుకొనే స్థితికి వచ్చేవరకూ మనం వేచివుండలేం

వేచివుండా లనడం అవివేక వాదం. ప్రతిఘటిస్తా రని మాత్రం ప్రవేశపెట్టకుండా వుండగూడదు. ప్రథమంలో ప్రతిఘటించినా పోను పోనూ పరిపాటైపోయి కడకు వాళ్లుగూడా అదే పాటిస్తారు. ప్రస్తుతం అవిద్యాపరులుగానూ, పూర్వాచార పరులుగానూ వుంటూ నవనాగరికమైన అలవాట్లన్నీ అలవర్చుకున్న వారందరూ యిందుకు తార్కాణమే! వాళ్ళను కపటులనండీ - నిష్కపటు లనండీ - కాలప్రవాహానికి యెవరూ యెదురీదలేరు. ప్రతిఘటిస్తూనే ప్రవాహంలో పడిపోతారు. ప్రవాహంలో పడిపోతూ గూడా ప్రతి ఘటిస్తూ వుంటారు. పర్యవసానం యేమిటంటే ప్రవేశించిన సంస్కరణ పాదుకొని మాత్రం పోతుంది.

ఓనమాలనుండీ మొదలుపెట్టవలసిన అవస్థ పట్టలేదుగాని ఏబీసీడీల నుంచి మొదలు పెట్టారు. మాతృభాషలో కొంత చొరవ వుండేది నా కప్పటికే. అందుచేత కొత్తభాష గూడా సులభంగా పట్టుబడింది. విద్యావసరాన్ని గూర్చి మామామయ్య బోధించిన బోధా - ఇరుగు పొరుగమ్మాయిలూ మామయ్యకూతురూ అందరూ చదవడమూ - భావిజీవితంలో చదువువల్ల నాకుగల అవసరమూ - ఇవన్నీ నాకు చదువుపైగల శ్రద్ధను పెంచాయి. పట్టుదలా హెచ్చింది. పైగా వయసుగూడా వున్నది. అప్పటికే నాకు పదహారేండ్లు నిండాయి. మరు సంవత్సరంలోనే నాలుగవ ఫారంలో చేరాను.

మగపిల్లల స్కూల్లో చదవనందుకు నాకు నేనే ధన్యవాదా లర్పించు కున్నాను. వాళ్ళ ఎకసక్కెములనుండీ - చాటు మాటుగా

కూసే తుంటరికూతల నుండీ - అర్థం లేకుండా వాళ్ళుపెట్టే పేర్ల నుండీ- అనవసరంగా వాళ్ళు గోడలపై చెక్కే శాసనాల నుండీ - తప్పించు కున్నానని తృప్తిపడ్డాను. ఆడుపిల్లల స్కూల్లో అవి లేకపోయినా అంతకుమించిన కొన్ని అసహ్యపు చేష్టలు చూశాను. అసూయ, అనుమానం, కపటప్రవర్తన. ఇత్యాదుల స్వయంగా చూశాను.

కాలేజీలో చేరిన కొత్తలో అంతా సుముఖంగానే కనిపించింది. మగపిల్లల కాలేజీఅయినా ఫరవాలే దనిపించింది. హైస్కూళ్ళలో మాదిరి కాకుండా కాలేజీ విద్యార్థులు కొంత పెద్దమనుషుల్లాగా ప్రవర్తిస్తారని స్కూల్లో వింటూ వుండేదాన్ని. అన్ని వ్యవహారాలూ చాలా ఉన్నతపంథాలో నడుస్తాయని ఊహించు కుంటూ వుండేదాన్ని. వచ్చిన కొత్త కొత్తలో అంతే ననిపించింది.

ఒకనాడు క్లాసుకు పోతున్నాం. కుడిప్రక్కన వరండాలో పదిమంది పిల్లవాళ్ళు నిలబడి చూస్తూ వున్నారు. వాళ్ళను చూడగానే మా అడుగులు తడబడ్డాయి. ఈ తడబడటం కొత్తగాదు. ఇది మామూలే. కాలేజీకి రాకముందు నడక విషయంలో నా కను మానం యేనాడూ లేదు. కాలేజీకి వచ్చినాక నడవట మన్నది మరచిపోయాను. అడుగులు ముందు కేస్తున్నామో వెనక్కేస్తున్నామో మాకే తెలిసేదిగాదు. అదరా బదరా యెట్లాగో నడిచి వెళ్ళి కుర్చీల్లో కూలబడే వరకూ మా ప్రాణాలు యెక్కడో వుంటాయి. అపుడు దూర్తారు పిల్లవాళ్ళందరూ క్లాసుల్లోకి. అంత వరకూ మా నడకలపైనా, కండ్లపైనా, మా చేతుల కదలికలపైనా

మా నడుముల మెలికలపైనా-వ్యాఖ్యానాలు చేస్తూవుంటారు. వాళ్ల కండ్లల్లో పడగానే మా కండ్లల్లో బెదురు ప్రవేశిస్తుంది. కాళ్ళు తడబడతాయి. "అబ్బా! లేడికండ్లురా" అంటాడొకడు. "నడక చూశావా "హంసనడక" అంటాడు మరొకడు. "జడ నాగుబాం పడగరా" అంటా డింకొకడు. "డ్యాన్సు చేస్తున్నదిరా" అంటా డింకొకడు. ఇట్లా వ్యాఖ్యానిస్తూ వుండగా మేం చెదిరిపోవడం-గాభరాపడడం- మెలికలు దిరిగి నడవడం- ఒకర్ని మించి ఒకరు ముందుకు దుముకి పారిపోదాం అని పరిక్రమించడం-ఈ తొందర్లో ఒకరిమీద ఒకరు పడడం- ఈ సంభ్రమం చూచి వాళ్లొక్కుమ్మడిగా నవ్వడం.........ఛీ! ఛీ!—అంతటితో పోదుగా! అందరికీ పేర్లు. ముచ్చటగా మూణ్ణెల్లు గూడా దాటకముందే అందరికీ పేర్లు పెట్టేశారు. నాకుమాత్రం లేదని నేను తృప్తిపడుతూ వుండేదాన్ని. "వాళ్ళ పుణ్యాన నాకేమీ పేరు పెట్టలేదమ్మా" అని ప్రతిపిల్లా అంటుంది. అని తృప్తిని ప్రకటిస్తుంది. మరి, వాళ్ళు సంబోధించే ఆ పర్యాయ నామాలన్నీ ఎవరికోసరి! నిర్దిష్టంగా తెలిసినా తెలియక పోయినా తలా ఒకపేరో రెండుపేర్లో వున్నాయని నేను నిర్ధారించు కున్నాను. ఈ దినం కుడిప్రక్కన నిలబడిన పిల్ల వాళ్ళల్లో రామేశం గూడా వున్నాడు.

రామేశం నాకు బాగా తెలుసు. కొత్తగా నేను కాలేజీలో చేరే నాడు జీతం కట్టడానికి వెళ్ళినపుడు, రమణకుమార్ హెడ్ గుమాస్తా కిటికీవూచలు పట్టుకొని వ్రేలాడుతూ వున్నట్టుగా అటూ యిటూ వూగుతూ - తల అటూ యిటూ ఆడిస్తూ కూన

రాగాలు దీస్తూ వున్నాడు. రామేశం అతని ప్రక్కన నిలబడి వున్నాడు మరొక వైపుచూస్తూ. నేనూ, నా క్లాసుమేటు శాంతా వెళ్ళి నిలబడ్డాం. వెనుక మరి కొంతమంది మగపిల్ల లొస్తున్నారు. మా కంతా కొత్త కొత్తగా గాభరాగా వున్నది. రమణకుమార్ మా వైపు చూడలేదు. ఆ గుమాస్తా వ్రాయడానికి గంటలు తీసు కుంటున్నాడు. మా పని ముగించుకొని పోదామన్న తొందరలో "ఏమండీ కాస్త........." అని అంటూ వుండగానే ఉలిక్కి పడ్డట్టై ఒక ప్రక్కకు ఒదిగి నిలబడి అదొక మోస్తరుగా చూశాడు రమణకుమార్. అతన్నిచూచి నాకు నవ్వొచ్చింది. రామేశం అతన్ని ప్రక్కకు తొలగమని, తన పని తర్వాత చూచుకో వచ్చని "ముందూ వాళ్ళది కానివ్వండి" అన్నాడు గుమాస్తాతో. మేం పని ముగించుకొని థ్యాంక్సు చెప్పి వచ్చేశాం.

ఒకగంట తర్వాత ఆడుపిల్లల గదిదగ్గరికొచ్చా రిద్దరూనూ. వచ్చి నాకు టైంటేబుల్ యిచ్చారు. అసలు టైంటేబుల్ ఎట్లా వ్రాసుకోవాలో మా కర్థమే కాలేదు, ఆ గుర్తులకూ, నంబర్లకూ అర్థమేమిటో తెలియనేలేదు. రమణకుమార్ కు బోధిస్తూ మాకు కూడా బోధించడానికి వచ్చాడు. నేను రామేశా న్నడిగాను ఏ క్లాసని! బి.ఎ ఆఖరు సంవత్సరం అని చెప్పాడు. అంతే! అప్పటినుండీ మా కిద్దరికీ బాగా పరిచయం. అపుడపుడూ గది దగ్గరకొచ్చి మాట్లాడుతూ వుండేవాడు. మాట్లాడినంత సేపూ చాలా మర్యాదస్తుడుగా - అమాయకుడుగా కనిపించేవాడు. ఒకనా డతడు మామూలుగా మా యింటికి వచ్చాక కూర్చోమ్మని కాఫీ

యిచ్చాను. తాగినాక కాసేపు కబుర్లు చెప్పుకున్నాం. కబుర్ల సమయంలో కాలేజీ అమ్మాయిల ప్రసక్తి వచ్చినపుడు అలవోకగా అడిగాను ఎవరెవరికి యేమేం పేర్లున్నయో నని. వరుసగా చెప్పాడు. అందరివీ చెప్పాడు. మాష్టర్లపై నున్నవీ చెప్పాడు. ప్రిన్సిపాలుకున్న సహస్రనామాలు గూడా వల్లించాడు. నాకేం పేరుందో చెప్పలేదు. నే నడిగాను. ఏమీ లేనన్నాడు. లేనే లేదన్నాడు. అసూయనిస్తూ గూడా కొంత తృప్తిపడ్డాను

ఆ దినం వరండాలో నిలబడి వాళ్ళ మామూలు ప్రకారం సాగిస్తూ వుంటగా "నాకేం పేరుందో చెప్పరూ?" అన్న గొంతుక వినిపించింది. నేను తటాలున ఆ వైపు చూశాను. చూపులు మరల్చు కుంటున్న రామేశం కనిపించాడు. ఈ లోగా "నీకు తెలియదూ? నీ పేరు ముచ్చంగి" అని మరొక గొంతుక వినిపించింది. అప్పటి కర్థమైంది ఈ ముచ్చంగి అన్న పర్యాయనామం మందేనని, రామేశాన్ని చంపుదా మన్నంత ఉద్రేకం వచ్చింది. అదివరకున్న సద్భావమంతా తుడిచి పెట్టుకొని పోయింది. అసహ్యమూ కోపమూ విజృంభించగా. కొంత పద్దంటూ వున్నా, రామేశంపైన ప్రిన్సిపాలుకు ఫిర్యాదు చేశాను.

ఆ సాయంత్రమే రామేశం ఆడుపిల్లల గది దగ్గర కొచ్చాడు. వచ్చి నన్ను పిలిచాడు, బయటి కొచ్చాను. నా మొగం తీరుచూచి అతను వెల వెల పోతున్నాడు. అతని మొగం చూచి నాకు పళ్ళు మండిపో తున్నది. ఉద్రేకం యెంత అణుచుకొన్నా అణగలేదు. "మళ్ళా యే మొగం పెట్టుకొని వచ్చావూ

మాట్లాడ్డానికి'' అని అన్నాను రొప్పినట్లుగా. "పొరపాటు పడు తున్నావు" అన్నాడు క్లుప్తంగా.

"పొరపాటు గిరపాటు ఏమీలేదు. స్వయంగా నిన్ను నేను నా నాకండ్లతో చూశాను"

"అందుకోసమే యిపుడు రావడం. కాస్త క్షమించి వినాలి."

''క్షమించాలి! అబ్బా! ఎంత మెత్తని మాటలు! ఆ గొంతులు కోసే బాష యెందుకు ప్రయోగిస్తావ్? నీ వెంత పూసుకొచ్చి మాట్లాడినా విరిగిన హృదయాన్ని అతికించలేవు. విరుద్ధమైన రెండు పనులూ ఒకేహృదయం చేయలేదు. చేస్తామనుకోడం అది కపట మార్గమే!" అంటూ వెనక్కి తిరిగాను. అట్లా చూచేటప్ప టికి ఆడుపిల్లలు కొంతమంది వింతగా వింటున్నారు. వెనక్కి తిరిగి చూశాను. అతను మొగం దిగేసుకొని పక్కకు తిరిగాడు.

నేను లోపలికివెళ్ళి నిశ్శబ్దంగా కూర్చున్నాను.

"ఏమిటి ఏమిటి?" అని అందరూ అడుగుతున్నారు.

''బుద్ధిలేని రాస్కెల్స్! తమ అందం గాడిదల్ని పోలినా ఇతర్లకు పేర్లుపెడతారు. ఈ దెబ్బతో ఇక మన జోలికి రారు చూసుకో" అన్నాను సీరియస్‌గా. ఎందుకోగాని అందరూ సంతోషించినట్టు కనబడలేదు. పర్యవసానం యెట్లావుంటుందో అని భయపడ్డారేమో అనుకోడానికి గూడా అస్కారంలేదు. ఎవరిపాటికి వాళ్ళం వెళ్ళి పోయాం.

రాత్రి పడుకున్నాక ఆలోచనలో పడ్డాను. రామేశం యెని మిది నెలల పరిచయమంతా ఒకమారు నాటకంలాగా మనోనేత్రం ముందు సాగింది. అతన్ని తొలిగాచూచిననాడే అతనంటేనాలో ఒక

విధమైన సద్భావం యేర్పడింది. అది పోను పోనూ అభివృద్ధి పొం దింది. అతనుగూడా నేనంటే చాలా ఆప్యాయతతో చూస్తున్నట్టు కనబడతాడు. నేను పుస్తకాలు కొనలేనని పాతపుస్తకాలు సంపా దించి తెచ్చి యిచ్చాడు. నోటు బుక్కులకు కాగితాలు గూడా యిచ్చాడు. నా మాటలు పెళుసుగావున్నా నిష్కపటంగా వుంటా యనీ- అట్లా వుండడమే తన కిష్టమనీ నిష్కాపట్యానికి తోడుగా ఆ పెళుసుదనం లేకపోతే ఎంతో మంచిదనీ - నా దగ్గర రెండు మూడుసార్లు అన్నాడుగూడ. నాకుగూడా అతనంటే సద్భావమే! మరి యీ దినం జరిగిన పనేమిటి? అతనావిధంగా చేయిస్తాడా! తనతో అన్నమాటలే ఇతర్ల నోటిగుండా యెట్లా వెలువడ్డాయి? రామేశం కపటి అనే నిర్ధారణకు వచ్చాను. తాముచేసే సాహసం లేకపోగా ఇతర్లచేత అల్లరిచేయించి ఆనందపడే పిరికిపందలు వేనకువేలు! అట్లాంటి వాళ్ళల్లో వొకడనీ-నీచస్వభావుడనీ-నిర్ధా రించుకున్నాను.

మరునా డుదయం నేను కాలేజీకి బయలుదేర బోతున్నా. రామేశం నా గది కిటికీదగ్గర ఆగాడు. అతన్ని చూడగానే నాకండ్లు భగ్గున మండాయి. చేయిచాచి కిటికీ లోపలివైపు ఒక జాబుపెట్టి వెళ్ళబోతున్నాడు. నేను అగ్గి తొక్కినట్లుగా "బుద్ధి వుందా లేదా? చేసిందిచాలక పైగా జాబులు గూడానా?" అన్నాను. అతను తల వంచుకొని బిరబిరా వెళ్ళి పోయాడు. నా గాండ్రింపు విని మా మామయ్య ఆ సమీపంలోనే వుండి యిట్లా చూశాడు. మామయ్య కూతురుగూడా వచ్చేసిం దక్కడికి. నేను బిరుసుగా బయలుదేరాను కాలేజీకి.

ఒక అర్ధగంట ముందుగానే కాలేజీ చేరాను. శూన్యంగా ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో మా శాంత వచ్చింది. సద్దు గాకుండా నా ప్రక్కన వచ్చికూర్చుంది. నా చేతిని తన రెండు చేతుల్లోకి లాక్కొని "నిన్న చాలా గొడవ జరిగిందట" అంది.

"అవును'' అన్నాను ముక్తసరిగా. ''నేనుండివుంటే బాగుం డేది" అంది.

''ఎందుకు? ఆవెధవను వెనుకేసుకు రావడానికేనా? అన్నాను.

"నీవు మాట్లాడు తున్నది రామేశాన్ని గురించేనా"

"అవును! వాడే! సన్నగా వెదురు దబ్బలాగా!"

శాంత నన్నుమూలకు లాక్కెళ్ళింది. అక్కడ కూర్చున్నాం. "నే నంతా విన్నాను హసంతీ! నీవువట్టి ఉద్రేకివి. మనుషుల్ని అర్థం చేసుకోడం నీకు తెలీదు. ఎంతతోస్తే అంత అనేస్తావు. "ఇక మనజోలికి రారుచూచుకో" అని ప్రతిజ్ఞలుగూడా పలికావట నిన్న. నిజమే! రామేశం గాబట్టి మనకిక భయంలేదు. మరింకెవ డన్నా రౌడీగాడయితే మనగతే మవుతుందో తెలుసా? అందర్నీ కూడగట్టుకొని, మనకు చరిత్రలు కల్పించి, శాసనాలు చెక్కేశే వారీపాటికి గోడలపైన. అటువంటివాణ్ణి అంత ముక్కూ మొగమూ యెరక్కుండా మాట్లాడ్డానికి నీ కెట్లా మనస్కరించింది?" అంది శాంత. ఆ వెనుకేసుకు రావడం నన్ను మరింత రెచ్చగొట్టింది.

"అయితే తాను పక్కనవుండి ఆ మాదిరి అనిపించ వచ్చా?" అన్నాను.

"అటువంటి వాళ్ళలో వుండడం యెప్పుడైనా చూశామా అతన్ని? ఈ దినం అక్కడ వుండడం కాకతాళీయం. ఘర్షి, సహ

విద్యార్థులతోపాటు వుండడం గూడా తప్పంటే యెలా హసంతీ!
అది నేరమంటే యెలా"

"మొన్న నేనడిగినమాటే ఈ దినం నాపైన ప్రయోగింపబడిందిగదా, అతడు పిరికిపంద్లై ఇతర్లచేత అనిపించడం గాదా? పైగా ఈ దినం..........."

"ఆఁ ఈ దినం! ఏం జరిగిం దేమిటి?"

"ఉదయం జాబు వ్రాసి నా కిటికీలోవేసి పోతున్నాడు. నేను గట్టిగా ఛీవాట్లు పెట్టాను"

"ఏం వ్రాశాడేమిటి? నేను చూడవచ్చా?"

"అక్కడే వదిలేశాను."

"ఇంతకూ చదివావా?"

"ఎందుకు చదువుతుందీ? ఇదివట్టి ఉద్రేకి" అంటూ అప్పుడే వచ్చిన వాళ్ళ మామయ్య కూతురు ఆ జాబు మా ముందువిసిరింది. దాన్ని నేను చేతిలోకి లాక్కొని "అయితే విను! ఆ జాబులో యేముందో నాకు తెలుసు. నిన్న సాయంత్రమే మా యింటి కొచ్చాడు రామేశం. వాళ్ళు మా యింటి ప్రక్కకు మారిం తర్వాత మా యింటి కొచ్చావా? అవును! వచ్చావు! ఆ నాడు నీవూ అతనూ చాలాసేపు చాలా విషయాలు మాట్లాడు కున్నారు గూడా విన్నవచ్చి చాలా దిగులుగా కూర్చొని జరిగిందంతా చెప్పాడు. మన క్లాసుమేటు రమణకుమార్ అతని రూంమేటని నీకుతెలుసు. భలే సరదా మనిషి అతను. రౌడీల్లోకిరౌడీ పెద్దమనుషుల్లోకి పెద్ద మనిషి. రామేశం అంటే ప్రాణా లర్పిస్తాడు. అతనంటే యెంతో భయభక్తులు గూడా చూపిస్తాడు. రామేశంకు నీవంటే సద్భావం.

గాబట్టి రమణకుమార్‌కు గూడా అంతే! మొన్న నీకూ రామేశంకూ మీ యింటివద్ద జరిగిన సంభాషణ రమణకుమార్‌కు చెప్పాడు. అతని స్నేహితుడైన తిప్పారావుతో అతనన్నాడు. వాడు రౌడీలతోచేరి నిన్న ప్రయోగించాడు. ఆ తర్వాత యెంత జరిగిందో నీకు తెలుసా? రాత్రి తొమ్మిది గంటలకుగాని రాలేదు రమణకుమార్ గదికి. మేము సినిమా కెళ్ళాడేమో అనుకున్నాము. సిని మాకు వెళ్ళాడన్న నమ్మకం లేదు. ఎందుకంటే రామేశం అనుజ్ఞ లేందే యెక్కడికీపోడు. మేము అతని కోసమే యెదురు చూస్తున్నాం. అప్పటి కొచ్చాడు చినిగిపోయి ధూళి ధూసరితమైన బట్టలతో మట్టి బొమ్మలాగా! ఆ ఆకారాన్ని చూచి నేను భయపడ్డాను రామేశం ఆదరా బాదరా లేచి అతన్ని పట్టుకొని "యిదేమిట్రా యీ వేషం తమ్ముడూ?" అన్నాడు ఆశ్చర్యంగా. అతడు ధీమాగా "ఈ దినం ఆ తిప్పారావుగాడికి సగంప్రాణం తీసేశా నన్నయ్యా! లేకపోతే వాడు-రాస్కెల్-నోటికొచ్చినట్టు వదుర్తాడా? పౌర పాటున వాడితో మామూలు ధోరణిలో ఉదయం అన్నాను. వాడు తటాలున నోటికొచ్చిన కూతలు కూశాడు వరండాలో. అట్లా యెందు కన్నావురా అంటే- "అంటే యేమిరా" అన్నాడు వాగ్వాదం వచ్చింది. మా జట్టూ వాడిజట్టూ పోట్లాడుకుంటూ రైలుస్టేషనువద్ద మైదానం వరకూ వెళ్ళాం. వాడునోరు పారేసుకో కుండా వుండివుంటే యింతవరకూ వచ్చివుండక పోవును. యే మన్నాడో తెలుసా? దాన్నంటే నీ కేమోయ్! ఆ రామేశంగాణ్ని వెనకేసుకొని వస్తున్నావా? వాడు దానివెనక తిరగటం మాకు తెలీదను కున్నావా?" అని యిట్లాంటి కడుపుబ్బరపు మాటలు

మాట్లాడే టప్పటికి నా వొళ్ళు మండి పండ్లు కొఱికి డబా దబా అని నాలుగు బాదులు బాదాను. వాడుకింద పడ్డాడు. వాడి వైపువాళ్ళకూ నావైపువాళ్ళకూ యుద్ధం జరిగింది. బాగా పోట్లాడుకొని యిట్లా వచ్చేశాం." అంటూ రెండు పిడికిళ్ళూ బిగించి హస్తాలు లంబాకారంగా మడిచి. దండలు చూచుకొని తృప్తిగా మా వైపు చూశాడు. రామేశం అతని భుజదండాలపైన తడుతూ "సెబాస్! మీరంతా మరిరెండు శతాబ్దాల పూర్వమే పుట్టివుండాల్సింది తమ్ముడూ. నీ కింత బలమూ బలగమూవుందని ముందే తెలిసివుంటే దక్షిణాఫ్రికాపై దండయాత్రబయలుదేరే వాళ్ళంగా!" అన్నాడు చిరునవ్వు నవ్వి. అతన్ని స్నానానికి పంపించి భోజనం మా యింట్లోనే యేర్పాటు చేశాను. అతడు భోంచేస్తున్నాడు. బయట నేనూ రామేశం కూర్చున్నాం. అపుడు రామేశం :—

"చూశావా శాంతా! ఒకప్రాణిపైన కరుణ చూపడం గూడా స్వార్థంకోసం అన్నట్లు చూస్తుంది లోకం! కరుణ చూపడం ప్రేమచూపడం- ఇవి ప్రతిఫలాకాంక్షారహితాలని ఎవరికీ తెలియదు గాబోలు! ప్రతిఫలా కాంక్షతోటే ప్రేమించే వారికి అదెట్లా అర్థమవుతుంది. ఈనాటి సంఘటనవల్ల హసంతి మనసు నొచ్చుకుంటుందనీ- తద్వారా నేను బాధపడతాననీ-అందుకు కారకుడు తానే అవుతాననీ-ఈ దినం రమణకుమార్ కోపం వహించాడు. పర్యవసానం యేమయింది? ఏ కారణాన్ని పురస్కరించుకొని తానుకోపం వహించాడో, ఆ కారణం సూక్ష్మాకారాన్ని వదలి స్థూలాకారాన్ని దాల్చింది. కారణం లేనిదానికి కారణం కల్పించబడింది. ఈ కొట్లాటతో అది నిరూపితమైనట్టయింది. ఈ విషయ

మంతా యీ రూపంలో రేపు కాలేజీలో పొక్కితే, అసత్య వార్తను లెక్కించని నేనట్లా వుండగా వుద్రేకస్వభావంగల హసంతి యెంత బాధపడుతుందో! సాయంకాలం జరిగిన స్వల్పవిషయానికే నా మీద అంత నేరం మోపినామె ఇదంతా జరిగింది నా మూలాన్నే గదా అని నన్నెంతగా ఆడిపోసు కుంటుందో! ఎంతగా వ్యధ పడుతుందో?" అని అన్నాడు. ఏమి మాట్లాడ్డానికీ నాకు తోచలేదు. కాసేపు మౌనంగా కూర్చున్నాం. ఇంతలో రమణ కుమార్ ఫోంచేసి బయటికి వచ్చాడు. వచ్చీ రావడంతోటే యిద్దరూ కలిసి వెళ్ళారు.

మళ్ళా వుదయం వచ్చాడు రామేశం మా యింటికి. రాత్రి గదికివెళ్ళి రమణకుమార్‌ను మెత్త మెత్తగా మందలించి అంతకు ముందే తాను నిర్ధారించుకున్న ప్రణాళికను అనుసరింపుమని కోరాడట రమణకుమార్‌ను. అంతా విశదీకరించిన తర్వాత పశ్చాత్తప్తుడైన రమణకుమార్ అందుకు ఒప్పుకున్నాడట! నేరుగా తిప్పారావింటి కెళ్ళారట యిద్దరూ కలిసి. తిప్పారావుకుగూడా రామేశం అంటే గౌరవమే! బాలబాలికల్లో చాలామందికి అతనంటే గౌరవం. ఇంతెందుకు? నిన్న నీవతన్ని ఆ విధంగా అంటూవుంటే మన బాలికలంతాగూడా నీవు పొరపడ్డావని నొచ్చుకున్నారట! అందుకేనట వాళ్ళేమీ పలక్కుండా వుండిందిగూడాను. ఆ విషయం నాకు విశాలాక్షివల్ల తెలిసింది. అపుడు తిప్పారావుగూడా ఇతన్ని చూడగానే కాస్తగాభరా పడ్డట్టుగాలేచి ఆహ్వానించాడట! తర్వాత జరిగిందాన్ని గురించి విశదీకరించడం అనవసరం. పర్యవసానం యేమిటంటే-తిప్పారావు రామేశాన్ని క్షమాపణ కోరగానే రమణకుమార్

తిప్పారావును క్షమాపణ కోరుతూ కరచాలనంచేసి భుజంపై చెయ్యేశాడట! వాళ్ళిద్దరూ మళ్ళా మిత్రులై వాళ్ళ మిత్రబృందానికె అప్పటి కప్పుడే తెలియజేసి సాయంకాలం జరిగిన సంఘటన ఎక్కడా పొక్కకుండా చేయాలనీ, అథవా పొక్కినాదానికి మరొక రూపంగూడా యివ్వాలని తీర్మానించు కున్నారట! అక్కడనుండి గదిచేరుకొనే టప్పటికి రాత్రి పన్నెండుగంట లయిందట! ఇదంతా చెప్పి అసలువిషయం నీకు తెలియచెయ్యక మెల్లాగా అన్న సం దిగ్ధావస్థలో పడ్డా... చెబితే నీవు నమ్మవేమో! దీన్ని కల్పిత మనుకుంటా వేమోఅన్న సందేహం పట్టుకుంది. ఆలోచించి "చూడు శాంతా! సత్యాన్ని అనుమానిస్తే అనుమానించిన వారిదే దోష మవుతుంది. కాని అన్యథాకాదు. కాబట్టి నేను ఈ విషయా న్నంతా ఆమెకు నివేదిస్తాను" అన్నాడు.

"వెళ్ళి అంతా విశదీకరిస్తావా" అన్నాను.

"కాదు. ఆమెవైపు చూడ్డానికిగూడా ఆమె వ్యవధి యివ్వదు. జాబులో అంతావ్రాసి ఏకాంతంలో అందిస్తాను" అన్నాడు

అదే బాగుందన్నాను. అదీ యీజాబు. మరొక్కవిషయం. నిన్న మచ్చంగి అన్నది నిన్నుగాదు. రాద్ధాంతికంగా నిన్నుద్దేశిం చినా అది నీపేరుగాదు. ఏదో నోటికొచ్చింది అరిచాడు అంతే! వాళ్ళుపెట్టే అన్నిపేర్లకు ఏ విధంగా అయితే అర్థంవుంటదో దానికి గూడా అంతే! సమయానికి ఏది నోటికొస్తే అది అనేస్తారు."

"అయితే అంతే నంటూవా! పొరపాటు నాదే కావచ్చు" అన్నాను.

"అదేగాదు. మరొక పొరపాటుకూడా చేశావు. నిన్న ప్రిన్సి పాలుకు రిపోర్టుచేశావు. ఇంతమంది అమ్మాయిల ముందు దుర్భాష

లాడావు. ఉదయం అతన్ని మళ్ళా తిట్టావు. మీ వాళ్ళందరూ వింటూవుండగా నీచంగా మాట్లాడినట్లు నీవే అన్నావు. అతనెంత క్షమాహృదయుడైనా దానికిగూడా హద్దు వుంటుంది" అంది శాంత మందలించి నట్లుగా.

ఇంతలో గంటకొట్టారు. అందరమూ క్లాసుల్లోకి వెళ్ళాం. పగలు చాలాభాగం గడిచింది. ఇంతవరకూ మళ్ళా అతను నాకు కనబడక పోవడంతో నా హృదయంలో కలిగిన లోటువల్ల నేనపు డర్థం చేసుకో గలిగాను అతనికి నా హృదయంలో స్థానముందని. ఆలోచనలన్నీ అతని విషయమయ్యే సాగడం మొదలిడినయ్. నన్ను నేను పరిశోధించు కుంటూ కూర్చున్నాను. ఎంత పరిశోధిం చినా నేనిదివఱ కతన్ని ప్రేమించినట్లు నిరూపణకాలేదు. సద్భావం స్నేహభావం మాత్రమే వున్నట్లు రుజువౌతున్నది. అయితే యీ నా డతని విషయమై నా హృదయ మెందు కింతగా క్షోభిస్తున్నది? క్షోభిస్తున్నదని ఆనాడు మాత్రమే కనుగొన్నాను. అతడు నన్నాక ర్షించాడని గూడా ఆనాడు మాత్రమే గమనించాను. ఈ మార్పు ఈనాడే కలిగిం దెందుకు? ఇంత హఠాత్తుగా యెట్లా కలుగుతుంది? ఇది అమాంతంగా ఒక్కనాడు కలిగిందిగాదుగదా! పరిణామాన్ని పొంది యీ నాటికీరూపం ధరించిం దనుకున్నాను. అయితే నిన్న ఈ భావం యెందుకులేదు. పోనీ అంతకు ముందింత తీవ్రంగా యెందుకులేదు. ఈ నాడు పశ్చాత్తాపంవల్ల కలిగిందేయిది. సాను భూతివల్ల బలపడిందే యిది!

ఇంతకూ రామేశం యెక్కడికి వెళ్ళాడో? ప్రినిపాలు వెళ్ళ గొట్టాడేమో! సమీపిస్తున్న యూనివర్సిటీ పరీక్షల తలచుకొని

బాధపడ్డాను. నాలో నేను విచారించాను. కాలేజీ చాలించేస్తాడేమో అన్న భావంగూడా మెరిసింది, వెంటనే అట్లా జరగదని గూడా అనుకున్నాను. ఎందుకంటే అతను అపవాదులకు భయపడే వ్యక్తి గాదు. అతన్ని చాలింపించే అపవాదులుగూడా యేమీలేవు. నిన్నటి విషయాన్ని పుబ్బంలోనే తొక్కేసినట్లు శాంత చెప్పింది పుదయమే! అయితే అతనెందుకు రాలేదీనాడు? నేనతన్ని ఉనయం దుర్భాష లాడిన విషయం మళ్లా జ్ఞప్తికొచ్చింది. ఎంతో బాధపడ్డాను. బాధతో కృంగిపోయాను. నన్ను నేనే చాలా నిందించు కొన్నాను. అతను నిజంగా నా కంట కనబడదేమో అని నొచ్చుకున్నాను.

అయితే సాయంకాలం కనిపించాడు. ఒంటరిగాగాదు. తిప్పారావుతో సహా! ఎక్కడంటే ప్రిన్సిపాలు గదిలో. అతన్ని అక్కడ చూడగానే నా హృదయం సంచలించింది. అతనుమాత్రం శాంతంగానే నిలబడి వున్నాడు. కాని నావంక చూడనేలేదు. "నేను ఫిర్యాదును ఉపసంహరించు కుంటున్నాను" అని అందామని నోటిదాకా వచ్చింది. మాటపిగిలి రాలేదు. ఇంతలో తిప్పారావు "మరి రెండునాళ్ళు తగ్గించండి" అనిప్రాధేయపడు తున్నాడు. వెంటనేరామేశం "అక్కర లేదండి" ఆ శిక్ష నేనే అనుభవిస్తాను నా పేరే బయటి కొచ్చింది గాబట్టి" అన్నాడు. ప్రిన్సిపాలు నవ్వాడు. "సరే రామేశం, ఈదినం మొట్లాగూ నీవు సస్పెండయ్యావు. రేపటినుండీ ప్రిపరేటరీ సెల వులు నీకు. తిప్పారావుమాత్రం వారం దినాలు సస్పెండయ్యాడు. ఇక వెళ్ళవచ్చు" అన్నాడు. వాళ్ళిద్దరూ వెళ్లిపోయారు తిరిగి చూడ కుండా,

## ౨

నా యీ బాధాగ్నికి ఆజ్యం పోసినట్లుగా మరొక సంఘటన జరిగింది మరునాటి క్లాసులో. తెలుగు లెక్చరర్ ప్రసన్నారావు గారు ఆ దినం చూచిన చూపులో అవహేళన కనిపించింది.ఆయన నిజంగా ఆ దృష్టి వహించాడో, లేక నేనే అనుమానదృష్టితో గుమ్మడికాయల దొంగలాగా ఆ విధంగా అపోహపడ్డానో-ఆ నాడు మాత్రం అట్లాతోచింది.

ప్రసన్నారావుగారి ప్రత్యక్షంలో నాగస్వరం ముందున్న నాగుబామే నా స్థితి. ఆయన ఆకర్షించినట్టు నన్నెవరూ ఆకర్షించ లేదు. ఆ ఆకర్షణ నేటికీ నాలో స్థితమై వుండడమే అందుకు తార్కాణం.

తొట్టతొలిగా తెలుగు క్లాసులో పొందిన ఆనందానుభూతీ, తృప్తీ, మరేక్లాసులోనూ, ఎక్కడనూ పొందలేదు. ఆ నాడు మొదటి గంటమాకు తెలుగు.ప్రసన్నారావుగారి సాక్షాత్కారం అదే ప్రథమం. గంట కొట్టగానే మాకు నిర్దేశించిన గదిదగ్గరకు వెళ్ళాం. మగపిల్లవాళ్లు చాలామంది లోపల కూర్చొని వున్నారు. లోపలంతా రొద రొదగా వుంది. మేం గదిగుమ్మం దగ్గర ఆగడం, మరొక వైపునుంచి ఒక నిరాడంబరమూర్తి రావడం-ఒక్కమారే సంభవించింది. మమ్ములచూచి "లోపలికి పదండ"ని సంజ్ఞచేశారు. మా వెనుకనే ఆయనా వచ్చారు. పిల్లవాళ్ళంతా లేచారు. ఆయన గూడా తన బల్లదగ్గర నిలబడి అట్లా చూచాడు ప్రసన్నంగా అందరి వైపూ. ఆ సౌమ్యాకారమూ - ఆ ప్రసన్న వదనము - ఆ చల్లని

దృక్కులు–ఆ దరహాసం– ఆ గదిలో ప్రత్యేక వాతావరణాన్ని సృష్టించినయ్. ఆయన నేత్రాలద్వారా ప్రేమామృతాన్ని అందరి పైనా వర్షించాడు. ఆ క్షణం మాత్రం నే నెన్నడూ అనుభవించని పారవశ్యాన్ని అనుభవించాను

అందరమూ కూర్చున్నాక ఒకప్రశ్న వేశాడు. "అర్వై మార్కులూ–అంతకుమించీ–వచ్చినవారు లెమ్మని. శాంత, రమణ కుమార్లు,లేచారు.యాభై అంత కుఎక్కువవచ్చినవారు లెమ్మన్నారు. నేను, మరో కమ్మాయి మరికొద్దిమంది మగపిల్లవాళ్లూ లేచాము. అందర్నీ కూర్చొమ్మని సంతోషాన్ని ప్రకటిస్తూ "మంచి మార్కులు వచ్చినవాళ్లూ–తక్కువ వచ్చినవాళ్లూ అంతా ఒకటే! తక్కువ వచ్చినవాళ్ళు న్యూనతపడడంగానీ ఎక్కువవచ్చినవాళ్లుడిప్పిపోవడం గానీ–అనవసరం. మెదడు దానాపు అందరికీ సమానమే. వ్యత్యాస మెక్కడుందంటే–కృషిలోనే.ఉపయోగపెట్టినవాళ్లు నాలుగుమార్కు లెక్కువతెచ్చుకున్నారు.ఉపేక్షించినవారు తక్కువ తెచ్చుకున్నారు. అంతే! వీళ్ళుగూడా కాస్త శ్రమిస్తే అంతకుమించి మార్కులు వస్తాయ్. కృషిలోనే వున్నదంతా. కృషిపల్లనే ప్రపంచంలోపేరెన్నికగన్న మహావ్యక్తు లంతాఅంతంతస్థానా లందుకున్నారు. నిరంతర కృషిపల్లనే మననేత గాంధీమహాత్ముడు అత్యున్నతస్థానాన్నందిపి యావత్ప్రపంచ మానవ హృదయస్థితుడైనాడు. మన మందరం ఆ గాంధీని ఆదర్శంగాపెట్టుకొని కృషిచేయాలి" అనిఅట్లాఅందరివైపూ చూశాడు. అంతేఅని నోళ్ళుతెరిచి జవాబు చెప్పలేదుగాని హృదయాల మాత్రం విప్పి జవాబు చెప్పాం.

లెక్చరర్ల గదిప్రక్కనే ఆడపిల్లలగది. మగపిల్లలకు పని బడితే గదిధగ్గరకొచ్చి మాష్టర్లతో మాట్లాడి పోతూవుంటాడు

మేం పిలిపి_స్తే మా గది దగ్గరికొచ్చి మాట్లాడి పోతూవుంటారు. యువక మాష్టర్లు. స్వేచ్ఛ తక్కువయినా యిటువంటి చిన్నచిన్న హక్కులు-ప్రత్యేకత ప్రదర్శించడాలూ చాలా చాలా వుంటాయ్. సీనియర్ విద్యార్థినులు మాష్టర్లను పిలిపించి మాట్లాడుతూ వుండటం చూశాను. నాకుగూడా ప్రసన్నారావుగారిని పిలిపించి మాట్లాడాలనే వుబలాట గలిగింది. పిలిపించడం కష్టంగాదుగాని కారణం చూప డమే కష్టం. ఇట్లా కొన్నాళ్లు జరిగింది. ఒకనాడు పిలిపించాను. ఆయన వస్తున్నారు. ఏం మాట్లాడాలి ? ఏమీ తోచడంలేదు. చిరు నవ్వు నవ్వుకుంటూవచ్చి "యేం హసంతీ! బాగాచదువు తున్నావా? "ఎట్లావుంధి కాలేజీ వాతావరణం !" "అన్నారు. ఇంకేం! నా పని జవాబులు చెప్పడమే! నేనుకా_స్త మురిపెంగా చేతులు విదిలిస్తూ" ఎట్లా చదవాలో తెలియడం లేదండీ మాష్టరుగారూ! అన్నీ ఇంగ్లీ షులో వుండడంవల్ల ఒకటీ అర్థం కావడంలేదు" అన్నాను మూతి బుడ్డగించి. ఆయన నా మూతిచూచి ముసి ముసి నవ్వులు నవ్వు కుంటూ "మీరు తెలుగులో చదివిన హిష్టరీ యిక్కడగూడా తెలు గులో వుంటే మీకు చదువు అనవసరంగా!మరి హిష్టరీ లెక్చరర్లెం దుకు ? అదేహిష్టరీని యింగ్లీషులో పెడితే యంయెవరకూ చదువు కుంటూ వుండవచ్చు" అని నవ్వాడు. ఆయనతో మాట్లాడుతూ వుండటం అంటే హాయిగా వుంటుంది. ఏనాడుగూడా ఆయనతో తృప్తిగా మాట్లాడలేదు. మాట్లాడుతూ వుంటారుగదా, "ఈ ప్రశ్న వేద్దాం!" అనుకుంటూ వుండగానే "సరే! అంతేనా?" అని వెళ్ళి పోయేవారు.

ఆయనక్లాసులు మాకెంతోజ్ఞానదాయకంగానూ సరదాగానూ వుండేవి. అట్లాగని మాలో ఎవరుగూడా చనువు తీసుకొనేవారం

గాదు. ఇతర్ల క్లాసుల్లో అల్లరిచేసే పిల్లలు సైతం ఆయన క్లాసులో చెయ్యరు. భయపడిగాదు. గౌరవంవల్ల. అదీగాదు ప్రేమపూర్వక భక్తివల్ల. ఏ భాషలోనైనా సరే కావ్యాల్లో ప్రేమఘట్టాలు తప్పని సరి! ఆప్రేమ ఘట్టాల వర్ణన వివరిస్తూ వుంటే యువకుల పని సరేసరి! ఇక తెనుగు ప్రబంధాల కత చెప్పడమే అనవసరం. అసభ్యమూ, అసహ్యమూ ఉచ్చస్థానంలో వుంటాయి కొన్ని తెలుగు కావ్యాల్లోని వర్ణనల్లో. ఆ ఘట్టాలు వచ్చినపుడు పిల్లవాళ్ళ ఉత్సాహ శక్తి తారాపథా న్నందుకొని సందుదొరికిందే తడవుగా వ్యాఖ్యానాలు ప్రారంభిస్తారు. వ్యాఖ్యానిస్తూ మావైపు చూస్తారు కొందరు. ఆ కొందరు గూడా మేము లేకపోతే ఊరికే కూర్చొనేవారే! ఎటువంటి ఘట్టాలొచ్చినాసరే, అటువంటి పిచ్చివేషాలు వెయ్యకుండా పిల్లవాళ్ళు గ్రహించ గలిగేది ఆ వొక్క క్లాసులోనే.

కొత్తకొత్తలో ఒక సంఘటన జరిగింది. తంజాపూరు యుగపు కవి అనుకుంటాను. ఒక కావ్యంలో స్త్రీ సర్వాంగాలూ వర్ణిస్తున్నాడు. మాష్టరుగారు తగిన విధంగా విమర్శించుకుంటూ పోతున్నారు. ఒక కుర్రవాడులేచి స్త్రీలేకాదు–సభ్యతగల పురుషులు సైతం తలవంచుకొనే టటువంటి ప్రశ్నవేసి చిరునవ్వు నవ్వుతూ మావైపుచూచి కూర్చున్నాడు. ఆయన కోప్పడలేదు. ప్రసన్నంగానే ఆ పిల్లవాడివైపుచూచి "కూర్చున్నావేం నిలబడు" అన్నాడు. అక్కడక్కడా నవ్వుతూండిన పిల్లవాళ్లు గూడా నవ్వాపేశారు. వెంటనే "ఏ స్త్రీకయితే, పుట్టి, పాలుత్రాగి, పెరిగి పెద్దయై ప్రయోజకు డౌతున్నాడో–ఆ స్త్రీనే నీచంగా నికృష్టంగా చూస్తున్నాడు పురుషుడు, తన జన్మకు, జీవికకు, కారణభూతమైన మాతృ

జాతిని న్యూనతాదృష్టితో చూడబట్టే మన సంఘం యింత అధో గతిలో వుంది. స్త్రీకిపుట్టి, స్త్రీని విలాస వస్తువుగా సృష్టించి కళతో వ్యభిచరించారు కావ్యకారులు. కవులు స్త్రీని శక్తిస్వరూపి ణిగా, మాతృదేవతగా భావించి వర్ణించివుంటే ప్రపంచంలోని ప్రబంధసాహిత్యమంతా నీతివంతమై ఆరాధ్యమై వుండేది. సాహిత్యం ద్వారానే సరైన నీతివ్యాప్త మౌతుందనే సత్యాన్ని కవులూ పతితలూ మరచిపోబట్టే యిటువంటి పిచ్చి సాహిత్యం దొర్లింది కొంతకాలం. దురావేశపరుడూ-కామావేశపరుడూ అయిన పురుషుడు ప్రస్తుతస్థితిని చూడగలడేగాని ముందు వెనుకలు చూడ లేడు. ఆ విధంగా చూచిననాడు స్త్రీ మాతృమూర్తి అని గోచరిం పకపోదు. ఆ గమనింపక పోవడం పాశవికం. మనం దానికి దూరగులం కావాలి. మాతృదేవతనూ, మాతృభాషనూ, మాతృ దేశాన్నీ, భక్తితో సేవించేవాడే కృతజ్ఞుడైన వ్యక్తి! బుద్ధిమంతు డైనవ్యక్తి!'' అన్నారు. ఆ పలుకుల్లో ఆవేశంగానీ-అస్పష్టతగానీ- ఏమీలేవు.

ఆ పలుకులు విన్న మేము ఆనా డెంతో సంతోషాన్ని పొందాం. ఆయనయెడ మా గౌరవం తారస్థాయి నందుకొన్నది. మగపిల్లలకు ఆడుపిల్లలకూ ఆయనంటే చనవూ, భక్తీ. ఆడుపిల్ల లకు ప్రత్యేకతలేంది ఆయన క్లాసుల్లోనే! అటెండెన్సు వేసేటప్పుడు అందర్నీ పిలిచినట్లే ఆడుపిల్లల్నిగూడా పేరు పేరునా పిలుస్తాడు. ప్రశ్నలు వేసేటప్పుడు ఆడుపిల్లలనుగూడా ప్రశ్నిస్తాడు. శిక్షించడం వరకువస్తే ఆడుపిల్లలనుగూడా శిక్షిస్తాడు. ఆయన శిక్షిస్తే అది శిక్షగాదు విద్యార్థులకు. అది అనుభవించడం సరదా.

అందానికి ఆకర్షింప బడుతుంది ప్రాణికోటి. బాహ్యమైన అందానికి ప్రాముఖ్యం యిచ్చినట్లయితే దీనిమనుగడ క్షణికమే. ఆంతరంగికమైన అందానికి ఆకర్షింపబడితే ఆ ఆకర్షణ ఆ శరీర పతనం వరకూ వుంటుంది. మామూలు అందగాళ్ళ వర్గంలో ఆయన చేరరు. లేనిదాన్ని అలంకరణవల్ల పొందాలని ఆశించరు. చాలా సామాన్య నిరాడంబరమూర్తి. ఆయన వస్త్రధారణ గూడా అతి సాధారణమే! అయితే ఆనాడు నేనేమి చూచి ఆకర్షింప బడ్డానో ఆనాడు నాకు సరిగా తెలియకపోయి వుండవచ్చు. స్త్రీ పక్షపాతి అనే కారణంవల్ల కావచ్చు. నా విషయంలో చాలా శ్రద్ధ వహిస్తున్నాడనైనాకావచ్చు. ఈనాడయితే అది ఆంతరంగిక మైన సౌందర్యాకర్షణే అంటాను.

నా విషయంలో ఆయన యెంతో శ్రద్ధవహించేవాడు. నా విషయంలో తనకు బాధ్యత వున్నట్లుగా ఎన్నోసార్లు నా కష్టసుఖాల గురించి అడిగేవాడు. ఆయనకన్నీ చెప్పుకోవాలని వుండేదిగాని చెప్పడానికి వ్యవధిగానీ-చోటుగానీ లేకుండాపోయేవి. కొంతకాలం గడిచినాక-ఆయనంటే నాకు చనవూ, నేనంటే ఆయనకు యిష్టమూ ఎక్కువయ్యాక-నబ్బేమన్నాకావలసొస్తేఅడగమనీ ఏ కష్టానికైనా ఆదుకోడానికి సిద్ధమనీ అనేవాడు.

ఆయన కప్పటికి వివాహం కాలేదు. ఆ వూళ్ళోనే వాళ్ళ క్కయ్య గవర్నమెంటు గర్ల్సుహైస్కూల్లో టీచరుగా వుంది. ఆయన ఆమెయింట్లో వుంటున్నాడు. ఆమె దగ్గర నేను చదువు కున్నాను. అందుచేత తనయింటికి నేను వెళ్ళవచ్చు. మరి అవివా హితుడైన మాష్టారింటికి పోవడాన్ని లోకం అనుమానిస్తుందేమో

అని సందేహించాను. అసలు సందేహించడంలోనే వున్నది విషయమంతా. నా మనసులో యిత ర్లనుమానించే భావమేలేకపోతే నే నెందుకావిధంగా తలుస్తాను? అంటే, నాలో యే మూలోఆయనపై కోరికవున్నదన్నమాట! అందుచేతే గుమ్మడికాయల దొంగలాగా తయారై ఆయనింటికి పోలేకపోయాను.

ఏదయినా కోరిక కలగకుండానే వుండాలి. కలిగినదా- తృప్తికలిగినంతవరకూ స్థిమితత్వం వుండదు. మనకోరిక లభ్యమాన వస్తువిషయమై అయితే కోరికలు అణచుకొన్నా అణగవు. అణచుకోవాలన్న అవసరం మనసుకుపట్టదు. లభ్యమానం కాని వస్తు విషయమై అయితే అణచుకోక తప్పదు మనసుకు. కొంత కాలం కాస్త బాధపడి వూరికే వుంటుంది. నే చెప్పే యీవిషయం లౌకిక వ్యక్తులకే! పారమార్థికచింత వున్నవారి విషయంగాదు.

ఆయన లభ్యమానుడేనా అన్న మీమాంస పట్టుకుందినాకు. ఆయన నాపై చూపుతూ వచ్చినది మామూలు ప్రేమేగాని మమత కాకపోవచ్చు. నాతో మాట్లాడుతూ వున్నపుడు, వ్యక్తమౌతూ వచ్చినది స్నేహవాంఛేగాని వైవాహికవాంఛ కాకపోవచ్చు-అను అనుకున్నాను. కాకపోవచ్చు అనుకోడానికి మాత్రం నా కాధారమేమున్నది? నే నెపుడైనా నా కోరికను ఆయనకు స్పష్టపరిచానా? ఆయనమాత్రం స్పష్టపరిచాడా? అటువంటప్పుడు అనవసరంగా నే నెందుకు నిర్ధారణకు రావాలి?

నా పైన ఆయనకు ప్రేమవున్నదని మాత్రం నా అంతరాత్మ చెబుతున్నది. లేకపోతే నాతో మాట్లాడుతూ వున్నపుడు నా పైపు తృష్ణతో చూస్తున్నట్లూ-నన్ను అమాంతమూ తన కండ్లతో త్రాగే

స్తున్నట్లూ యెందుకు కనబడతాడు? అతనుమాత్రం మనిషిగాడా? మానవునికి వుండవలసిన వాంఛలు వుండవా?

ఆయన ఆదర్శవంతుడైన మాత్రాన ఇట్లా ప్రేమించడం తప్పేందుకవుతుంది? వివాహ మాడగూడదనే ఆదర్శంమాత్రం లేదుగదా? అటువంటప్పుడు వివాహంకోసం ఒక యువతిని యెందుకు ప్రేమించ గూడదు?–ఆస్త్రీని నేను కాగల నా?

ఆయన విద్యాధికుడు. సంపాదనగలవాడు. అంతకంటే సామాన్యమైన స్త్రీ కోరదగిన గుణాలే మున్నాయి? వైవాహిక జీవితానికి పైకారణాలే ముఖ్యం కాకపోవచ్చు. హార్దికంగాగూడా అతడు సంపన్నుడు. ఆ హార్దికసంపన్నతే గదా నా ఆకర్షణకు హేతుభూతమైంది! అతన్ని వివాహమాడే స్త్రీ తప్పకుండా అన్ని సౌకర్యాలూ గలిగి సుఖజీవనం పొందగలదనిఆనాడే భావించాను. అయితే నే చేసిన పొరపాటేమిటీ?

ఆహ్వాన నిరపేక్షంగా అతనింటికి మగపిల్లలూ ఆడుపిల్లలూ పోతూవుంటారు. ఆ ఆడుపిల్లలు పోగలిగినపుడు నే నెందుకు పోలేకపోయాను. నేను వహించిన దృష్టి వాళ్ళు వహించక పోవడమే కారణం! నేను వహించివుంటే మాత్రం పోవడాని కడ్డేమిటి? ఎవరన్నా చూస్తారని! ఇంతమందినీ చూడడంలేదా! చూచి యేమను కుంటున్నారు? నన్నుమాత్రమే చూచి భిన్నంగా యెందుకనుకుంటారు? అనుకుంటారని నే నెందుకు భావించడం! అదే గుమ్మడికాయల దొంగ అంటే! అందుకే నేను తరువాత పట్టుపడ్డాను.

ఆయన ఆహ్వానించిన తర్వాతగూడా పోకపోవడం మంచిదిగాదు, ఆయనను గౌరవించి నట్లుండదు. అందుచేత నాకు

తృప్తి వుండదు. కొన్నిదినాలు పోదామా వద్దా అని వెనుక తొక్కిళ్ళూ ముందుతొక్కిళ్లూ తొక్కాను. పోవాలన్న వాంఛే ఎక్కువయింది.

ఆయన ఒకనాడు కనబడలేదు. తర్వాత శని ఆదివారా లొచ్చాయి సోమవారం నాడు కూడా కనబడలేదు. కారణం తెలుసు కోవాలని నా హృదయం పీకసాగింది. రెన్నాళ్ళు సెలవు పెట్టారని తెలిసింది. ఇక యేమన్నాగానీ వెళ్ళా లనిపించింది. బయలుదేరా నొంటరిగా. అది మధ్యాహ్నం. వెళ్ళి నిశ్శబ్దంగా తలుపుతెరచి, నిశ్శబ్దంతో నడుస్తూ మొదటిహాల్లో అడుగు పెట్టాను. అక్కడ లేడు. ప్రక్కగదిలో మంచంపైన పడుకొని వున్నాడు! వాళ్ళ క్కయ్య యింట్లో వుండదని బాగా తెలుసు. అందుచేతనే దొంగ లాగా అతని గదిలోకి ప్రవేశించి హఠాద్దర్శనం యివ్వాలన్న సంకల్పం గలిగింది. ఏకాంత ప్రదేశంలో యిట్లా కలుసుకోడమా అన్న సంకోచంగూడా కలిగింది. గదితలుపు బాగా తెరిచివుంది. వాకిటివైపు తలాపి. అందుచేత ప్రవేశించే వ్యక్తి ప్రత్యక్షంగా కనిపించదు. తాను చూడకుండా వెళ్ళి అతని తలాపివైపు నిలబడా లని అడుగులో అడుగేసు కుంటూ ముందడుగేశాను. అతను మాత్రం తల యిటు త్రిప్పలేదు. నేనతనివైపే చూస్తూ వెళ్ళి తల దగ్గర నిలబడ్డాను. కండ్లు మూద్దామా అని ప్రోత్సహించింది లోపలి ప్రేమోత్సాహం. తారతమ్యాన్ని తలచుకొని వెనుకడు గేశాను. చేతులు మాత్రం పైకిలేచి మళ్ళా యథాస్థానాన్ని ఆక్రమించాయి. నా యీ ప్రయత్న మంతా అతని కెట్లా తెలుస్తుంది. తెలిసేటట్లయితే అట్లా నే నెందుకు చేస్తాను? నవ్వును

ఎప్పటినుండో బిగబట్టుకొన్న వ్యక్తిలాగా పగలఁగొట్టినట్టు నవ్వి "రా హసంతీ! ముందుకురా!" అన్నాడు. నేనూ నవ్వుకుంటూ-లోలోన జంకుతూ "నేనని యెట్లా తెలుసుకున్నారు?" అన్నాను ముందుకు నడుస్తూ. "అంతమాత్రం తెలుసుకో లేదను కున్నావా హసంతీ అంతరాత్మ" అన్నాడు చిఱునవ్వుతో. నవ్వుతూ ఎదుటి వైపే చూస్తున్నాడు. అపుడు చూశాను నేను ఎదుటి గోడవైపు. అక్కడ అద్దం ఒకటున్నది. ఆ అద్దంలో నన్ను తాను చూశాడు. ఇపుడుగూడా చూస్తున్నాడు. చాలా సేపటినుండీ చూశాడు గదా అని సిగ్గుపడ్డాను. "మీ అంతరాత్మ అద్దం వంటిదండీ" అన్నాను. "నిజమే హసంతీ! అంతరాత్మ యెపుడూ అద్దంవంటిదే" అన్నాడు. అని ఆదరణగా చూస్తూ "ఈ దినం నీవు వస్తావను కున్నాను హసంతీ! అంతరాత్మ కోరింది. నా భావ తరంగాలు నాలోనుండి బయలుదేరి నీ హృదయంలో చొరబడి నీ భావ తరంగాలతోపాటు నిన్నుగూడా యెలయించి తెచ్చాయి. తెలిసిందా?" అంటూ "ఎక్కడ కూర్చుంటావ్?" అని మంచం కాళ్ళకట్టవైపు చూశాడు. వెంటనే లేచి కూర్చున్నాడు. నేనుగూడా సంశయిస్తూ మంచంపట్టుపై కూర్చున్నాను. కూర్చున్నాక మరీ ఆయనవైపు చూశ్లేక పోయాను. హృదయంలో యేదో గాభరాగా వుంది. ప్రపంచమంతా ఒకేకన్ను ధరించి ఏకాంతంలోవున్న మమ్మల్ని ద్దర్నీ దుర్భిణీవేసి చూస్తున్నట్లు తోచింది. లేచిపోదా మనిపించింది. లేచి వెళ్ళలేక పోయాను. ఇట్లా గాభరాపడుతూ అతని వైపు తలెత్తి చూచి తటాలున చూపులు దింపేసు కున్నాను. ఆయన ప్రసన్నంగాచూస్తూ చిరునవ్వు నవ్వాడు. వెంటనే "ఎందుకొచ్చావా

అని మనలో భయపడు తున్నావ్‌గదూ! అంత తప్పుపని యెందుకు చేశావు? హృదయానికి భయాన్ని కలిగించేవి యెప్పుడూ సత్య సమ్మతంగాని పనులే! అటువంటి పని యెందుకు చేశావు?" అన్నాడు.

"అటువంటి పనేమీ గాదుగా!" అన్నాను కొద్దిగా సంకోచాన్ని వదలి.

"కానప్పుడు భయమెందుకు?"

ఈ విధంగా కొంత సంభాషణ జరిగినాక బాహ్యావాతావరణాన్నే మరిచిపోయాను. ఆయన అడిగిన ప్రశ్నలకు అనుగుణమైన జవాబులు చెబుతూ కూర్చున్నాను. "రమ్మన్నా గూడా నీవు మా యింటికి రాలేదేం?" అన్నాడు కాసేపున్నాక. "మనిద్దరికీ యేదోవుందని మా క్లాసు ఆడుపిల్లలంతా అనుకుంటున్నారుతెలుసా?" అన్నాను మూతిబుడ్డగించి. ఆయన గట్టిగానవ్వి "ఏ ముందట?–వాళ్ళేదో అంటే నీ కే మొచ్చింది?–అయినా ఏమయినా వుందా?" అన్నాడు నవ్వుతూ. నే నేమీ జవాబు చెప్పలేదు. ఏమి చెప్పను!

ఇంతలోకే పిడుగుల్లాగ వచ్చి పడ్డారు శాంత నిర్మల్లలు. గాభరాగ లేచి నిలబడ్డాను, వాళ్ళను చూడగానే. వాళ్ళ పెదవులపై చిరునవ్వూ, వాళ్ళ కండ్లల్లో పరిహాసమూ–ప్రతిబింబించాయి. ప్రసన్నారావుగారు మాత్రం యేమీ పదరలేదు. ఎప్పటి ప్రశాంతతతోనే "మీరందరూ శ్రమ అనుకోకపోతే హాల్లో వున్న కుర్చీలు తెచ్చి వేసుకోగలరా?" అన్నాడు. "రావే నిర్మలా, మనం చెరొకకుర్చీ తెచ్చుకొని కూర్చుందాం" అని లాగింది శాంత నిర్మలను. నేను నవ్వుకుంటూ నిలబడ్డాను వాళ్ళు వెళ్ళటంచూస్తూ. ఆయన నావైపు

చూచి "నీకక్కర్లేదా" అన్నట్లు కండ్లతో సంజ్ఞచేశాడు. "నాకక్కర్లేదుగా! అని కొంటెగాచూస్తూ అని, మంచంకోడుపై కూర్చొని మళ్ళా విసురుగాలేచి వెళ్ళి కుర్చీతెచ్చుకొని వాళ్ళతోపాటు కూర్చున్నాను.

మాశాంత ఒలేచతుర! "ఏమండీమాష్టారూ ఇంతతీవ్రంగా వున్నట్టు తెలీనేతెలేదే. ఇప్పటికైన కాస్తతగ్గిందా!" అంది కొంటెగా నావైపుచూచి. దానిగడుసుదనానికి నవ్వుకుంటూ, "పచ్చింది తగ్గకుండా వుంటుందామ్మా అని చమత్కారించాడు. ఆ తర్వాత నే నేమీమాట్లాడలేదు.నిర్భయలుగాబట్టి వాళ్ళే ఆమాటాయీమాటా మాట్లాడారు. ఇంతలోకే పాలురాగా అందరం కలిసి కాచి అమ్మగారికి మాత్రం కాస్తవుంచి మిగిలిందందరమూ తాగేశాం. కానే పయ్యాక సెలవుతీసికొని అందరమూ బయలుదేరాం.

తర్వాత కాలేజీలో ఆయన్నుపిలిపించి మాట్లాడానికి భయపడేదాన్ని. పిలిపించడం తప్పనిసరి అయినపుడు మరొకమ్మాయి దగ్గరవుండగా చూచి పిలిపించేదాన్ని. ఒకవేళ పనివుండి ఆయనే పిలిపిస్తేమాక్లాసు మేట్సు అప్పుడే హేళనచేసేవారు. అదీగాకుండా ఆయన అంటే అంతగా సరిపడని చీఫ్‌లెక్చరర్‌కు గూడ ఈర్ష్యగా వుండేది. ఈకారణాలచేత ఆయనతో మాట్లాడ్డం మరీతగ్గించాను. బలవంతగా ఉత్సాహాన్ని చంపుకున్నాను.

ఇట్లావుండగా ఒక సంఘటన జరిగింది. ఉదయం పదిగంటల కల్లా కాలేజీకి వచ్చేసరికి కాలేజిఅంతా అదోకమోస్తరు వాతావరణంలో నిండిపోయివుంది. ఒకవైపు గోడలపై వ్రాసిన అక్షరాలను గీకేస్తున్నారు, మరొకవైపు వాటిపై సున్నం కొడుతున్నారు.

ఆపనిచేసే వాళ్ళు కొంతమంది చదువుకొని నవ్వు కొంటున్నారు. మా ఆడుపిల్లలగది బైటగోడలపై నంతా శాసనాలే! మేము లోపలి కెళ్ళేటప్పటికి అంతా నిశ్శబ్దం. చెట్టు నిలువునా కాలి కూల బడి బూడిద కుప్పయినట్లుగా కూర్చున్నారు పిల్లలంతా. ఒకరి మొగానా కత్తికాటేసినా రక్తంలేదు. మేమూవెళ్ళి ఒకమూలకూర్చు న్నాం. ఎవరిపైన ఏమి వ్రాశారో అని అందరి గుండెల్లోనూ ఆం దోళనే! ఇంతలో గంటకొట్టారు. బయలుదేరాం క్లాసులకు. చాల మందమ్మాయిలు గోడలపైకి చూడడానికిగూడా భయపడ్డారు. నాకు మనస్సులోమనసులేదు. లోపలా, బయటా, అన్ని గోడలపైనా వ్రాసిపెట్టారు అన్నీప్రిన్సిపాల్ మీదే; సరిగ్గాఅన్ని ఒకమ్మాయిమీద. మరికొద్దిగా ఒకఅమ్మాయినీ ఒకమాష్టరునూ కలిపి. అంతే! ఈ విషయంతర్వాత రమణకుమార్ చెప్పినట్లుశాంత చెప్పింది. అప్పటికి నాగుండె కుదుటపడింది నామీదలేదుగదాఅని. ఏదోకన్ను విప్పినట్లుగా ఇక మనసా గూడ ప్రేమవిషయం తలపెట్ట గూడ దను కున్నాను.

పిల్లవాళ్ళల్లో గూడా కాస్తవిచక్షణాజ్ఞానం వుంది. అందరి పైనావ్రాయరు. వాళ్ళకువికటంగా ప్రవర్తించే వాళ్ళపేర్లేగోడెక్కు తాయి. అటువంటప్పుడు ప్రసన్నారావుగారి లాంటి మాష్టరుపేరూ రామేశంవంటి విద్యార్థిపేరూ ఎందుకెక్కుతాయి? ఇంతకూ అప్ప టికీ ఇప్పటికీ గూడా అది మంచి పని మాత్రంకాదు.

అవకతవకలుగా గాక వివాహంకోసం ప్రేమించుకుంటే తప్పేమిటి? ఏమిటో ఆనాడు అంతగా ఊహించలేక పోయాను. వివాహంకోసం స్వేచ్ఛగా ప్రేమించుకో వచ్చునీ అట్టి వివాహాలకు

ఆదర్శస్థానాలు యూనివర్సిటీ కళాశాలలనీ ఈనాడయితేవూహించ గలుగుతున్నాము గాని ఆనా డూహించలేక పోయాను. అప్పట్లో నాబోటి విద్యార్థినేగాదు ఉపాధ్యాయులు సైతం ఊహించ లేక పోయేవారు. అటువంటి వాటికి వాళ్ళు ప్రోత్సాహమిచ్చేవారుగారు.

నేను చేరేముందుసంవత్సరం ఒకసంఘటనజరిగింది అదే కాలేజీలో. ఒకేతరగతి అబ్బాయి అమ్మాయి ప్రేమించుకున్నారు. కులాలువేరు. అందుచేత వాళ్ళ ప్రేమఫలించ డానికి వీలులేదు. వాళ్ళ ప్రేమ ఎంతత్యాగ పూరితమంటే వాళ్ళిద్దరూ పరీక్షలుకాగానే పారిపోయి రిజిష్టరు వివాహం చేసుకున్నారు. నిజంగా బుద్ధివుండే వ్యక్తులంతా ఆవివాహాన్ని యెంతో పొగడి ఆదరించి వుండ వలసింది. అట్లాకాకపోగా అందరూ ఆడిపోసుకున్నారు.యంయేలు గింయేలు చదివిన లెక్చరర్లే సంకుచిత దృష్టిగలిగి అసహ్యంగా మాట్లాడారంటే ఇక మామూలు వ్యక్తుల విషయం చెప్పాలా? ఎన్ని చదువులుచదివితేయేం? యెన్నినీతులువింటేయేం? జన్మతో సహాహీనగుణాలు, హెచ్చుతక్కువభావాలూ బానిసభావాలూ ఇత్యాదులతో పెరిగినవాళ్ళ హృదయాలు- ఈవిద్యానాగరికతా-సంస్కృతీ గూడా మార్చలేని వాళ్ళ హృదయాలు—విశాలతను వహిస్తాయా? దాన్ని హర్షించింది ఒక్క ప్రసన్నారావుగారే! అదేగాదు! ఆదం పతుల పిలిచి వాళ్ళను ఎంతోఅభినందించి, ఉత్సాహవంతుల చేశారట. ముడుచుకు పోయివున్న ముఖాలను వికసింపజేశారట. ఆత్మ ధైర్యాన్ని నూరిపోశారట! అటువంటి వివాహాలంటే ప్రసన్నారావు గారికి బలేయిష్టం! అసలు అతని జీవితం కులాంతర వివాహాల విస్తృతీకరణకు అంకితం చేయాలని తనఆదర్శం. మరుసటి

సంవత్సరంవాళ్ళు కాలేజీకిశీట్లకోసం దరఖాస్తుపెట్టుకున్నారు.ప్రిన్సిపాలు శీటుయివ్వలేదు. ఆప్రిన్సిపాలంత సంకుచిత హృదయుడూ- అనుమానస్వభావుడూ- పరకులద్వేషి- స్వాభిమాని- కుత్సితుడు- మరొకడులేదు. అటువంటివానికి, ఈకులవ్యత్యాసవిధ్వంసకము, సమత్వప్రదాయిని అయినటువంటి ఆదర్శము అర్థమవుతుందా?

నేను పైఉదాహరణ తల్చుకొని ఆనాడు ఉత్సాహహీనికాలేదు. చాల సరుత్సాహినయ్యాను. అసలు నాలోసమత్వభావముంటేగదా! అసలు సమత్వమంటే అర్థమయితేగదా! నాయీప్రస్తుత స్థితికి ఆనాడు నేను అజ్ఞానంగా ప్రవర్తించడమే కారణం.

ప్రసన్నారావుగారి కులంవేరు. వేరనుకోడంలోనే వుంది పొరపాటంతా.వేరనుకుంటే సమత్వభావాన్ని వహించలేం.సమత్వభావంలేందే ప్రేమించలేం? ఆనాడు నాది నిజమైన ప్రేమగాదని ఇపుడర్థమవుతున్నది.అదొకచపలభావమని ఈనాడర్థమవుతున్నది. నిజమైన ప్రేమకు కులం, మతం, ఇట్లాంటివి.అడ్డొస్తాయా?అసలు కులమేమిటి?

మరి నేనాయనను ఏదృష్టితో చూస్తున్నాను. కేవలం కామదృష్టితోనా? లేక తాత్కాలికపు కామదృష్టితోనా? లేకపోతే వైవాహిక ప్రేమదృష్టితోనా? నాలో నిర్మల ప్రేమదృష్టికి ఆనాడు తావులేక పోయింది. వైవాహికదృష్టికి సంపూర్ణత్వంలేకపోయింది కులమే వేరయినపుడు తన్నెట్లా వివాహం చేసుకోవడం?

సిసలైన వివాహదృష్టివుంటేగదా! చదువుకొంటున్న ఆడుపిల్లలంతా చేస్తున్న పొరపాటు ఇక్కడే! చదువుతూ వున్నారుగాబట్టి వివాహాలు కావడంలేదు. ఆడుపిల్లలకు కట్నాలయుగంలో

పెండ్లిండ్లు కావడంలేదు. ఇంట్లోనే వుండిచేసే దేముందని చదువు కొంస్తున్నారు. ఆవిధంగా చదువు కుంటున్న వాళ్ళు వివాహదృష్టి వహించివుండడం ఎంత అవసరమో వీళ్ళకు తెలియదు.ఆదృష్టితో అవకాశం కోసం ఎదురు చూస్తూవుండాలి. అవకాశం దొరికినప్పుడు విడనాడకూడదు.దానికి కులం, మతం, భాగ్యంఏవీఅడ్డురాకూడదు. గుణం వున్నాదా లేదా ? అతనితో నేను జీవితాంతంవరకూ ఒడు దుడుకులులేకుండా జీవించ గలనా లేదా అని మాత్రమే ఆలోచిం చాలి.తనకు ఆగ్యారంటీ కుదిరిననాడు మరేలాటి అడ్డూరాగూడదు.

అప్పట్లో వివాహం యెందుకు అనే విచిత్రధోరణి గూడా వుండేదిమాలో. చదువుకుంటూ వుండిన మగపిల్లల్లోనూ ఆడుపిల్ల ల్లోనూ యీవింత మాటలు వినబడుతూ వుండేవి. అవి యీనాడు గూడా వినబడుతూనే వున్నాయి. మగపిల్లవాళ్లు అనుకున్నా ఫరవా లేదు. వాళ్ళు కావాలనుకుంటే యేనాటికయినా పెండ్లి కాకపోదు. వ్యభిచారినీ రెండో పెండ్లివాణ్ణీ గూడా చేసుకోడానికి ఏదోవాక పిల్లసిద్ధంగానే వుంటుంది. స్త్రీలకట్లా గాదుగా ! మంచిమంచివాళ్ళకే పెండ్లిండ్లుకాకపోతే అన్యులకు ఎట్లా అవుతాయి ?

పెండ్లెందుకన్న పెడవాదమే సంపూర్ణంగా కాక పోయినా కొంతవరకైనా నన్నీస్థితికి తెచ్చింది. అందుచేతనే యెవరిపైనా సరైన దృష్టి వహించలేక పోయాను. ఈనాడు గూడా నాటోటి అవివాహితల నింతమందిని బాధపడుతూ వుండగాచూస్తూ గూడా- ఈనాటి చదువుకుంటూన్న పిల్లలు సరదాకైనా అభావంవహించడం ఆమాటలు అనడం వింటే వాళ్ళ పైన ఎంతోజాలి కలుగుతుంది ! వివాహం అన్నది ఎంత అవసరమో వాళ్ళ కప్పట్లో అంతగా తెలియదు.

కామం అన్నది ప్రాణికి సహజం. అది దేహజం కావచ్చు మనసిజం కావచ్చు. పేర్లువేరైనా రెండూ ఒకటే! శరీరానికీ మనసుకూ ఆధారాధేయభావం వున్నది. శరీరంలో మార్పులు కలిగితే మనసులోగూడా అనుగుణమైన భావాలుత్పన్నమై తీర్తాయి. మనసులో కలిగితే శరీరంపై మార్పులు తప్పవు. యౌవనం వచ్చిన తర్వాత శరీరం అన్యలింగ సమాగమాన్ని కాంక్షిస్తుంది. తదన్వేషణార్థం మనసు ముందు కురుకుతుంది. అయితే ఆ మనసును అన్య మార్గాల లయింపజేస్తే కొంతవరకూ కామజయాన్ని పొందవచ్చును. పారమార్థిక దృష్టివహించిననాడు తప్ప లౌకికదృష్టి వహించినంతకాలం కామజయాన్ని పూర్తిగా పొందలేం.

యౌవనంలో వున్నప్పటికీ - అపుడపుడూ కామవికారాలు కలుగుతూ వున్నప్పటికీ-విద్యాకారణంగా కామాన్ని కాస్త అణచుకో డానికి వీలుంది. మనసును విచ్చలవిడిగా సంచరింప జేయడమన్నది కామానికి ముఖ్యావలంబనం. విచ్చలవిడిగా విహరింపనీయడానికి విద్యాభ్యసన కాలంలో వీలులేదు. పగలెల్లా పాఠాలు వినాలి. రాత్రిళ్ళు చదవాలి. చదువుతూ చదువుతూ నిద్రపోవడం గూడా సంభవిస్తుం దొకొక్కప్పుడు. ఇక కామాన్నిగురించి ఆలోచించ డానికి మనసుకు అవకాశం తక్కువ. ఒకవేళ యేదైనా తీరిక సమయాల్లో ఆ భావం కలిగినా దానికంత బలం వుండదు. దానికి భయం కారణం కావచ్చు. కామతృప్తికోసం ఏదయినా చేస్తే-అపనింద వస్తుందనీ-తర్వాత పెండ్లికాదనీ-జీవితం అధోగతి పాలవు తుందనీ-ఇట్లాంటి భయాలు ఆ కామావేశాన్ని అడుగంట తొక్కేస్తాయి.ఇటువంటి ఒత్తిడిలోవుండి కామంయొక్క శక్తితెలీక

వివాహవాంఛనుగూడా గెలవగలం అనే దురభిప్రాయాన్ని గూడా వహించడం సంభవిస్తున్నది. వివాహవాంఛకు ప్రాబల్యం లేనప్పుడు అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనే అభిప్రాయం యెందుకు కలుగుతుంది !

విద్యాభ్యసనం పూర్తయి ప్రపంచంలోకి ప్రవేశించినాకవివాహం యొక్కవిలువ విశదంగా తెలుస్తుంది. మనసుకు ఇదివర కున్నంత పనివుండదు. సంఘాన్ని చూస్తే యిదివర కున్నంత భయమూవుండదు. మనసేమో విచ్చలవిడిగా విహరిస్తుంది. రాత్రిళ్ళు పడుకోగానే నిద్రపట్టదు. చదువుకొనే కాలంలోగూడా యిట్టిది చాలసార్లు సంభవిస్తూ వుంటుంది. ఇపుడు వివాహమాడదాం అంటే ముందుకొచ్చే పురుషుడు కనిపించడు. కులంలోనే చేసుకోవాలనుకుంటే విద్యాధికు లెక్కువ దొరకరు. ఉన్న ఆ కొద్దిమందికీ గిరాకీయెక్కువ.కట్నాలు అందరూ యిచ్చుకోగలరా? అసలు ఈపాటికే వివాహపు వయసు దాటిపోయి వుంటుంది. ఇక యితర కులంలో వాడయితే మాత్రం యెవడు దొరుకుతాడు? మా వంటి వాళ్ళుంటారని వాళ్లు అవివాహితులుగా నిలిచి వుంటారా? అసలీ సమస్య అన్ని కులాల్లోనూ-స్త్రీజాతి సర్వస్వానికీ వున్నదేగదా! ఏ కులంలోనైనా వివాహం కాకుండా నిలిచిపోతున్న వారు ఆడపిల్లలుగాని మగపిల్లలుగారు.

అప్పట్లో వివాహవిషయం అసలు వచ్చేదేగాదు. ఎవరనా ఆ విషయం యెత్తితే యెగతాళి చేస్తారని ఆ విషయం యెత్తరు. ఒకవేళవస్తే దాన్ని అతితేలిక దృష్టితో చూచేవారం. మా చీరల

రంగునూ సొగసునూ గురించి చర్చించుకొనే మాత్రమైనా చర్చించుకొనేవారంగాదు.

ఒకనాడు మా శాంతయింట్లో వివాహచర్చ బయలుదేరింది. వివాహంఅంటే స్త్రీలకు ముఖ్యమైన ప్రతిబంధకం అని వాదించిన వాళ్ళల్లో నేనే ప్రథమురాల్ని. ఇప్పటి మాదిరిగా అప్పుడు ఎంతో మంది అవివాహిత స్త్రీ లుండేవారుగారు సంఘంలో. ఆ వున్న కొద్దిమందీ తోకతెగిన నక్కలవలె వివాహంమీద యిచ్ఛలేక పోవడంవల్లనే ఆ విధంగా బ్రహ్మచారిణుల మయ్యాం అని అంటూ వుండేవారు. ఆ విధంగా వుండడంలోనే సంపూర్ణ స్వేచ్ఛ వున్నదని అంటూవుండేవారు. అటువంటివారు ముఖ్యంగా టీచర్లుగనో-నర్సులుగనో,డాక్టర్లుగనో వుంటూవుండేవారు. మేంగూడా అట్లాగే స్వేచ్ఛగా బ్రదకవచ్చని అనుకుంటూ వుండేవారం. ఆ స్వేచ్ఛా వాంఛలో వివాహంయొక్క ఆవశ్యకతే కనిపించేది గాదు మాకు. ఆ నాడు

"వివాహం ప్రతివారికీ ముఖ్యమను కుంటాను" అన్నది శాంత.

"అందరికీ అనడం అప్రస్తుతం" అన్నాను నేను ధిక్కరించినట్లుగ.

"కనీసం ప్రతి స్త్రీకినీ"

"ప్రతి పురుషుడికీ అనవేం! హక్కుల విషయంలో-ఆచార విషయంలో-మనల్ని మనం ప్రత్యేకించుకొని పురుషులకు ఆధిక్యాన్ని అంటగట్టబట్టే మనమీస్థితిలో వున్నాంఅని గమనించనక్కర్లేదా ?"

"నా ప్రతిపాదనలో అది యిమిడివున్నది. వివాహంవల్ల స్త్రీకి భద్రత లభిస్తుంది. పురుషుడికి సహధర్మచారిణి లభిస్తుంది"

యంలో వున్నది. అయితే ఆ మాట అనలేదు. తర్వాత నే నేమీ మాట్లాడలేక పోయాను.

· ఆ ప్రేమించినవ్యక్తి సాక్షాత్తు ప్రసన్నారావుగారే! ఆయన్ను పొందడం నాకు కానిపని అని తోచింది. దానికి కులం కారణం. దాన్ని పురస్కరించుకొని మా పెద్దవాళ్లు కారణం. ఇతర కులం లోని వ్యక్తిని నేను చేసుకుంటానని నేను అననూలేదు. వాళ్లు నిరాకరించనూలేదు. ఒప్పుకోడం అన్నది ఊహించరాని విషయం అని నాకా నాడు తోచింది. కులాంతరుని చేసుకోడం అన్నది ఆనాడు ఊహకందని విషయమని చుట్టూరా కొన్ని ఉదాహరణల చూస్తూగూడా భావించాను. మరి ప్రసన్నారావుగారిని పొందేమార్గం నాకు వేరే యేమున్నది? నే నాయన్ను గురించి యోజించడం యెక్కువయింది. ఎల్లపుడూ ఆయన నా హృదయంలో ఒకభాగాన తిష్ఠవేసే వున్నాడు.

ఆయన కనబడనినాడు-కనబడి మాట్లాడనినాడు నాకు ఏమీ తోచదు. అసలు నాకీ ప్రపంచం జీవనయోగ్యంగా కనిపించదు. రెండవ సంవత్సరం మొదట్లో ఆయన కొన్నిదినాలు నాతో మాట్లాడ లేదు. నన్ను చూచినపుడు తల ప్రక్కకు తిప్పేవాడు. క్లాసులో అదేపనిగా ఆయనవైపే చూస్తూ కూర్చొనే అలవాటు. ఆయన పంతంబట్టి యీ వైపు చూడడమే మానేశాడు. ఇదివరకు నావైపు చూడందే వుండేవాడుగాడు. చూడకపోతే ఉద్రేకంతో ఉపన్యసించే వాడేగాడు. అందుకే ఆ నాన్నాళ్లూ ఉపన్యాసాలు చప్పగా వుండేవి. నే నెంతో తల్లడిల్లేదాన్ని. కొన్నాళ్లు బాధపడి కడపటికి శాంతతో

"అవన్నీ పురాణకాలపు మాటలు! పురుషుడు లేందే స్త్రీకి భద్రత లేదనే వాదన అశక్తవాదన"

"ఇపు డట్లాగే అనవచ్చు. విద్యానంతరం దాని ఆవశ్యకత అర్థమవుతుంది. అంతకంటే మించి, పరవయసులో అవగాహన మౌతుంది" అన్నదొక అనుభవంగల టీచరు.

చాలవరకూ నా వాదమే గెలిచిం దానాడు. శాంత వాదానికి అంతబలం లేకపోయింది. చేరిన చాలామంది కాలేజీ అమ్మాయిలు అసలా విషయాన్నే పట్టించుకోనట్లు ప్రవర్తించారు.

ఇంటర్మీడియట్ రెండవ సంవత్సరంలో కాలేజీ సంచికలో ప్రచురణార్థం ఒకకథ వ్రాశాను. అది ప్రసన్నారావు గారికి చూపించాను తప్పులు దిద్దమని. ఆ కథలో వివాహ విషయంలో అనిష్టతను ప్రోత్సహిస్తూ వ్రాశాను. ఆయన చదివి మా గది దగ్గరికి వచ్చి నన్ను పిలిపించాడు. నేను బయటికివస్తూ ఆయన చేతిలోని కాగితాలచూచి సిగ్గుపడుతూ వుత్సాహ పడుతూ సమీపించాను. నన్ను ఎగా దిగా చూస్తున్నాడు మందహాసం వహించి. నే నాయన ముఖాన్నే తిలకిస్తూ నిలబడ్డాను. "మ్యాగజిన్‌కోసం వ్రాసిందిగాదే యిది!" అన్నాడు నవ్వుతూ. "ఏం, ఎందుకు? బాగాలేదా?" అన్నాను. "ఏదో త్వరగాతేల్చి చెప్పాలన్నట్టుగా కట్టె,కొట్టె,తెచ్చె అన్నట్లు వ్రాశావులే!" అన్నాడు. అని, "వివాహం అంటే అంత అనిష్టత యెందుకు?" అన్నాడొక తీరుగా మొగంపెట్టి. "ఎందుకు వివాహం?" అన్నాను ముక్తసరిగా. పైకిశబ్దం అట్లా ప్రయోగించానుగాని హృదయంలోని భావంవేరు. ప్రేమించిన వ్యక్తిని పొందలేనపుడు ఇక వివాహం ఘెందుకన్న భావం అప్పుడు నా హృద

యంలో వున్నది. అయితే ఆ మాట అనలేదు. తర్వాత నే నేమీ మాట్లాడలేక పోయాను.

ఆ ప్రేమించినవ్యక్తి సాక్షాత్తు ప్రసన్నారావుగారే! ఆయన్ను పొందడం నాకు కానిపని అని తోచింది. దానికి కులం కారణం. దాన్ని పురస్కరించుకొని మా పెద్దవాళ్ల కారణం. ఇతర కులం లోని వ్యక్తిని నేను చేసుకుంటానని నేను అననూలేదు. వాళ్లు నిరాకరించనూలేదు. ఒప్పుకోడం అన్నది ఊహించరాని విషయం అని నాకా నాడు తోచింది. కులాంతరుని చేసుకోడం అన్నది ఆనాడు ఊహకందని విషయమని చుట్టూరా కొన్ని ఉదాహరణల చూస్తూగూడా భావించాను. మరి ప్రసన్నారావుగారిని పొందేమార్గం నాకు వేరే యేమున్నది? నే నాయన్ను గురించి యోజించడం యెక్కువయింది. ఎల్లపుడూ ఆయన నా హృదయంలో ఒకభాగాన తిష్టవేసే వున్నాడు.

ఆయన కనబడనినాడు-కనబడి మాట్లాడనినాడు నాకు ఏమీ తోచదు. అసలు నాకీ ప్రపంచం జీవనయోగ్యంగా కనిపించదు. రెండవ సంవత్సరం మొదట్లో ఆయన కొన్నిదినాలు నాతో మాట్లాడ లేదు. నన్ను చూచినపుడు తల ప్రక్కకు తిప్పేవాడు. క్లాసులో అదేపనిగా ఆయనవైపే చూస్తూ కూర్చొనే అలవాటు. ఆయన పంతంబట్టి యీ వైపు చూడడమే మానేశాడు. ఇదివరకు నావైపు చూడందే వుండేవాడుగాడు. చూడకపోతే ఉద్రేకంతో ఉపన్యసించే వాడేగాడు. అందుకే ఆ నాల్నాళ్లూ ఉపన్యాసాలు చప్పగా వుండేవి. నే నెంతో తల్లడిల్లేదాన్ని. కొన్నాళ్లు బాధపడి కడపటికి శాంతతో

అన్నాను. అది ఏకాంతంగా ఆయనను కదిపి చూచింది. అది రామేశం విషయం అని తెలుసుకొంది.

పురుషజాతిలో యీమత్సరం, ఈర్ష్య వున్నంత స్త్రీజాతిలో వుండదనునుగాని తేడా వుందంటాను. దానికి కారణం ప్రేమించడంలో వుండేవ్యత్యాసంగాదు. యుగయుగాలుగా స్త్రీపై పురుషుడు వహిస్తూ వచ్చిన ఆధిక్యభావమే కారణం. ఆయనకుతెలుసు రామేశాన్ని నేను వాంఛించలేదని. తెలిసినా, అవకాశము ఇచ్చినందుకు అతనికి కోపం వచ్చింది. తర్వాత తర్వాత తగ్గింది.

రెండో సంవత్సరాంతాని కంతా ఆయనకు గూడా నా పైన హోప్స్ కొంత తగ్గినట్లు కనబడింది. నన్ను చేసుకోవాలని ఆయనకుండిందిగాని నాకు లేదప్పట్లో. నన్ను ఆయనఅడగలేదు. ఎందుకంటే నేనువిద్యార్థిని. సాహసించేగుణం తక్కువనీ-అట్లా సాహసించడానికి ఊహించను గూడా ఊహించలేరని- ఆయనకు బాగా తెలుసు. సలహాలువిని ఉత్సాహమూ, పట్టుదలా-వాటంతట అవే వాళ్ళల్లో పుట్టుక రావాలిగాని ఒకరు ప్రోత్సహించితే పుట్టుకరావని ఆయనకు బాగా తెలుసు.

ఒకనాడు ఒకసంఘటన జరిగింది. ఆనాడు నేను కాస్త ఆలోచించి ప్రవర్తించి వుంటే నేనీనాడు ఎంతఉన్నతస్థితిలోవుండేదాన్నో. ఆనందాన్ననుభవిస్తూ వుండేదాన్ని. మాశాంత చెప్పింది ప్రసన్నారావుగారి అక్కగారు నన్నొకసారి కనబడమన్నా రన్నట్లుగా. వెళ్ళాను. కాసేపు ఆమాటా యీమాటా మాట్లాడినాక "నన్నెందుకు, పనిగాపిలిపించారట!" అన్నాను. "ఏమీలేదే! కనబడి చాలానాళ్ళయిందని!" అనిఅంది. మరలా వెంటనే "ఒకనాడు

నేను లేనప్పుడు వచ్చివెళ్ళావటగమా! మళ్ళారాలేదేం?" అనిఅడిగింది. నేనేమీ చెప్పలేదుగాని కాస్త సిగ్గుపడ్డాను. అది చూచి "ఏమిటో అదిచెప్పవే!" అంది వాత్సల్యంగా చూస్తూ. "ఏమీ లేదు." అన్నాను మొండిగా. "సరేగాని-మీమాష్టారుకు నీవాకతెవేనా-ఇంకెవరన్నా క్లాసులో వున్నారా ఆడపిల్లలు! అస్తమానమూ నిన్ను గురించిన ప్రసక్తేతెస్తూవుంటాడు ఇతర్ల గురించిచెప్పడేం?" అంది తానేదోపని చేసుకుంటూనే. నేనేంచెప్పేది! లోపల మురిసిపోతూనే సిగ్గుపడ్డాను. కన్నెత్తి ఆమెవైపు చూశాను. అప్పుడే ఆమెగూడా నాకండ్లల్లోచూచింది. ఆమె చూపుల్లో మందహాసం కానవచ్చింది.

"అయినా హసంతీ! ఈకాలం మాష్టార్లు మంచివారుగాదే! కాలేజీల్లో చదువుతూగూడా ఆడుపిల్లలు వట్టిపిరికివారనీ-కాలేజీలకు ఎందుకొచ్చామో యేంచేస్తూన్నామో అనేవిషయం గూడా తెలుసుకోలేనివారనీ - దద్దమ్మలుగానే వచ్చి దద్దమ్మలుగానే తయారై దద్దమ్మలుగానే బయటికి పోతున్నామనీ-ఆశయాలూ-ఆదర్శాలూ-పట్టుదలా-ఏమీలేనివారనీ- ఇట్లాంటి వేమీ తెలియదు - ఈపడుచు మాష్టర్లకు! వచ్చి కాలేజీపిల్లల్ని ప్రేమిస్తారు. అందుకు బదులు మట్టిబొమ్మల్ని ప్రేమిస్తేమంచిదనుకోరు! సరేగాని హసంతీ! మూడేండ్లనుండీ-అంటే యూనివర్సిటీ వదలిపెట్టి వచ్చినప్పటినుంచీ-అసలు యూనివర్సిటీకి పోక పూర్వంనుంచిగూడా అనుకో-మావాడు కులంలో వచ్చేసంబంధాల నన్నిటినీ కాదనేస్తున్నాడు. మరీ ఒకటిన్నర సంవత్సరంనుండీ తనేదో నిర్ధారించు కున్నట్లూ ఇక నెవరూ అక్కరలేనట్లూ మాట్లాడుతున్నాడు. అసలు కులంలో

అక్కరేలేదట. కులాంతర వివాహం చేసుకొని సమత్వం తెస్తా డట. నిజంగా కులాంతరవివాహాలుసాధ్యమేనా ? అన్నది సూటిగా నాకండ్లల్లోకి చూస్తూ". అమ్మో! కులాంతర వివాహమే?" అన్నాను నేను కండ్లు పెద్దవిచేసి.

ఆమె అసాధ్యపు స్త్రీ. అపుడు కావలసిందదే ఆమెకు. నా చేతనే అట్టివివాహం అసంభవమనిపలికించాలని. వెంటనే "మాష్టర్ల కంటే పిల్లలే నయంగా పున్నారిటీవల. నీవు వెళ్ళి ఆగదిలో కూర్చున్నడాయన-అటువంటివి అసంభవమని చెప్పు-పిల్లలుచెబితే నయినా అర్థమవుతుందేమో అయ్యవార్లకు''అంది. ఇంతలో శాంత వచ్చింది. వస్తూనే "ఏమిటండీ అర్థంకావడం" అంటూ అందు కొంది. వెంటనే తన గదిలో నుంచి ప్రసన్నారావుగారు గూడా వచ్చారు. చిరునవ్వుతో "ఏమీగాదు శాంతా! కులాంతరవివాహాలు మాత్రమే సమత్వం తెస్తాయని నావాదనగా! కాదని అనడంలేదు గాని అవి జరగడం అసంభవమని ఆటీచరుగారూ ఈశిష్యురాలు అంటున్నారు.-ఇటు చూడక్కయ్యా! ఆవిషయం నేను చెప్పనవస రంలేదు. చిన్నదయినా మాశాంత వాదించ గలదు" అన్నాడు.

"అమ్మో! మాటీచర్ల ముందే" అంది శాంత భయంవేసిం దానివలె.

"చెప్పవే వేషాలుకట్టిపెట్టి!" అంది మాటీచర్ నవ్వుతూ.

"ఏంచెప్ప మంటావు ? గ్రామఫోనుప్లేటేగా! మా మాష్టరుగారు ఏంబోధించారో ఆదేచెబుతాను. దాన్నే ఆధారంగా వాదిస్తాను."

''అదేదో చెబుదూకాస్త!"

"ప్రాణికి ఆహారమెట్లాగయితే అవసరమో సంఘానికి సంస్కరణ అటువంటిది." అని మొదలుపెట్టింది శాంత. ఏదో జ్ఞాపకానికి వచ్చినట్టుగాలేచింది మాటీచరు. లేచి

"ఉండవే శాంతా! కాస్తఫలహారం గూడా ముగించికూర్చుంటే నీకు ఉపన్యసించడానికీ మాకు వినడానికీ కాస్తశక్తిగూడా కలుగుతుంది." అంటూ లోపలికెళ్ళి తీయని పిండివంటలూ మధురమైన ఫలాలూ తెచ్చి మాముందు పెట్టి పాలుగూడా దగ్గరగాపెట్టి మా దగ్గర కూర్చుంది. అందరమూ ఫలహారంలో పడ్డాము.

"ముందూ తిండీ తర్వాతమిగిలినవన్నీ!ఏమంటావు హసంతీ!" అందామె!

"ఔను" అన్నాను నేను ప్రపంచంలో తిండికోసమే మానవులు జీవిస్తూన్నట్లుగా!

"కాదు కాదు! అట్లాగంటే మాష్టరుగారు వొప్పుకోరు" అంది శాంత.

"నిజం? అంటూ మావైపూ మాష్టరుగారి వైపూ చూచింది, మాటీచరు.

"సమత్వంతో జీవించడం - స్వేచ్ఛగాజీవించడం - సంస్కృతీపరులై జీవించడం- తిండికంటే గూడా ముఖ్యమంటానక్కయ్యా కనీసం తిండికున్న ప్రాముఖ్యమైనా వాటికివ్వాలి" అన్నారుమాష్టరుగారు.

"అవన్నీ ఆదర్శపు పలుకులు తమ్ముడూ! ఈసంఘజీవితంలో అవన్నీ ఆచరణీయాలు కావని నీవూ ఒక యింటివాడివైన తర్వాతనే తెలుస్తుంది"

"పెండ్లాడితేఅవన్నీఅసాధ్యాలయిపోతాయంటావా అక్కయ్యా!"

"అనను! అయితే అది అట్లాగే అవుతుంది!"

"మరి ప్రాపంచిక జీవితంలోకి దిగి అసమతాదృష్టినీ - స్వేచ్ఛను, సంస్కృతినీ విడనాడడం కంటే వైవాహిక జీవితానికే దిగకపోతేనో!"

"ఒక్క వైవాహికానికే దాన్ని ముడిపెట్టకు. నీవుగూడా విద్యార్థి వాతావరణంనుండి బయటపడి చాలాకాలంగాలేదుగాబట్టి ఆ ఆదర్శాల యింకా పట్టుకొని యిగ్గులాడు తున్నావు. ఒక్క ఉదాహరణ తమ్ముడూ! నీ వెంతో స్వేచ్ఛాజీవివి! సమతావాదివి! అందుకోసమే తలిదండ్రులచేత సైతం మంచివాడవు కాదనిపించుకున్నావు. నీ దృక్పథం వారికర్థం కాకనే అట్లా అనుకున్నారనుకుందాం. మరి యీ నీ దృక్పథం ప్రస్తుతం నీ వుంటున్న వాతావరణంలోని యీ ప్రిన్సిపాళ్ళకూ, యీ లెక్చరర్లకు, యీ చదువుకుంటున్న పిల్లలకూ-గూడా అర్థం కాలేదంటావా? నీ వీ ఉద్యోగంలో ప్రవేశించిం తర్వాత నీ స్వేచ్ఛాజీవితానికి అనుదినమూ ప్రతిబంధకాలు వస్తున్నాయనీ అంతా అనుమాన దృష్టిపూరిత వాతావరణమనీ అనుదినం గోలపెడుతున్నావుకావా! నీ వెవరికీ ద్రోహం చెయ్యడంలేదు. మేలుచేయడానికే ప్రయత్నిస్తున్నావ్. అయితే నీకు ప్రోత్సాహానికి బదులు నిరుత్సాహమే యెదుర్కొంటున్న దెందుకు? పొగడ్తలకు బదులు పెదవివిరుపులు కనిపిస్తున్నా యెందుకు? మెచ్చుకోలుకు బదులు మూతివిరుపులు కనిపిస్తున్నా యెందుకు? ఇదంతా విషపూరితవాతావరణం! ఎక్కడబట్టినా కులద్వేషం-మతద్వేషం-వర్ణద్వేషం- అసూయలు-

అసహనం-ఇవే కనబడతాయిగాని వేరే కనిపించవు. ఎదుటివ్యక్తి యొక్క ప్రతిచర్యనూ పైచెప్పిన ఏదో ఒక రంగద్దాలతో చూస్తారే గాని సహజంగా చూడరు. జీవితంలో అడుగు పెట్టనంత కాలం పై గుణాలకు అతీతంగా ఆదర్శంగా వుంటూవచ్చిన వాళ్ళునైతం జీవితరంగంలోకి దిగగానే ఆ బురదే పూసుకుంటారు. ఆ వాతావరణం వాళ్ళనట్లా దిగలాగుతుంది !"

"జీవిత రంగంలోకి దిగినంతమాత్రాన ప్రతివాళ్లూ ఆ వాతావరణానికి దాసులై పోతా రంటావా ?"

"ప్రతివాళ్ళూ అని నేనన్నానా? మెజారిటీ అని అన్నాను. ప్రతి వాదానికీ అపవాదం ఉండకపోదు. ఎక్కడో నూటికీ-కోటికీ ఒకడు తన జీవితాన్నే ఆదర్శాచరణకు అప్పగించిన వాడయితేతప్ప-మిగతా వాళ్ళంతా వాతావరణ ప్రాబల్యానికి లొంగి పోయేవారే !"

"వివాహం చేసుకొనిజీవితరంగంలోకి దిగినా, ఆదర్శాచరణకు తిలోదకా లివ్వాల్సిన అగత్యం లేదని ఒప్పుకున్నా వన్నమాట !"

"సకృత్తుగా అని అన్నాను"

"సకృత్తుగానైనా వీలవుతుంది గదా !"

"వీలుకానిదేదీ ప్రపంచంలో ?"

"అయితే నేను వివాహం చేసుకొని - కులాంతర వివాహమే చేసుకొని- నా ఆదర్శాలు చంపుకొని 'సంఘవాతావరణానికే దాసుణ్ణవుతానో-లేక దాన్నే దాసురాలుగా చేసుకుంటానో చూడాలి"

"రెండు చేతులూ చరిస్తేనే చప్పట్లు చరిచినట్లవుతుంది తమ్ముడూ ! కులం వదిలివచ్చి నిన్ను చేసుకోడానికి ఒకపిల్ల వుండ వద్దూ ?"

"ముందు కొచ్చేవాళ్లే లేరనుకున్నావా ?"

"అటువంటి సాహసక త్తె నొకదాన్ని చూపించు"

"దండిగా వున్నారు" అంటూ నా వైపు చూశాడు.

నేనుగూడా ఆయన భావాన్ని గ్రహించాను. నేను సాహసించ గలనని ఆయన భావించి నట్లున్నాడు. ఆయనట్లా భావించడం పొరపా టనుకున్నాను. ఈ అపోహను పెరగనీ గూడదనుకున్నాను. వెంటనే "ఎవరూ వుండరు!" అన్నాను.

ప్రసన్నారావుగారు అప్రతిభుడై నా వైపూ, శాంతవైపూ వాళ్ళక్కవైపూ గుడ్లప్పగించాడు. తర్వాత ఒక్కమాటగూడా మాట్లాడలేదు. శాంతగూడా మాట్లాడలేదు. ఇంతలో ఎవరో రావడంవల్ల మా టీచరు లేచింది. మేముగూడా ఆ అప్రియవాతావరణం నుండి బయటపడ్డాము.

సరిగ్గా వారం గడిచిందో లేదో ఒక సాయంకాలం శాంత అదరాబదరావచ్చి ప్రసన్నారావుగారు ట్రాన్స్ఫరయ్యారు" అంది విషాదంగా. నేను నోరు తెరచుకొని వింటున్నాను. వెంటనే" అది ఆయన ప్రయత్నించి చేయించు కున్నారట" అంది. నాకు ఆపుకుందా మనుకున్నా కన్నీ ళ్ళాగలేదు.

ప్రసన్నారావుగారిని పోగొట్టుకున్నాను. అందుకు నేను చాలా బాధపడ్డాను. అంతకుమించి నే నేమీ చేయలే ననుకున్నాను. నా కులాధిక్యతే నన్నావిధంగా భావింపజేసింది. వాళ్ళయింట్లో భోజనంగూడా చేయగూడని నా కులం-వాళ్ళతో వియ్యమందడం ఊహింపరాని విషయం. వాళ్ళతో కలిసి యేల భోంచేయరాదో, భోంచేసినందువల్ల యేం వూడిపోతుందో-ఆ నాడు నేను ఎక్కువ

తర్కించుకోలేదు. నాది పెద్దకులం-ఆయనది తక్కువకులం అనే మూర్ఖతలో పడిపోయా నంతే!

## 3

ఇంటర్మీడియట్ అయిపోయింది. ఆ వేసవిలో చాలా చాలా మార్పులొచ్చాయి. మా మామయ్య చనిపోయాడు. ఆయనేమో విముక్తిపొందాడు. ఈ బాధలనుండీ బాధ్యతలనుండీ తప్పుకున్నాడు. ఆయనపై ఆధారపడిన జీవులనంతా అయోమయంలో వదిలేసి పోయాడు. మా అత్తయ్య చాలా దిగులుపడిపోయింది. ఆమె యీ జీవితంలో సుఖమెరుగనిజీవి. చాలా బీదయింటిబిడ్డ. పుట్టింటివారు గూడా యిప్పు డెవ్వరూలేరు. మా మామయ్యగూడా బీదవాడే! ఆయనకుస్థిరాస్తిఅంటూ యేమీలేదు. ఉద్యోగంగూడా చాలాచిన్నది. హృదయం మాత్రం అతివిశాలం. ఆకలిగొన్నవాణ్ణిఏనాడూవృధాగా పంపినవాడుగాడు. కష్టాల్లో వున్నవాళ్ళను ఆదరించడమే ఆయన పని! ఆయన యీ జీవకారుణ్య కార్యంలో మా అత్తయ్య యెన్ని రాత్రులో ఆకలితో పడుకోవలసి వచ్చేది. మా అత్తయ్యకు రెండే రెండు చీరలుండేవి.పండుగ పబ్బాలొచ్చినా అంతే! ఇవన్నీ కష్టాలని ఆమె యేనాడూ భావించలేదు.సహధర్మచారిణి అంటే అసలు అర్థం ఆమెవల్లనే నాకు బోధపడింది.

మామయ్య కూతురు ఇంటర్మీడియట్ అంతకు ముందు ఫ్టైసెబంరులో ప్యాసయింది. అప్పటినుండీ ఉద్యోగ ప్రయత్నం

చేస్తున్నది. అప్పట్లో చదువుకొన్నవాళ్లు చాలాతక్కువైనా నిరుద్యోగ సమస్య తీవ్రంగా వున్నది. దాని కుద్యోగం దొరకలేదు.

ఇక నేను: నేను ఏ పరిస్థితిలో మామయ్య యింటి కొచ్చానో యిదివరకే చెప్పాను. ఆ పరిస్థితి మరింత విషమమై పోయిందని యింటికి పోయినంతవరకూ తెలియలేదు. నేను మా నాన్న దగ్గరికి వెళ్ళగానే ఆయన కన్నీళ్ళు పెట్టుకొని బావురుమని యేడుస్తూ నన్ను కౌగిలించు కున్నాడు. పసిపిల్లవాడు ఏడ్చినట్లు యేడ్చాడు. ఆయన కొంతకాలం నుంచీ తనవంట తానేవండుకుంటున్నాడు. మా సవతి తల్లికీ ఆయనకూ బొత్తిగా సరిపోవడం లేదు. దీనికి కారణం మా నాన్న నాపైగల విరోధ భావాన్ని కొంచెం కొంచెం విడనాడడమే మామయ్య ఆసరా పోయాక దుఃఖభారంతోపాటు నా భారం గూడా మా నాన్నపై పడింది

నేను వెళ్ళిన వారానికి మా సవతితల్లి వచ్చింది తన అన్నతో సహా: వచ్చినప్పటినుండీ చాలా ప్రేమతో సంచరించడం మొదలు పెట్టింది. నా పైన యెందుకో యెప్పుడూలేని శ్రద్ధచూపడం మొదలు పెట్టింది. ఆ ముచ్చట మూన్నాళ్ళలోనే బయట పడిపోయింది. నన్ను తన అన్న కిమ్మని మా నాన్నతో వాదించడం మొదలు పెట్టింది. ఆమెఅన్న నాలుగోఫారం నాలుగుసార్లు ఫెయిలై ఇక కాదనుకొని కరణీకం పుచ్చుకున్నాడు అతనికి నన్ను చేసుకోవాలని వుందట: కరణం అనగానే వాడెంత పెద్దమనిషో దాన్నిగురించి వేరే చెప్పనక్కర్లేదు. దుష్టకరణాల్లో అతను మొదటివాడనవచ్చును. కాఫీ, బీడీ, పొగాకూ, దుష్టస్వభావమూ ఇవన్నీకలిసి అతని స్వరూపాన్ని, వికృతంగానూ, భయంకరంగానూ మార్చేసి

నవి. అతని తొలి భార్య అతని దుష్టత్వానికి తట్టుకోలేక వెళ్ళి పోయింది. ఇపుడు పిల్ల నివ్వడాని కెవరూ సాహసించేవారులేరు. అందుకే యీనాడు నన్ను కటాక్షించివచ్చాడు. తొలి చూపులోనే నా హృదయం యీసడించుకొన్నదతన్ని.

మా నాన్న వీలుకాదన్నాడు. సతపోరగా నన్నే అడగమన్నాడు. నన్నడిగేటప్పటికి నేను తిట్టాను. నాది అంత మంచి స్వభావం గాదు. ఏదయినా అనదల్చుకుంటే మొగాన అనేస్తాను. అది మంచిదని కొందరంటారు. నిష్కపటత్వానికి తార్కాణం అని కొందరంటారు. ఎదుటి వారికి అప్రియమైన పలుకులు సత్యమైనా పలుకరాదని పెద్దలు చెప్పుతూవుంటారు. నేను అసహనంతో తిట్టేటప్పటికి మా పినతల్లి మండిపడి కొట్టేంతపనిచేసింది. నానా దుర్భాషలూ ఆడింది. చిన్నప్పటినుండీ పెంచి పెద్దచేసి నందుకు కృతజ్ఞతన్నాలేకుండా-గురుత్వమన్నాలేకుండా తిడతావా అని అసహ్యించుకొంది. నీవు చదివించడానికిదేనా ఫలితం అని మందలించింది. ఆమె తమ్ముడుగూడ ఉద్రిక్తుడై ఇల్లు విడిచి పోతూపోతూ "ఎవణ్ణో లేవదీసుకుపోయినదాన్ని బాంధవ్యంకోసం పాపం పోనీలే అని చేసుకుందామని వచ్చాను. కన్నంలో తేలు కుట్టిన దొంగలాగా నోరుమూసుకొని వుండకుండా పైగా నీలు గుడుగూడాసు!" అంటూ వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళిపోతూవున్న వాణ్ణి వుద్దేశించి ''అందని ద్రాక్ష పుల్లన కో" అని మా నాన్న అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఆయన అభిమానం మళ్ళా పకసారి దెబ్బతిన్నది. నా ఆ అజ్ఞానపుచర్య యెన్నిసార్లు జ్ఞప్తికి తెచ్చుకొని బాధపడ్డాడో,

కాలం జరిగే కొద్దీ దాన్ని మరవడానికి ప్రయత్నించాడు. దాన్ని మరవడం-నన్ను ప్రేమించడం-అతనికి అవసరమైంది. ఆయన కప్పటికి యాభై యేండు పైబడ్డాయి. యిరవై యెనిమిదేండ్ల మానవతి తల్లి ఆయన కొక సమస్య అయి కూచ్చుంది. పెండ్లయి యిప్పటికి పదహారేండ్లు దాటింది. తన పదహారవయేట కాపురాని కొచ్చింది. వచ్చిన ఒక నెలకే పుట్టింటికెళ్ళిపోయింది. తర్వాత అయిదుమాసాలకే మా పెద్దతమ్ముణ్ణి కన్నది. ఆ రీతిగానే తర్వాత మరిద్దర్ని కన్నది.

ఆమె చరిత్ర గొప్పది. ఆమె చరిత్రను విమర్శించే చరిత్ర నాకు లేదు. అయినా మాలో ఒక తేడావుంది. నేను అజ్ఞానంతో చేసినపని! ఆమె తెలిసిగూడా చేస్తున్నపని! ఆమెదిగూడా తప్పన డానికి లేదు పూర్తిగా! ఆ తప్పు మానాన్నది! ఆయనను ప్రోత్సహించిన స్నేహితులది! ఆయన్నావేశించిన పూర్వాచార మనే పెనుభూతముది! మా తల్లి చనిపోయేటప్పటికి మానాన్నకు ముప్పయినాలుగేండ్లు దాటినవి. రెండవ పెండ్లి చేసుకొమ్మని చాలామంది ప్రోత్సహించారు. మా నాన్న మొదట కాదని కూర్చున్నాడు. మరి రెండు నెలలకే మనసు మార్చుకున్నాడు. రజస్వలయిన పిల్లనిస్తామని కొందరువచ్చారు. తన సనాతనత్వం అడ్డురాగా మా నాన్న ఒప్పుకోలేదు. ప్రేమించిన భార్య చనిపోతే అంతా మరిచిపోయి మళ్ళా పెండ్లి చేసుకోడానికి అనుమతించిన ఆయన పూర్వాచార ధురంధత రజస్వలయిన పిల్లను చేసుకో డానికి ఒప్పుకోలేదు. పన్నెండేండ్ల పిల్లను చేసుకోడానికి పూను కున్నాడు. అప్పట్లో ఆ అమ్మాయికి యీ వివాహం యేమాత్రమూ

యిష్టంలేదు. వాళ్ళ పూళ్ళోనే పెండ్లి చేసుకోవాలని తనకుండేది. మా నాన్నకు రెండు పంటలూ పండగల ఆరెకరాల భూమి యింకా మిగిలి వున్నది. కౌలుకిస్తే ఎంత లేదన్నా నలభై యాభై బస్తాల ధాన్యం యేటా వస్తుంది. దాన్ని చూచి వాళ్ళు మా సవతితల్లి వద్దని యేడుస్తున్నా-మానాన్నకూ ఆమెకూ వయసులో యిరవై రెండేండ్లు తేడావున్నా-బలవంతంగా కట్టేశారు. పెండ్లయితే అయిందిగాని ఆమె తర్వాత రానేలేదు. తర్వాత నాలుగేండ్లకు తప్పనిసరై వచ్చి మళ్ళాపోయింది. తర్వాత అపుడపుడూ వస్తూ వుండేది. వచ్చినపుడుగూడా నెమ్మదిగా వుండేదిగాదు. నన్ను కొడుతూ తిడుతూ వుండేది. మా నాన్నతో పోట్లాడుతూవుండేది. మా నాన్న ఎంతెంత మర్భాషలాడేవాడో-ఎంతెంతగింజుకొనేవాడో నాకీనాడర్థమవుతున్నది. మా నాన్న వంశం మంచిదే! మహా అయితే పురుషుల్లో వుండేదేమోగాని స్త్రీలలో వుండేదిగాదు వ్యభిచారం! ఇపుడు తన భార్యే ఆవిధంగా కావడం ఆయనకెంతో దుఃఖకారణమయింది. కొన్నాళ్ళు యింట్లో చేతగాని వాడివలె యేడవడంగూడా చూశాను. మా సవతితల్లి ధాన్యమూ-బట్టలూ-ఇంకా యితర వస్తువులు—తన పుట్టింటికి తరలిస్తూవుండేది. ఏమయినా అంటే పైనబడి కరిచేంతపనిచేసేది. ఆమె అంత కంతకూ మరింత గయ్యాళయిపోయింది. మా నాన్న అంతకంతకూ తగ్గడం మొదలుపెట్టాడు. నాకా యింట్లో పోట్లాడే గొడ్లమధ్యవుండే లేగలాగా అయిపోయింది. నన్ను ప్రేమించేవాళ్ళు ఆ యింట్లో యెవరూ లేకపోయారు.

నేను మానాన్నకు వంటసాయం చేసేదాన్ని. బడికి పోతూ వుండేదాన్ని. శ్యామారావు నాకు పాఠశాల్లో సహవిద్యార్థి. మాయిం

టికి సమీపంలోనే వాళ్ళయిల్లుగూడా. చిన్నప్పటి నుండిగూడా కలిసి ఆడుకొనేవాళ్ళం. నాకంటే తాను నాలు గేండ్లు పెద్దవాడు. నేను మొదటి క్లాసులోవుంటే తాను నాలుగోక్లాసులో వుండేవాడు. నేను నాలుగోక్లాసుకు పోయినంతవఱకూ అయిదోక్లాసు వదల్లేదు. బడి లోనూ బయటా అతనికి ఆటలు తప్పితే వేరేచింత వుండేదిగాదు. మేము ఆలూమగళ్ళమాదిరి తయారై ఆడుకొనేవారం. నేను అతన్నేమగడుగా స్వీకరిస్తూ వుండేదాన్ని. ఆబడిలో మమ్మల్ని ద్దర్నీ ఆలుమగలనేవారు.

తన పదమూడవయేట అక్కడికి పదిమైళ్ళదూరంలోవున్న యేలూరు హైస్కూల్లో చేరాడు శ్యామూరావు. నేను అయిదోక్లాసు ప్యాసయ్యేటప్పటికి రెండుపర్యాయాలు ఫెయిలై యిల్లుచేరాడు. తర్వాత యెవరెంతచెప్పినా చదువుకుపోలేదు. తాను హైస్కూల్లోవున్న ఆ రెండేండ్లు మేము విరహం అనుభవించాము. అతను వచ్చే టప్పుడంతా రకరకాల పిప్పరమెంట్లు రిబ్బన్లు యిట్లాంటివి తెచ్చి యిస్తూ వుండేవాడు. మా స్నేహం యీవిధంగా అభివృద్ధికావడం మొదలుపెట్టింది.

తాను ఫెయిలైన తర్వాత స్కూలుకు పోనందుకు కారణం కొంతవఱకూ నేను. నేను వెళ్ళనేవద్దన్నాను. మేమిరువురమూ ఒకర్నొకరం వదలగూడదనుకున్నాం. అతను హైస్కూలో వున్న పుడు—అంటే యేలూరులో—నవలలు చదవటం నేర్చుకున్నాడు. తక్కువరకం నవలలు చదవడం బాగా అలవాటు చేసుకున్నాడు. వాటిల్లో వర్ణించినట్లుచేయాలని వువ్విళ్ళూరేవాడు. ఆ నవలలు కొని నాకుతెచ్చిచ్చాడు. నాకు మొదట అదిఅర్థమయ్యేదిగాదు. పోను

పోనూ అర్థమయ్యేది. తర్వాత తర్వాత ఆనవాలు నాలో కామ శక్తులను ప్రోత్సహించాయి.

సంఘంలో యెన్నో జరుగుతూవుంటాయి. జరగరానివి-కడకు ఊహింపరానివిగూడా జరుగుతూవుంటాయి. వాటినన్నిటినీ కని పెడుతూ యెవడూకూర్చోడు. అవన్నీ మేం కనిపెడుతున్నాం-వాటినే యథార్థాలుగా వ్రాస్తున్నాం-అని కొందరు నవలారచయితలూ-కథకులూ-బయలుదేర్తూవుంటారు. ఒకడు కొన్ని అసహ్యాపు పనులు జరిగినట్లు చిత్రిస్తాడు. అటువంటివాటిని సమర్థిస్తాడు మరొక రచయిత. ఇతర్లుగూడా తప్పుదారితొక్కేటట్లు ప్రోత్సాహం కలిగిస్తారు మరికొందరు రచయితలు. ఒక రచయిత ఓ యువజనులారా! మనమంతా అనుభవించడానికే పుట్టాం. పాప పుణ్యాలు, మంచిచెడ్డలు, అన్నీవదిలిపెట్టి అనుభవించండి. కామం పాపం కాదు. అనుభవించడానికి ప్రతిబంధకంవుంటే లేచిపోండి. లేచిపోయి అనుభవించండి." అని ఉద్బోధిస్తాడు. దీన్ని మరి కొంతమంది సెబాష్ అంటారు, ఈ పలుకులు యువజనులకు రుచిగానే వుంటాయి ఆచరించాలని ప్రోత్సాహం తప్పక కలుగు తుంది. పాశవికమైన-గుడ్డిదైన-ఆకామాన్ని నమ్మి ఆప్రోత్సాహం ప్రకారం ఆచరిస్తే-లేచిపోతే-రెన్నాళ్ళుగూడా స్వేచ్ఛగా అనుభవి స్తామో, లేవో-అప్పుడే స్త్రీ ఏకాకి అయిపోతుంది. వాడుపోతే నేం? మరొకడు అంటారా రచయితలు. వాడుపోతే బజారులోపడి సుఖించమంటారు. ఫలితం యేమిటి? ప్రేమించానని తెచ్చిన వాడు పారిపోగా కడకు మిగిలేది యేమిటి? తృప్తిపొందనికామం దిక్కులేనితనం- దీనత్వం- తెగింపు-జబ్బులు-బాధలు-దిక్కులేని చావులు.

రచయితలు యీవిధంగా వ్రాయడంచాలా తప్పు. యధార్థం అన్నది కొంతవ్రాస్తారు. నిజమే! యదార్థాన్ని వ్రాయడంలో గూడా ఉచితానుచితాలున్నాయి. ఏ ఫలితాన్ని కాక్షించి రచయిత వ్రాస్తున్నాడో మొదట తానుతెలుసుకోవాలి. సంఘశ్రేయస్సుకోసం వ్రాస్తున్నట్లయితే అది కేవలం ఆత్మవంచన. తద్వారా పరవంచన గూడా. రచయిత యెప్పుడుగూడా యేరహస్యాలు ప్రకటించాలో యేవి ప్రకటించగూడదో- తెలుసుకొని సంఘానికి ఒకనీతిమార్గం చూపే వాడుగానే వుండాలిగాని అన్యథా కాగూడదు.

ఈ నవలల ఫలితంమా యిద్దరిమధ్యగల స్నేహాన్ని కామ ప్రయోగాలకు ప్రోత్సహించింది. నేను రజస్వలనయినకొత్తలో యీనవలలు రాత్రింబగళ్ళు చదివేదాన్ని. శ్యామారావుకోసం తహ తహలాడేదాన్ని. కడపటికి రహస్యంగా కలుసుకోడం సాగించాం. మా యీ రహస్యస్నేహం కొన్నినెలలు నిరాటంకంగా సాగింది. తర్వాత మాసవతి తల్లి కనిపెట్టింది. నన్ను రాచిరంపానపెట్టడం మొదలుపెట్టింది. అవమానపరచడం మొదలుపెట్టింది. మానాన్న గూడా నన్ను చాలాసార్లుబాదాడు. ఇంట్లోకట్టివేసి అన్నంపెట్టడం గూడామానివేసేవారు. అన్నినవలలో చిత్రించబడినట్లే జరిగినయ్. ఇక రెండోఘట్టమే తరువాయి. అదిగూడా ఆచరించడానికి పూను కున్నాం. స్వేచ్ఛగా-హాయిగా-అనుభవించడంకోసం. ఈవ్యతిరేక శక్తులనుండి వేరుపడాలని నిశ్చయించుకున్నాం. అంతే! లేచి పోయాం.

రెన్నాళ్ళు బెజవాడలో వున్నాం. ఉన్నామేగాని మేమనుకు న్నంత స్వేచ్ఛగా వుండలేకపోయాం. అనుకున్నంత ప్రేమను

అనుభవించలేకపోయాం. అక్కడికి వెళ్ళింది మొదలుకొని ఆలో చనతో-చింతతో-దిగులుతో-కూర్చుండిపోయాం. తరువాతేమిటి అన్నసమస్య పెనుభూతంలాగా కనబడడం మొదలుపెట్టింది. భయ పెట్టింది. ఒకర్నిచూస్తే ఒకరం ఒకరికొకరు ద్రోహంచేసినవాళ్ళ లాగా చూచుకుంటూ కూర్చున్నాం. నీవల్ల నేనుచెడిపోయానంటే నీవల్ల నేనుచెడిపోయానని యిద్దరమూ వాదించుకుంటూకూర్చు న్నాం. బయటికిపోవడానికిభయం. అక్కడే కూర్చోడానికిభయం! పగలు భయం! రాత్రి భయం! రెన్నాళ్ళు యమయాతన అనుభ వించాం. అప్పటికప్పుడే మమ్మల్ని అనుమానింపసాగారు. ఎవరు ఎక్కడ అని అనుమానంగాచూస్తూ ప్రశ్నలు వేస్తూవుండేవారు. మూడోనాటికల్లా శ్యామారావు నాన్నగారొచ్చారు.! ఆ భయంకరా కారాన్ని చూడగానే నాకు పైప్రాణం పైన్నేపోయింది. ఆయన శ్యామారావును కాలితో నాలుగు తన్ని నను నోటికొచ్చినట్లు తిట్టి బయటికిలాగాడు. స్టేషనుకు పిలుచుకొచ్చాడు. సాయంకాలం బండికి యేలూరికి టిక్కెట్లుకొన్నాడు.

బెజవాడనుండి యేలూరువరకూ జరిగిన ప్రయాణకాలంలో నామనసు ఎంతో వికారాన్ని పొందింది. మనసంతా అవమానా సహ్యాపూరితమయిపోయింది. బండ్లో వొకమూల వొదిగికూర్చు న్నాను. శ్యామారావు మొగంవైపు చూడడంగూడా నాకిష్టం లేక పోయింది. మనసు పరిపరివిధాలాపోయింది. ఇక మావూళ్లో యెవరి మొగమూ చూడలేనని భావించాను. ఇకమావూరికివెళ్ళగూ డదని నిశ్చయించుకున్నాను. ఏలూరు వచ్చింది. అందరమూ దిగాము, నాకువాళ్ళతోపోవడం యిష్టంలేదు. గేటుదగ్గర జనసమూ

హాంలో చిన్నగా వాళ్ళ కండ్లుగప్పి మరలా రైలెక్కాను. వాళ్ళు మళ్ళావచ్చి పట్టుకోకపూర్వమే రైలు కదిలింది.

రాజమండ్రిచేరాను. మా మామయ్యయింటికి వెళ్ళాను. మామయ్య యింట్లోలేరు మాఅత్తమ్మ నన్నుచూడగానే ఆశ్చర్యంగా నోరుతెరచి ఆనందంతో కౌగలించుకొని "యెక్కడికి పారిపోయావే? నిన్నటినుండీ అందరమూ దిగులుపడి కూర్చున్నాము" అని అంటూ లేచి కాళ్ళూ మొగమూ కడుక్కోమన్నది. కడుక్కొని కూర్చున్నాక కొంత తిండిపెట్టింది. తిన్న తర్వాత యెక్కడికెళ్ళావన్నది. నేనేదో పెద్ద అబద్ధం చెబుదామని ప్లాను వేసుకొనే వున్నాను. ఆమె అడగ్గానే నాకు రెన్నాళ్ళక్రితం మతి భ్రమించిందనీ–ఏంచేస్తున్నానో తెలియకుండా పారిపోయాననీ–బెజవాడవరకూపోయి మళ్ళా కొంచెం కొంచెం స్మృతి రాగగానే తిన్నగా యిక్కడికి వచ్చేశాననీ అన్నాను. అని అట్లా గుమ్మం వైపుచూశాను. మామయ్య కనుపించాడు. సిగ్గుపడుతూ లేచాను. ఆవెనుకనే మానాన్న కనిపించాడు. గుండెలు దాటి కూలబడ్డాను

మానాన్న తన్నులనుండి నన్నెవరూ కాపాడలేకపోయారు. మానాన్న అసలు విషయం చెప్పినాక మాఅత్తమ్మ దవడలు నొక్కుకుంటూ ఎంతకవిత్వం నేర్చినావే నంగనాచిముండా అని తిట్టింది. ఆపైన యేంతో జరిగింది నేను మామయ్య యింట్లోనే వుండిపోవడం స్థిరపడిపోయింది తర్వాత మావూళ్ళోగూడా నేను మామామయ్య యింటికి పారిపోయినట్లే ఫిరాయించారు. అంతకంటకూ చిన్ననాటి ఆలీల మరుగు పడిపోయింది.

మా గ్రామం వదిలిపెట్టిన ఆరేండ్లకు మళ్ళా ఈనాడొచ్చాను మాపిన్ని అన్నయ్య తపసువాడి పోయిన మరునాడు శ్యామారావు

మా యింటికొచ్చాడు. పూర్వస్మృతులన్నీ ఒక్కసారిగా స్మృతి పథంముందు నాట్యమాడసాగాయి. శ్యామరావునుచూచి నాకేమీ భావవికారం కలగలేదు. అతనుమాత్రం కొద్దిగా అటువంటిది ప్రకటించాడు. మాటలుగూడా దాదాపు అట్లాగే మాట్లాడాడు అతనింకా పెండ్లి చేసుకోలేదనీ-ఎవర్నీ చేసుకోబోవడంలేదనీ-నన్ను చేసుకోవాలనివుందనీ-ఇట్లాంటివి కొన్ని చెప్పాడు. అన్నీ విని "నీ వింకా ఆ దృష్టితో చూడడం పొరపాటు" అన్నాను. మరలా "నీవల్లనే పొందిన అవమానం చాలు. అయితే అందుకోసం నిన్ను నేను నిందించడంలేదు. పరస్పరాజ్ఞానంవల్లనే అట్లాజరిగింది. నిన్ను నేను మొదట కామదృష్టితో చూశాను. అందుచేత సోదరా అని అర్థరహిత సంబోధన చేయదలచుకోలేదు. అయితే మనసులో మాత్రం అటువంటి భావం వహిస్తున్నాను. మరొక విషయం. నీవు చదువు అంతటితో ఆపేశావు. నేనింకా చదువుతున్నాను. మనం పెండ్లాడితే మనం యిద్దరమూ సుఖంగా బ్రదుకుతామనీ నాకు నమ్మకం లేదు. పైగా మనకు శాఖాభేదం వున్నది మన పెద్దలు అందుకు ఒప్పుకోరు ఈ విషయంలో మనం వాదన పెంచుకోగూడదని నా కోరిక. నీవు నిజంగా నాశ్రేయస్సు కోరే వాడివైతే యీ దినం నుండి యీ చాయలకే రావద్దు. నీకాళ్ళు పట్టుకొని వేడుకుంటున్నాననుకో!" అన్నాను.

శ్యామరావు వెలవెల బోతున్నాడు. అతడు నిజమైన వివాహదృష్టితోనే వచ్చాడు. నేనంటే అతనికి యిష్టం వున్నది. ప్రేమ వున్నది: అందుచేతనే వచ్చాడు. అతనికి ధనం వున్నది. పొలం వున్నది. ఏలోటూ లేకుండా జరుగుతున్నది. అతన్ని చేసి

కొంటే యేలోటూలేదు. వివాహం చేసుకున్నాక ఉద్యోగంలేకుం డానే సుఖజీవనం జరిగే వీలున్నాక స్త్రీకి ఇంకా చదవాలనే ఆశ అక్కరేలేదు. వివాహం కానివాళ్ళు చదవవచ్చు. ఉద్యోగాళ వున్న వాళ్ళు చదవవచ్చు. నేనానాడుగూడా పొరపాటు చేశాను. నా విద్యను చూచుకొని అహంకరించాను. పైగా ప్రసన్నారావుగారు నాదృష్టిలో వున్నారు. ఇంకా బాగా చదివినవాణ్ణి చేసుకొని ఉన్నతస్థితికి పోతానుగాని నాకంటే తక్కువ చదివినవాణ్ణి చేసుకుంటానా అన్న అహంకార భ్రమలో పడిపోయాను

శ్యామరావు వెళ్ళిపోయాడు. నాపైన కోపం వహించాడని నే ననుకోను. ఎందుకంటే నా ప్రార్థన మన్నించి ఒక నెలలోనే పెండ్లి చేసుకున్నాడు. నామీద గౌరవ భావం వహించడం మొదలు పెట్టాడు. అతని ఆ సుస్వభావాన్ని నేను తర్వాత గ్రహించాను. ఆ తర్వాతతర్వాత జంకులేకుండా అతనితో ఏకాంతంలో మాట్లా డడంగూడా మాట్లాడుతూ వుండేదాన్ని. అతనెంతో ప్రార్థించి తర్వాత యూనివర్సిటీలో నేను చదివేటప్పుడు ఎంతోగుప్తంగా ధన సహాయంగూడా చేసివున్నాడు. చిన్నప్పుడు తెలియక చేసిన చేష్టలను పొరపాటని గ్రహించి దాని పరిహారంకోసం ప్రవర్తించే వారు చాలా మహితాత్ములు ఆకోవలో చేరినవాడే శ్యామరావుగూడ.

మా పిన్ని మళ్ళా పుట్టింటి కెళ్ళిపోయింది. మా నాన్న ఆమె విషయం పట్టించుకోవడమే మానేశాడు. ఆమెయెడ విముఖ త్వం ప్రబలేకొద్దీ నాయెడ సుముఖత్వం ప్రబలం కాజొచ్చింది. మానవుడికి అవసరం వస్తేనే యోజిస్తాడు. లేకపోతే ఆ పనికే పూనుకోడు. ఆలోచిస్తేనే అసలు తత్వం తెలిసేది. మంచీ చెడ్డా

వితర్కించుకోడం అప్పుడు జరుగుతుంది. నా చదువును గురించి మొదట అనిష్టతను ప్రదర్శించినా పోనుపోనూ నా చదువును గురించే యోజింపడం మొదలుపెట్టాడు మానాన్న. నా చదువు తనకే అవసరం అని భావించడం మొదలుపెట్టాడు. మా సవతి తల్లిప్రవర్తన తనను నిస్పృహలోకి దింపింది. క్రమేణా నాపైన ఆధారపడి నావల్లనే తన జీవితం సాగించాలని యోజించాడు. సరిగా ఈ సమయానికే నా చదువు కాటంకం జరిగింది.

ఒకనాడు ఒంటరిగా గదిలో కూర్చొని విద్యను గురించి ఆలోచిస్తున్నాను. నిస్సహాయతవల్ల కంటినిండా నీరు నిండింది. ఇంతలో మా నాన్న వచ్చాడు. చూచి కారణం తెలుసుకున్నాక చదువు విషయంలో భయపడ నవసరంలేదన్నాడు. భూమి అమ్మి అయినా చదివిస్తానన్నాడు. అణగారిపోయిన నా ఆశలు మళ్ళా చిగిర్చాయి. ఒకేసారి ఆనర్సుకే అప్లయి చేసాను. హిస్టరీ ఆనర్సు సీటువచ్చింది. ఒక యకరం అమ్మాడు మానాన్న. కొంత డబ్బు తీసుకొని వాల్తేరు వెళ్ళిపోయాను.

౪

వాల్తేరు విశ్వవిద్యాలయంలో నివసించే భాగ్యం కలగడం ప్రత్యేకమైన అదృష్టం. అత్యున్నతమైన స్థలంపై నిర్మితమైన ఉన్నత భవనాలు, చుట్టుపట్లగల ప్రకృతి సౌందర్యానికే అలంకారాలు. తీర్చి దిద్దిన కట్టడాలకు చుట్టుపట్లగల గుట్టలు–ఆగుట్టలపై నాటినట్లున్న పచ్చనిచెట్లు–అంతరాంతరాల మరకతమణులు తాపి

నట్లు కనబడే హరితవర్ణం-దిగువ పాటలమై, విశాలమై, నిమ్నో న్నతములై, భిన్నభిన్నాకారాలతో కనబడే ఓడికలు-ఆ ఓడికలలో పాతాళపులోతులుగలిగి, యిఱుకై, పోసుపోసు వెడల్పై, పాటల వర్ణసైకతము గలిగి ప్రకాశించు పుష్కరిణీపథాలు ముందున, అల్లంతదూరాన, సంద్రపుగట్టున శోభాయమానంగా కనబడే కొబ్బరతోటలు-రకరకాల వృక్షజాతులు-ఇంద్రనీలమణిమయమై మిలమిలలాడే సముద్రము-ముత్యపుబంతులవలె ప్రకాశించు ఉత్తుంగతరంగాలు-ఎంతసుందరమనోహర దృశ్యాలు! ఎంత మనో జ్ఞవాతావరణము !!

అక్కడి ప్రొద్దుపొడుపు ఎంత స్వాభావికమో, ఎంతమనో జ్ఞమో, అనుభవించినవారికే తెలుస్తుంది. సముద్రగర్భంలో దూరాన-నవమాస గర్భోన్నతమునుపోలి ఈషదున్నతమైన జల రాశి గర్భాన్ని పాయలుగాచీల్చుకొనుచు-పెదవులవంటి ఆపాయ లను పిగలదన్నుకొని క్రమక్రమంగా పైకిప్రాకునట్టి బ్రహ్మాండ మైన అరుణాండము-ప్రసవసమయంలో రక్తముచిమ్మి చుట్టుపట్ల ప్రసరించినదా అన్నట్లు కనబడే రక్తారుణజలరాశి-పాటలవర్ణము నుండి ధవళవర్ణములోనికి మారు సూర్యకిరణకాంతులు ప్రసరించి అలలకదలికచేత తళతళలాడి వెండిరేకుల నెల్లెడల పఱచినట్లు అనిపించే ధవళసముద్రమూ-ఎంతమనోహరము !!

ఈమనోహర వాతావరణంలో పడిన నాజీవితంగూడా మనోజ్ఞంగానే గడిచింది. జీవితాంతము ఆమూడు సంవత్సరాలను స్మరించుకుంటునేవాలు ఒకవిధమైన తృప్తి, ఒకవిధమైన తన్మ యతా, ఒకవిధమైన తీయనిబాధా, కలుగుతూవుంటాయి.

చేరినకొత్తలో మేమందరమూ సాయంకాలాలు బీచికి వెళ్ళేవారం అక్కడ చాలా సరదాగానుండేది. మేము అట్లా విహరించి ఒకచోట కూర్చునేవారం. యువకులుకూడా గుంపులు గుంపులుగా వచ్చి విహరిస్తూవుండేవారు. వాళ్ళలో కొంతమంది మేముకూర్చున్న స్థానానికి దగ్గరేకూర్చునేవారు.

ఒకనెలదినాలు గడిచినయ్. ఒకసాయంకాలం నేనూ మా క్లాసమ్మాయి సుధ మరి యిద్దరమ్మాయిలు కాస్త ఆలస్యంగా బయల్దేరాం. సరాసరి మేము రోజూకూర్చొనే చోటికి వెళ్ళి కూర్చున్నాం. పది పది హేనుగజాల ముందుగా అలలకు చాలదగ్గరగా కొందరు యువకులు కూర్చొనివున్నారు వీళ్ళు ఇదివఅకటివారు గారు. వాళ్ళమాదిరిగా చిలిపిగా గిచ్చుకుంటూ గిల్లుకుంటూ కేరింతలు కొడుతూ కూర్చోలేదు. అసలు మావైపు చూడనేలేదు. అందులో మాక్లాసుమేటు మోహనకుమార్ శ్రావ్యంగా పాడుతున్నాడు. మాసీనియర్ విద్యార్థి మధుమూర్తి అప్రక్కనేవున్నాడు. మేము ఆగానంవింటూ సముద్రంవైపుచూస్తూ కూర్చున్నాం.

"అల్లంతదూరాన పెద్ద అల బయలుదేరింది. అంతకంతకు ఉత్తుంగమై ముందటి అలలన్నిటినీమింగి మాపైకె వస్తుందేమో అన్నంత ఆకారాన్ని దాల్చింది. వానివెనుక మరొకటి బయలుదేరింది. అది వీటన్నిటినీమ్రింగుతుందా అన్నంత ఉత్తుంగమై వస్తున్నది. ఆవెనుక మరలా ఒకటి బ్రహ్మాండమైనది బయలుదేరింది. ఆవెనుక అంతకుమించినది మరొకటి! ఆవెనుక మరొకటి! అట్లాగే ఎడతెగకుండా ఉరుకుతున్నవి. అన్నీ ఘోషిస్తూ వడివడిగా పరుగిడుతున్నవి, బ్రహ్మాండంగా పడగలెత్తి భయంక

రంగా బుసకొడుతూ ఒకదానొకటి తరుముకొనివచ్చే కోడెనాగు ల్లాగా పరిక్రమిస్తున్నవి! వాటి పూత్కారముంవల్ల చింపెపడేజల్లు ల్లాగా చిన్నచిన్న నీటికణాలు మాపైన పడుతున్నవి. కోపోద్రేకం చేత ఒక్కమారు "ఫెళీ" మని ఫణాన్ని నేలకేసి కొట్టినట్లుగా తరంగము గట్టును దాకి ఘూర్ణితమై చుట్టలు చుట్టలుగా చుట్టుకొని పొరలి పొరలి ఉద్ధృతంగా వెనకవచ్చే తరంగపాదాలచుట్టి నెట్టి వేసింది. అది బోరగిలపడి చుట్టుకొని చుట్టుకొని దీనిలో లీనమై తర్వాత వస్తున్న అలను కొట్టివేసింది. ఈవిధంగా ఘూర్ణిల్లుతున్న సముద్రం సాభావోద్వేగాన్ని పోలుతున్నది" అన్న అర్థాన్నిచ్చే పద్యాన్ని పాడుతున్నాడు. ఆదృశ్యాలన్నీ సాక్షాత్తుగా కనిపిస్తూ వుండగా-మంచువంటి నీటితుంపురులు పైనబడి శరీరానికి హాయిని కూరుస్తూవుండగా-మంద మందమై శీతవాయువులు మనశ్శరీరాలకు ఆహ్లాదాన్ని కూర్చుతుండగా-పాడుతున్న కంఠం, ఆకంఠం వ్యక్తీ కరిస్తూవుండే భావం, అభావంలోని రసం, మాహృదయాలను ఆనందరసంలో ముంచెత్తినవి.

కానేపయ్యాక వాళ్ళు బయలుదేరారు, వారివెనుక మేము గూడా బయలుదేరాం. కొద్దిగా చీకటిగూడా పడింది. "మేంగూడా వస్తున్నాం కాస్తఆగండి" అన్నాను నేను. వాళ్ళు నిలబడ్డారు. 'అంతమధురంగా పాడినవందుకు అభినందనలు'' అన్నాను నేను "మాధన్యవాదాలు గూడ" అని అందుకున్నది సుధ. "అబ్బే! అదేం కంఠమండి? తడికి వెధవది బొంగురుపోయింది. లవంగం నమిలినా ఎక్కలేదు కంఠం! మీరు మమ్మల్నేడిపించడానికట్లా అంటున్నారు'' అన్నాడు మోహనకుమార్. ''ప్రతిభాశాఖరల్లే

అంటారులెండి" అన్నాడు మధుమూర్తి. "అవునవును! ప్రతిభ వున్నవాళ్ళు చాటుకుంటూ కూర్చుంటారుగా బోలు" అన్నాడు మోహనకుమార్ నవ్వుతూ. ఇట్లా మాట్లాడుకుంటూనే ఘూహోస్టలు సమీపించాము.

ఈపరిచయాన్ని పురస్కరించుకొని మోహనకుమార్ మాహోస్టలుకు రాను మొదలుపెట్టాడు. నన్నూ సుధనూ పిలిపించే వాడు. మేముగూడా అతనువస్తే ఎంతోసంతోషంతో వెళ్ళిమాట్లాడే వాళ్ళం. అతను చాలా అందంగావుంటాడు. ఛామచక్కని శరీరము మంచి ఛాయ! అతన్ని మేము కాస్త హెచ్చువేసేవారం అతను తన గుణగణాలను మరికాస్త హెచ్చువేసి చెబుతూవుండేవాడు. కవిత్వంలో, సంగీతంలో, ఇట్లాంటివాటిలో తనకేంతో అభిరుచి వున్నట్లు చెబుతూవుండేవాడు. మాకవన్నీ యదార్థాలుగాను, అట్లాగే చెప్పాలన్నట్లుగాను—ఆకర్షణీయంగానూ తోచేవి. యెందుకంటే అతనంటే యిష్టపడ్డాంగాబట్టి. అతని అందానికి తగినట్లు కంఠం—కంఠంతోపాటు కవిత్వం—నిజంగా యితరులెంత అసూయ పడ దగినమనిషి!

నాలుగునాళ్ళ తర్వాత మళ్ళా అక్కడే కలుసుకున్నాం. మోహనకుమార్ ఈనాడు గేయం పాడుతున్నాడు. "ఆనాడు శుక్ల త్రయోదశి! చంద్రు డప్పుడే అల్లంతయెత్తున ప్రకాశిస్తున్నాడు. సముద్రంపై నీరు మిలమిలా మెరుస్తున్నది. వెండి చేపలు నీటిపై కెగిరి తళతళా మెరుస్తున్నట్లున్నది. ప్రతి తరంగమూ చంద్రుడిలో నుండి దొరికినంత చంద్రత్వాన్ని హరించి పైన పులుంకున్నట్లుగా ఊగుతున్నది. తన చంద్రత్వాన్ని వాటినుండి లాక్కోడానికి

చంద్రుడు వడివడిగా ముందుకొస్తున్నాడు. నీటి మాత్రలైన మేఘాలు వత్తాసి వచ్చి చంద్రుణ్ణి అపుడపుడూ అడ్డుతున్నాయి. వాటి పొట్టలను చీల్చుకొనిగూడా చంద్రుడు ముందు కురుకుతున్నాడు. అంతకంతకూ పైకొస్తున్నాడు. వచ్చి అలలు పులుంకున్న బంగారు చాయను లాక్కున్నాడు. ఉపశమనార్థం వెండి రంగు నిచ్చాడు. తృప్తిపడి అలలు వెండి రంగునే పులుంకుంటున్నాయి."

నిజంగా నేను ఆనందాన్ని భరింపలేకపోయాను. మోహన్ కుమార్ ఎంతో మోహనాకారంతో నా హృదంతరాళంలో ప్రతిబింబించాడు. ఈ షదున్మీలితనేత్రనై హాయి ననుభవిస్తున్నాను. పలకరించినా నా స్నేహితురాండ్రతో మాట్లాడ నిచ్ఛగించలేదు. ఇంతలో వాళ్ళు లేచి మాదగ్గర కొచ్చారు. నేను ఉప్పొంగిపోతూ "మోహన్‌కుమార్‌గారూ! మీరు మధుర కవులు! సుశ్రావ్య సంగీత నిపుణులు! హృదయ వీణల పలికించగలరు! మీ కవిత్వంలో ఉత్ప్రేక్ష అడుగడుగునా మెరుస్తుంది! నిజం చెప్పాలంటే మీ పేరు సార్థకం!" అన్నాను ఆవేశంలో అన్నాను. నేను ఉద్రేకినని, చెప్పకపోయినా, ఒక రోజులోనే కనిపెట్టేయగల రెవరైనా. నే నామాట అనేటప్పటికి "మోహనకుమార్ తొలిసారిలాగా సంతోషం ప్రకటించలేదు. సంతోషాన్ని నటించాడు. తానేదో పట్టుపడినవాడిలాగా ఇజుగు లాడుతున్నాడు. మధుమూర్తి యొక్క అభిముఖనేత్రాల మాటిమాటికీ చూస్తున్నాడు. నంగి నంగిగా "అబ్బే! అంత పొగడ్తకు తగనండీ!" అన్నాడు. అంతే గాని కవిత్వం తనది కాదని చెప్పలేదు. ఇంతలో వాళ్ళమిత్రుడు

"ఏమన్నారు? మీకు మధురకవా? హృదయవీణల పలికించగలడా? ఉద్దండ కవులవలె ఉత్ప్రేక్షలు పలుకుతాడా? ఇట్లాగని మీముందు కోశాడా?-ఏరా! మోహన్! ఆడవాళ్ళదగ్గర కోశేశావేమిటి నీవే కవిత్వం వ్రాసినట్లుగా" అని అంటూ మా వైపు మళ్ళా తిరిగి "ఏమీ అనుకోకండి! మిమ్మల్ని అంపర్నీ ఆప్తులుగా పరిగణిస్తున్నాంగాబట్టి మా స్నేహితుణ్ణి మీ ముందు అట్లా అంటున్నాను. అసలు ఈ గేయం వ్రాసింది మధుమూర్తి! మొన్న పాడిన పద్యంగూడా మధుమూర్తి వ్రాసిందే! వీడి మొఖం వీడికట్లా కవిత్వం వస్తుందా? వీడి కంఠం అద్దెకు తీసుకున్నాం" అని నవ్వాడు. ఆశ్చర్యంగా "అట్లాగాండీ!" అని అతనితో అని "క్షమించండి, సత్యాన్ని తెలియక అట్లా అన్నాను. మీకు మా హృదయపూర్వకాభివందనములు" అన్నాను మధుమూర్తివైపు తిరిగి మనసు గూడా అటువైపు తిరిగిపోయింది. "అకర్షింపజేసేశక్తి నిజంగా నా కవిత్వంలో వున్నదంటారా? లేక మా వాడి కంఠంలో వుందంటారా?" అన్నాడు మధుమూర్తి. "ఆకర్షణ అసలు శబ్దంలో లేనిదే సంగీతము ఎక్కడొస్తుందండీ" అన్నాను. "పొరపాటు రాగాలను కేవలం సరిగమ ఛాయల్లో పాడేటప్పుడుండే ఆకర్షణ మాటేమి చెబుతారు?" అన్నాడు మధురంగాచూస్తూ.

"అయితే మీకు సంగీతంగూడా వచ్చునన్నమాట!"

"సంగీతం కవికి అవసరము!"

ఆ రాత్రి ఏదో కొంత చదివాను. ఇంకా నిద్రగూడా రాలేదు. అయితే చదవను బుద్ధిపుట్టలేదు. లైటార్పి పడుకున్నాను. కన్ను మూశాను.

"మేము హాస్టల్లోకి రాగానే ఆ మిత్ర బృందం వాళ్ళ హాస్టలుకు నడక సాగించింది. ఆర్ట్స్ అండ్ కామర్స్ కాలేజీనుండి లైబ్రెరీకి వెళ్ళే దార్లోవున్న వలయం వరకూ నిశ్శబ్దంగా వెళ్ళారు. ఆవలయం దగ్గర,

"అయితే అవి వ్రాసింది నీవే అని కోశావన్నమాట" అన్నాడు మధుమూర్తి.

"ఎవరితో?" అన్నాడు మోహన్‌కుమార్ వెగటుగా!

"నీవు టోపీవేయదల్చుకొన్నవాళ్ళతో!"

"ఎవరికీ టోపీ వేయదలచుకోలేదే!"

"అయితే హసంతి ఆశ్చర్యపడటమూ, నాకు అభివందనాలు చెప్పడమూ ఎందుకు జరిగిందంటావు?"

"నేను చెప్పానని యెందు కనుకుంటావు! వాళ్ళే ఆవిధంగా యెందుకు వూహించుకొని వుండగూడదు?"

"ఊహించుకో వచ్చులే! అది వాళ్లూహించుకొన్నదే అయితే అంతమార్పు కనిపించదు."

"అని నీవూహించుకుంటున్నావ్!"

"ఊహ యెందుకవుతుంది? అసలు రహస్యం బయటపడగానే హసంతి నిన్ను అసహ్యించుకుంటున్నట్టు చూడడం నేను గమనించాను" మోహనకుమార్ మండిపోతున్నాడు. అహం బాగా దెబ్బ తిన్నది పాపం! ఇంతలో,

"పోనీలేరా! ఏదో కోతలు కోసి ఆకర్షణ సంపాదించాలను కున్నాడు. అందుకు మనకు కడుపుబ్బరం యెందుకు?" అన్నాడు మిత్రుడు ఎకసక్కెంగా. సముద్రం గట్టునగూడా ఆట్లాగేమాట్లా

డాడు దాదాపు. అపుడే మోహన్‌కుమార్ కోపాన్ని వహించాడు. ఇది విని ఇంకా ఉగ్రుడయ్యాడు.

"నోర్మూయ్! జాగ్రతగా మాట్లాడు" అన్నాడు దర్పించి.

మిత్రుడు వెంటనే మోహన్‌కుమార్ నోరుమూశాడుచేత్తో! మూసి "ఇకమీదటనైనా కాస్త జాగ్రతగా మసలుకో! అబద్ధాలు చెప్పి ఆకర్షిస్తే అది ఎంతో కాలం వుండదు. చూశావా కొన్ని వారాల్లోనే నీ భండారం బయటపడింది!" అన్నాడు పరిహాసంగా.

"ఇక నోరెత్తితే తంతాను" అన్నాడు మిత్రుని చెయ్యి విదిలించివేసి

"అంతేగాని హసంతి మనసును తిప్పుకోలేవుగదా!"

మిత్రుడి చెంప ఫెళ్ మన్నది.

మిత్రుడు నిశ్చలంగా నిలబడుకొన్నాడు.

మోహన్‌కుమార్ పశ్చాత్తాపపడుతున్నాడు.

"తొందరపడితే వెనుక చింతించాల్సివస్తుందిసుమా!"అన్నాడు మధుమూర్తి ఇంకా శాంతంగానే. మోహనకుమార్ తటాలున మిత్రుడిచెయ్యి అందుకొని క్షమాపణ వేడుకున్నాడు. అందరూ అశోకవర్ధన్‌వైపు వెళ్ళిపోయారు."

నాకు నవ్వువచ్చింది. పట్టకుండావచ్చింది. పకపకనవ్వాను. బిగపట్టి బిగపట్టి నవ్వుతున్నాను. ఊరికే నవ్వుతున్నాను. ప్రక్క రూంలోనుండి సుధ వచ్చింది. భుజానకొట్టి లేపుతూ "ఏమిటే యీ వెర్రివేషాలు! కలవరిస్తున్నావా?" అంది. నేను లేచి కండ్లు పులుంకుంటూ భలే కలవచ్చిందిలేవే?" అన్నాను.

"కలగాదది, పగటికల! నీవంతా వూహించుకుంటూవుంటావ్" అన్నదది.

మరునాడుదయం మోహనకుమార్ వచ్చాడు. సుధ వెళ్ళింది గాని నేను వెళ్ళలేదు మాట్లాడ్డానికి. అతనిపైగల అకర్షణ-సద్భావం విన్నటితోపోయింది. ఆస్థానే మధుమూర్తి ప్రతిష్ఠితుడైనాడు. అతను పిలుస్తున్నాడని చెప్పగా వెళ్ళాను. ఇదివరకటివలె కల్పించుకొని మాట్లాడలేకపోయాను. ఊరికే కూర్చున్నాను. అతనే మయినా ప్రశ్నలువేస్తే జవాబులు మాత్రం చెప్పాను. నాయీవిముఖత అతనికి బాధగలిగించింది. సుధకుమాత్రం ఆమార్పు సంతోషాన్ని ప్రసాదించింది.

తర్వాత కొద్దిదినాలు బీచికి వెళ్ళలేదు. తర్వాత వెళ్ళినపుడు వీళ్ళు తటస్థ పడలేదు. కొన్నిరోజుల తర్వాత ఒకనాడు బీచిలో మేం కూర్చొనివుండగా మధుమూర్తి మిత్రుడు మాత్రమే వచ్చారు. బీచిలో యింకా ఆడుపిల్లలు మగపిల్లలు వుండడంచేత వాళ్ళుచీకటి పడేవరకూ అటూ యిటూ తిరిగి తర్వాత మమ్మల సమీపించారు. కొంత కవిత్వచర్చ సాగించినాక యెవరిస్థానాలకు వారు వెళ్ళిపోయాం.

నాకు కవిత్వపిచ్చి వుంది. ఇంటర్మీడియట్‌లో కొన్ని కావ్యాలు గూడా చదువుకున్నాను. అసలు తెలుగు ఆనర్సు తీసుకోవాలని వుండేది. తెలుగు ఆనర్సంటే అంత మర్యాదలేదా రోజుల్లో. చరిత్ర, లెక్కలు, ఇట్లాంటివాటివలె ఇంగ్లీషులో నేర్పేటట్లయితే దానికిగూడా మర్యాదవుండేదేమో! ఇంగ్లీషులో నేర్చుకుంటారుగాబట్టే సంస్కృతానికి ఆపాటి విలువన్నా వుండడం జరుగుతుంది. ! తెలుగు ఆనర్సుచదివే విద్యార్థులు కొంతమంది యెవరన్నా యేం చదువుతున్నారనిఅడిగితే లిటరేచర్ ఆనర్సనో

హిస్టరీ ఆనర్సనో-బాటనీ ఆనర్సనో చెప్పుకొనేవారు న్యూనతకు భయపడి. మాతృభాషా సేవ చేస్తున్నాం అని తలెత్తుకొని తిరిగే రోజులు కావవి. అందుకోసమే నేనుగూడా చరిత్ర తీసుకున్నాను. నాకు కవిత్వం వ్రాయాలని ఉత్సాహంపుట్టింది. మధుమూర్తి ప్రోత్సాహంవల్ల ఇదివరకు నేనువ్రాసిన కొన్ని కథలకు మెరుగుపెట్టి పత్రికలకు పంపించాను. తక్షణమే వేసుకున్నారు. వాటిని మధు మూర్తికి చూపించి యెట్లావున్నాయన్నాను. అతను ఒక మోస్తరుగా మెచ్చుకుంటూ "ఆడవాళ్ళవి యెట్లావున్నా పత్రికలవాళ్ళు వేస్తారు" అన్నాడు. నేనా వాదాన్ని గట్టిగా ప్రతిఘటించాను. కావలిస్తే నిరూపిస్తానన్నాడు. నిరూపించమన్నాను.

మూడుదినాలు జరిగినయ్. ఆసాయంకాలం కాలేజీనుంచి వచ్చి కూర్చొనివున్నానుగదిలో. ఇంతలో పోష్టువాడు పత్రికొకటి పట్టుకొనివచ్చి యిచ్చాడు. నేను దాన్ని తిరగేస్తూ కూర్చున్నాను. ఒక గేయమూ, దానికింద నా పేరూ, వుండడం చూశాను. ఆశ్చర్య పడుతూ ఆమూలాగ్రం చదివాను. చాలా బాగున్నది. గాని అది నాదిగాదు. నేనసలు గేయరచనే మొదలుపెట్టలేదు. ఇంతలో అదే పత్రిక ప్రతినింకొకదాన్ని చేతపట్టుకొని మధుమూర్తి వచ్చాడు. ఆయన్నాహ్వానించి కూర్చొనబెట్టి నాచేతిలోని ప్రతిని తనచేతికిచ్చి గేయాన్ని చూపిస్తూ "నాపేరిటవాళ్ళెవరైనా వున్నారా మీరెరిగినంతలో" అని అన్నాను.

"లేరనుకుంటాను. ఎందుకు?" అన్నాడాయన

"ఈగేయం నాదికాదు."

"మీరువ్రాయకపోతే మీకీపత్రిక నెందుకు పంపుతారు?"

అతని మొగం తీరు చూచి నాకు అనుమానం వేసింది. మూన్నాళ్ళక్రితం జరిగిన మా వాదన జ్ఞప్తికొచ్చింది. వెంటనే "ఈ గేయం తమరు వ్రాశారన్నమాట!" అన్నాను. అతను దానికి ఒప్పుకుంటూ తన చేతిలోని పెద్దకవరు తెరిచి అందులో నుంచి ఈగేయం వ్రాతప్రతిని బయటికిలాగి దానిపైనవున్న సంపాదకుని సంతకము, తేదీలను చూపించి, కించిద్విహాసనంతో "ఇది వాపసు పంపబడిన గేయం హసంతీ! ఇక పురుషుడుగా పంపితే వేయరని స్త్రీత్వాన్ని ఆశ్రయించాను."అన్నాడు. వెంటనే మరికొన్ని వ్రాతప్రతులు తీసి నాచేతి కిచ్చి చదవమన్నాడు. అవి పది వున్నాయి. అందులో కొన్నింటిపైన సంపాదకులు వాపసు చేసిన చిహ్నాలు కనిపించాయి. కాసేపు రచయితలు, పాఠకులు, పబ్లిషర్లు-వీళ్ళను గురించి చర్చించుకున్నాక మధుమూర్తిలేచాడు. "కొంపతీసి ఇకమీదటనైనా మీ పుంస్త్వాన్ని వదలబోకండిసుమా!" అంటూ నమస్కరించాను. నా వైపుచూచి నవ్వి, వెళ్ళిపోయాడు. అతను వెళ్లిపోగానే నేను నా మంచంపై పడుకొని లైటు వెలిగించి కతలన్నీ చదివాను. ఆవన్నీ యెంతబాగున్నాయో చెప్పలేను. అప్పటికి నా కతలు కొన్ని అచ్చయివున్నాయి. ఆ కతలు అచ్చయి ఇటువంటి కథలు తిరగ్గొట్టబడడం చూచి నేనెంతో సిగ్గుపడ్డాను. నా కతలకూ ఈ కతలకూ ఎంత తేడా! శైశవానికీ ప్రౌఢత్వానికీ వున్నతేడా అక్కడ వుంది.

మధుమూర్తి ప్రోత్సాహంవల్ల మరికొన్ని పుస్తకాలు చదివాను. పుస్తకాలు చదివి విజ్ఞానమూ భాషా పెంపొందించుకొనే కొద్దీ నాలో ఆత్మ విశ్వాసం ప్రబలజొచ్చింది. కాని మరొకవైపు

ఏమీతెలియనట్టు ఇపుడు నాకు తెలిసింది. ఆవగింజలో అర్ధంగూడా కానట్టు భావించడం మొదలుపెట్టాను. తర్వాత తర్వాత ఎంతెంతో చదివాను. అయినా తెలిసిందంతా సముద్రంలోని నీటి బొట్టని ఈనాడూ భావిస్తున్నాను. మధుమూర్తి మొదట యీ మాటలే అనేవాడు. అతను చదివిన పుస్తకాల గురించి విమర్శనతోపాటు నాకు చెబుతూవుండేవాడు. నేనుగూడా నేను చదివినవాటిని గురించి అట్లాగే చేస్తూవుండేవాణ్ని. ఈ విధంగా మేమిరువురమూ సాహితీ సేవకులమై పరస్పరం గౌరవభావాన్ని పెంపొందించుకుంటూ వుండేవారం.

మాకు క్వార్టర్లీ సెలవులు వస్తాయనగా మానాన్ననుండి జాబొచ్చింది. ఆ జాబులో తాను తప్పకుండా వాల్తేరువచ్చి వుంటా నని వ్రాశాడు. ఇల్లు చూడమని వ్రాశాడు. ఇదివరకుగూడా వ్రాస్తూవచ్చాడుగాని నే నంతగా పట్టించుకోలేదు. మానాన్న ఈ దఫా నన్ను విడిచి వుండడం నచ్చక తప్పక వస్తున్నానని ఖండితంగా వ్రాశాడు. ఆ విషయం మధుమూర్తికి చెప్పాను. అతను తప్పకచూస్తానని చెప్పాడు. సెలవులకు ఇంటికి వెళ్లిపోయాను.

నేనూ మానాన్న వచ్చేటప్పటికి వాల్తేరులో యిల్లురెడీగా వున్నది. అద్దె పెనిమిదిరూపాయలుమాత్రము. ఒకనెల బాడుగ సంచాకారంగా మధుమూర్తే యిచ్చాడు. తర్వాత నేనెంత బల వంతంచేసినా ఆతనుతీసుకోలేదు. ససేమిరా అన్నాడు.

నేనూ మానాన్న ప్రత్యేకంగా కాపురం పెట్టాము. ఆయన వచ్చింది మొదలుకొని మధుమూర్తి కులాన్నిగురించి వేధించడం మొదలు పెట్టాడు. నాకిపుడు కులవిషయంలో పట్టింపు తగ్గిపో

యింది. కులాన్నిగురించి యోజించవలసిన అవసరాలు ఇదివరకే యేర్పడ్డాయి, ముఖ్యంగా ప్రసన్నారావుగారివిషయంలో. ప్రసన్నరావుగారు దూరమైపోవడం నాకు కనువిప్పైనది. కొత్తప్రపంచ జ్ఞానంతో నావిద్యాసంస్కారాలతో యోజించాను. కులాధిక్యత, కులనీచత అన్నవి జాతి జాతికే ద్రోహంచేశాయని అర్థం చేసుకున్నాను. ఇపుడీ నాలుగునెలలుగా మధుమూర్తి స్నేహంతో-ప్రోత్సాహంతో-గాంధీజీవితము, గాంధీ సాహిత్యము హిందూదేశంలో పుట్టి పెరిగిన మహాత్ముల జీవిత చరిత్రలు చదివాను. ఇదివరకంతో అజ్ఞానంలో వున్నట్లు, కూపస్థమండూకమైవున్నట్లు, ఇపుడు వెలుగులోకి వచ్చినట్లు భావించాను.

ఇదే సమయంలో మధుమూర్తి ప్రవర్తన, భావాలు నాకు నచ్చినయ్. మధుమూర్తిచే చిందులుత్రొక్కేమనసు అతనిలో వున్న సంస్కారణాభిలాష, పట్టుదలలకు దాసోహం అన్నది. నన్నతను పూర్తిగా లోబరచుకున్నాడు.

గ్రంథపఠనము, సహవాసము-ఇవిరెండూ మానవుని జీవితంలో మార్పులు తెచ్చినట్లు మరేదీ తీసుకురాలేవు. సత్పురుషులతోడి సాంగత్యము, సద్గ్రంథ పఠనము, మనశీలాన్ని చక్కజేస్తాయి, అభివృద్ధిపరుస్తాయి, సత్కార్యాలు చేయిస్తాయి; ఆత్మధైర్యాన్ని ప్రసాదిస్తాయి; సహవాసం ఎటువంటిది చూసుకోవాలో అది మనం జాగ్రత్తగా పరిశీలించి చేయాలి. అందులో దైవిక భాగంగూడా కొంతవుంది. నాకు ప్రసన్నారావుగారితోడి పరిచయం దైవికం. మధుమూర్తితోడి స్నేహం నేనెన్నుకొన్నదే!

మధుమూర్తిపైన నేను మమతను ప్రదర్శిస్తూవుండటబట్టి మానాన్న అనుమానించి కులాన్నిగురించి పట్టుదలగా అడిగాడు.

అతని కులాన్ని గురించి అడగడానికి నాకెంతో బాధ గలిగింది. ఏమీలేదని నేనొక నిర్ధారణకు వచ్చింతరువాత అతన్నెట్లా అడగడం? బాధపడుతూనే అడిగాను. క్షమాపణలతో అడిగాను. నేనెందుకడిగానో అతనర్థంచేసుకున్నాడు సందర్భాన్నిబట్టి. వెంటనే చెప్పాడు. నేను మానాన్నకది చెప్పాను. అదివిని ఆయన పెదవి విరిచాడు నాకది అసహ్యం వేసింది.

మా స్నేహం ఆకర్షణలోకి మారటం మానాన్న చూశాడు. చాలా చాలా మనసుతో వితర్కించుకున్నాక చెప్పక తప్పదని ఒకనాడు "అతనితో అంత స్నేహం మంచిదిగాదమ్మా: కులం కానివాళ్ళతో అట్లా వుండడం కళంకానికి దోహదం" అన్నాడు. ఆమాటవిని నేనెంత బాధపడ్డానో ఆపరమాత్మకే తెలియాలి. నాకేదో కిరీటమంత కులముందట! అతనికట్లాంటిది లేదట! అసలుతత్వం విచారిస్తే అతనిలో నేనెన్నోవంతు. మానాన్నతో వాదన బయలుదేరింది. నేను ఉద్రేకిసని మళ్ళావకసారి చెబుతున్నాను. ఆయన పుట్టిపెరిగిన వాతావరణం వేరని తెలిసివుండీ గూడా ఈసంస్కారదృష్టి అలవరచుకొనే అవసరం ఆయనకు లేదని తెలిసిగూడా-నేనాయనతో ఉద్రేకంతో వాదించాను. పర్యవసానం యేమిటంటే ఆయన నన్ను గొడ్డును బాదినట్లుబాది మూటాముల్లె కట్టేశాడు. "ఇక వూరికి బయలుదేరు వెధవా! ఏదో చదువుకొని నన్నుద్ధరిస్తావని భ్రమపడ్డాను. కడపటికి నావంశాన్నే క్షుద్రం చేస్తావనీ-బ్రాహ్మణ్యాన్నే మట్టికలిపేస్తావనీ అనుకోలేదు. నీవెప్పుడూ వంశానికి కళంకం తెచ్చేవానివే. నడు యింటికి!" అన్నాడు ఆవేశంతో. ఆనాడంతా మేము నిరాహారులంగా, మౌనంగా

గడిపాము. పైవిషయమంతా ఒకసాయంకాలం జరిగింది. ఉద యం నిద్రలేవగానే నిన్నటి ఉద్ధృత తగ్గింది. మౌనంతోనే మా నాన్న వంట మొదలుపెట్టాడు.

మానాన్న పలుకులు నాహృదయానికి ములుకులైనాయి. ఆయనచర్య చాలా వెగటు కలిగించింది. అతిగాప్రేమిస్తున్నకారణాన జరిగినదంతా మధుమూర్తికి చెప్పాను. అతను బాధపడి, "ఎవరితో యేమేమి యెంతెంతచెప్పితే జీర్ణించుకుంటారో అంతే చెప్పాలిగాని మితిమీరి చెప్పగూడదు. అది సంస్కరించేమార్గం గాదు." అన్నాడు. కొన్నాళ్ళు మధుమూర్తి మాయింటికిరాలేదు. మళ్ళా వకనాడు మానాన్న అతనుకలిసి వచ్చారు. ఆనాడు అతనికిగూడా టిఫిన్‌పెట్టాము. అతనికి మంచినీళ్లు ఒక మొట్టిపోయిన గ్లాసుతోయిచ్చాడు మానాన్న. ఆయన మాగౌరవవిషయం తలపెట్టలేదు. అతన్ని న్యూనత పరచాలనీ-మూరకంచే తక్కువవాడనిపించాలనీ-ఆయన చూస్తూవుండగానే ఆగ్లాసుపైన కాస్తనీళ్ళు చల్లి తీసుకున్నాడు. అతను నాతట్టుచూశాడు నేను తలవంచుకున్నాను. అతను చేతులు కడుక్కున్నపుడు నాటవలు నేనందిస్తానేమోనని అదరా బదరా లేచి ఒక పాతచింకిగుడ్డ అతనికి అందీయబోయాడు మానాన్న. అతను తనచేతిగుడ్డతో చేయి తుడుచుకుంటూ "అక్కరలేదులెండి" అనినవ్వాడు వికటంగా. నాకు మానాన్నచేసిన ఆమూఢుచేష్టలు మూడుశూలాలై హృదయంలో కుచ్చుకున్నాయి.

కుల విషయం రాకుండానే వుండాలిగాని వచ్చిందంటే మాత్రం యీ బ్రాహ్మణకులం అతి నికృష్టంగా ప్రవర్తిస్తుంది.

ఇతరులు బాధపడతారేమో అనేదృష్టి వారేనాడూ వహించరు. ఎదటివ్యక్తి వీడికంటే యెన్నివిధాలా గొప్పవాడయినాసరే-అది తనకు ప్రత్యక్షంగా కనబడుతున్నాసరే-ఆధిక్యభావాన్ని వహించి కించపరచడం తమ జన్మహక్కని భావిస్తారు. ఆ భావననే వారిని సంఘంలో ఎట్లా చూడాలో అట్లా చూడడం సంభవిస్తున్నదీనాటికి గూడా. ఇది తక్షణం వికనాడితేగాని వారిక కనీసం సమమర్యాదనుగూడా పొందలేరు. లేకపోతే కొండను డీకొన్నట్టే కాగలదు.

కష్టాలూ సుఖలూ ఒకదానివెనుక ఒకటి వస్తూవుంటాయి. ఒకే స్థితి శాశ్వతంగా వుండడం ప్రకృతిధర్మానికి విరుద్ధం. నే నెన్నెన్నో కష్టాల నిప్పటికీ అనుభవించాను.' మా నాన్న అప్పట్లో నేనే తనకు సర్వస్వం అని జీవించడం మొదలు పెట్టాడు. నా కోసం ఒక యెకరం భూమిగూడా అమ్మడం జరిగింది. దానిపైన మా సవతితల్లి కేసుగూడా పెట్టింది. స్వార్జితంవుంటే యేంచేసుకున్నా ఫరవాలేదుగాని పిత్రార్జితం అమ్మడానికి వీలులేదని శాసనం వున్నది. ఆ ఆస్తిపైన హక్కుదారులు మా తమ్ముళ్లు కూతురికి ఆ స్తిపైన హక్కులేదు. ఈ హక్కులేక పోవడంవల్లనే నేను నా జీవితంలో చాలా కష్టాలూ అవమానాలూ అనుభవించవలసి వచ్చింది. ఒకే తల్లికి పుట్టిన బిడల్లో ఆడ, మగ, అనే భేదభావం వహించడం అసలు తల్లిదండ్రులతప్పు, ఆపైనదాన్ని మన్నించడం ప్రభుత్వం తప్పు. ఈ పాక్షిక దృష్టే స్త్రీకి విద్యలేకుండా చేస్తున్నది. సరియైనవాణ్ణీ, కోరినవాణ్ణీ వివాహం చేసుకోడానికి వీలుగాకుండా చేస్తున్నది. వరకట్న పిశాచం తాండవించేటట్లు చేస్తున్నది. కులాంతర వివాహాలుజరిగి సంఘసమత్వం రాకుండా

జేస్తున్నది. స్త్రీదాయభాగంపైన్నే ఇదంతా ఆధారపడివున్నది. దేశం లోని పెద్దలు ఇపుడిపుడే కన్ను తెరుస్తున్నారు. పూర్వాచార ధురంధర రాక్షసులు బలవంతంగా ఆ కండ్లు మూయడానికి ప్రయత్నం చేస్తున్నారు. అదికసాగదు. స్త్రీకి దాయభాగంలో హక్కును ప్రభుత్వం గుర్తించి శాసనం చేయబోతున్నది.

కోర్టుకు హాజరుకమ్మని మానాన్నకు సమను వచ్చింది. వెళ్ళవలసిన అగత్యం యేర్పడింది. మానాన్న నన్ను ఒంటరిగా విడిచి పెట్టిపోవడం ఇష్టంలేదు. ఇంటి యజమాన్లు ప్రక్కవాటాలో వున్నారు. వాళ్ళు మాకెంతో మంచిగా వుండేవారు. భయపడడానికేమీకారణంలేదు. ఆయన భయమంతా మధుమూర్తి మాయింటికి వస్తాడనీ - మేమిద్దరమూ స్వేచ్ఛగావుండిపోతామేమోననీ నన్ను హాస్టలులో యెవరికన్న అతిధిగా వుండమన్నాడు. సాయంకాలం చీకటిపడకముందే భోంచేసి హాస్టలుకెళ్ళి పడుకోనేదాన్ని సుధ రూంలో.

మానాన్న వెళ్ళిన మరునాడే మధుమూర్తి మాయింటికొచ్చాడాహ్వానంపైన. అంతకుముందు నా యెదుట తనకు జరిగిన అవమానానికి కోప్పడ్డాడేమో కొన్నాళ్లుగా మాయింటికి రాలేదు. ఈ దినం వచ్చాడు. ఉదయమే వచ్చాడు. నేనప్పటికే వంటపూర్తిచేసి కూర్చున్నాను. అతను రాగానే ఎంతో అప్యాయతతో ఆహ్వానించాను. ఇద్దరమూ కూర్చున్నాం. ఏమేమో మాట్లాడుకుంటూ కూర్చున్నాం. కాలేజీవేళగూడా దాటిపోయింది. అయినా లెక్కించకుండానే మాట్లాడుకుంటూ కూర్చున్నాం. ఎట్టకేలకు అతను లేచాడు. "వెళ్ళి భోంచేసి వస్తాను." అన్నాడు. "ఏం ఒకపూట భోజనంలేకపోతే

వుండలేరా ?" అన్నాను సరసంగా "ఓ! ఒకపూటేగాదు ఎన్నిపూటలైనా వుండగలను. అదిగూడ దేవిగారి సమక్షంలోనే!"

"సరే వుండండయితే! సాయంకాలంవరకూ కదలడానికివీల్లేదు."

వెంటనేవెళ్ళి యిద్దరికే వడ్డించాను. ప్రక్కన ప్రక్కన కూర్చొని ఏమేమో కబుర్లు చెప్పుకుంటూ భోంచేశాము.

భోజనానంతరంగూడా ఒకేమాటలు మరి అన్ని విషయాలు ఎట్లావస్తాయో అనుభవజ్ఞులకే తెలియాలి. మామాటల్లో సాముద్రిక విషయమై చర్చవచ్చింది. దాన్ని గురించి చాలా పరిచయమున్నట్లు మాట్లాడుతున్నాడతను. నేను వెంటనే నా చెయ్యి అతనివైపుచాచి సాముద్రికం చెప్పుమన్నాను. ఇంత స్నేహమూ ఇంత వాంఛా వున్నా మేము ఒకర్నొకరం ఇంకా స్పృశించలేదు. అందుకాయన సంశయిస్తూ నావైపుచూస్తున్నాడు. సంశయించ నక్కర్లేదన్నట్లుగా నేను నా చేతిని అతని చేతిలో వేశాను. అతను చెయ్యి పట్టుకొన్నాడు. కొద్దిపాటి మైకంతో నా వైపు చూశాడు. ఆ స్పర్శకు, ఆ చూపుకు, నాలో విద్యుత్ప్రవాహం ప్రవహించింది. నాకు ముచ్చెమటలు పోశాయి. అతను నా చేతిని ధ్యానంతో చూడసాగాడు. నేను అంతకంటే ధ్యానంతో అతని మొగంలోకి చూస్తున్నాను. కండ్లు, మొగము అదొక తీరులోపెట్టి "మీకు వివాహమంటే యిష్టంలేదా?" అన్నాడు.

"లేదు. అయితే. అది ఒకప్పటి నిర్ణయం. ప్రస్తుతం నిర్ణయం మార్చుకున్నాను." అన్నాను.

"ఎందుకు మార్చుకున్నారు?"

"తగిన వ్యక్తి దొరికినందువల్ల"

"భావంమారితే మారవచ్చుగాని రేఖలు మారవుగా!"

"వాటిచ్చగానే మార్తాయి. భావంవుండాలిగాని రేఖలదేముంది!"

"రేఖనుసైతం మార్చగలిగిన భావాన్ని మీలో ఉద్దీపింపజేసిన ఆ ధన్యాత్ముడెవడై యుండునో!"

"అంతా ప్రబంధశైలిలో మాట్లాడుతున్నారే!"

"ప్రబంధఘట్టాలోవున్నపుడు అభాషాపదజాలమే రావాలిగదా!"

"కానీయండి కవిపుంగవులు!"

"ఇంతకూ ఆ ధన్యాత్ముడెవరో చెప్పలేదు!"

"నాకరగ్రహణం చేసినవారే ధన్యాత్ములు"

"ఎవరని అడుగుతున్నానుగా?" అంటూ అర్థం స్ఫురించిన వ్యక్తిలాగా నామొగంలోకి ఒకసారిచూచి చిరునవ్వునవ్వాడు. నాకు సిగ్గు దొంతరలు దొంతరలుగా క్రమ్మి ముడుచుకుపోయాను.

"మరి మీకు వివాహంకాదు" అన్నాడు మధుమూర్తి

నాకు నవ్వు వచ్చింది.

"పోనీ! మీకవుతుందా?" అన్నాను.

"నాకాయోగం వున్నది"

"అయితే నాకూ ఆయోగం వుండాలే!" జిజ్ఞాసతో అన్నట్లు అన్నాను.

"ఇక దీన్నిగురించి యెక్కువచెప్పలేను. శాస్త్రం యేమిచెబుతుందో అది చెప్పాను. అంతే!"

"మీకు దీనిపైన విశ్వాసముందా?"

"మీకుంధా?"

"నాకంతగా లేదు"

"నాకులేదని చెప్పానుగాని కొన్నినిజాలు కాకపోవచ్చు"

"మీశాస్త్రాన్ని అబద్ధంచేస్తాను చూసుకో!" అన్నాను.

ఆనాడట్లా జరిగిపోయింది.

మరునాడుదయం సుధ యింటికిరానీలేదు. హాస్టల్లో ఫోం చేసి కాలేజీకి పోవద్దు ఉండమన్నది. ఉండక తప్పలేదు. ఉదయం యెనిమిదిగంటలకల్లా మోహనకుమార్ వచ్చాడు. సుధ స్నానానికివెళ్ళింది. అందుచేత నేనే అతన్ని ఆహ్వానించి కూర్చో బెట్టవలసివచ్చింది. నన్ను చూడగానే "నమస్కారమండీ" అని

"నాపైన చాలాకోపం వచ్చినట్లుంది" అన్నాడు వెంటనే

"అదేం మాటండీ! మీపైన కోప్పడడానికి నాకేం హక్కున్నది" అన్నాను.

"లేదు మీరు కోప్పడ్డారు. కోపపడేహక్కు మీకుంటే నేనెంతో ఆనందించేవాణ్ని. అదృష్టవంతుల్లో నన్నొకణ్నిగా లెక్కించేవాణ్ణి.

"అనవసరంగా కవిత్వం మాట్లాడకండి" అని అయిష్టంగా అంటూవుండగానే సుధ వచ్చింది. అతన్ని చూడగానే ఎంతో తృప్తిని కనబడచికూర్చుంది. వాళ్ళ పరస్పరాలోకనలు, చలోక్తులు చూచి నేను అక్కణ్నుంచి తప్పుకున్నాను.

ఆ మరునాడే మానాన్నవచ్చాడు. మా తమ్ముణ్ణి తీసుకొని రాలేదు. మా సవతితల్లి వాణ్ణి పంపలేదు. మా నాన్న మొగం చూడగానే నాకు చాలా దిగులేసింది. వెళ్ళి నప్పటినుండీ ఫోంచేశాడాలేదా అన్న సందేహంగూడా గలిగింది. కేసును ఉపసంహరించుకొమ్మని మా పిన్నమ్మను కోరాడట! ఆమె వినలేదట! ఇతర్లచేత చెప్పించాడట! ఆమె నవేమిరా అన్నదట! మగపిల్ల

వాళ్ళ తరపున గార్డియన్‌గా ఆమె కేసుపెట్టింది. కేసు ఒకనెల వాయిదా వేశారు.

రెన్నాళ్ళకు దుఃఖం దిగమ్రింగ గలిగాడు మా నాన్న. తర్వాత యెపుడూ ఆలోచిస్తూ వుండేవాడు. భూమి అమ్మినపుడు మాచేతికి రెండువేల రూపాయలు వచ్చాయి. నేను ఒకేసారి దండిగా బట్టలుకొన్నాను. వెయ్యిరూపాయలు మానాన్న వడ్డీకిచ్చాడు. ప్రస్తుతం మాదగ్గర నాలుగువందలున్నది. అవి యుద్ధాత్ పూర్వపు రోజులు గాబట్టి ఇప్పటి మాదిరి ధరలు పెంపు సోహావుండేవి గావు. దర్జాగాతిన్న మాకు ఇంటి బాడుగతోసహా ముప్పయిఅయిదు రూపాయలకంటె యెక్కువయ్యేదిగాదు.

తొలి సంవత్సరం అయిపోవస్తున్నది. మార్చి పరీక్షలు దగ్గరకొస్తున్నవి. చదువుకాస్త తీవ్రంచేశాను. మధుమూర్తిగూడా బాగా చదువుతున్నాడు. కాని అపుడపుడూ ఇదెవరికంతటి ఏకాగ్రత లేదని అంటూవుండేవాడు. నాకతగూడా నిజంగా అట్లాగే అయింది. చదువంటే యిదివరకున్న భయము. భక్తి. ఏకాగ్రత కొంతవరకు సన్నగిల్లాయి. అయినా ఒకర్నొకరు ప్రోత్సహించుకుంటూ చదువుతున్నాం.

మధుమూర్తిలో మంచిగుణాలే యెక్కువని చెప్పాలి. నిదానమైన మనిషి. అంచుచేత నేనతన్ని ఆదర్శంగాతీసుకొని ప్రవర్తించాలనుకుంటూ వుండేవాన్ని. అతను బాగా చదువుతాడు. తెలుగు యింగ్లీషుపుస్తకాలు చాలాచాలా చదువుతాడు. చదివిన వన్నీ జీర్ణించుకుంటాడు. నన్ను చదవమంటాడు. నేనూ అవన్నీ చదువుతాను. తాను పార్లమెంటరీ డిబేట్లలో పాల్గొంటాడు.

నన్ను పాల్గొనమంటాడు. నేను పాల్గొంటాను. అతనెప్పుడూ ప్రభుత్వపక్షమే నేను ప్రతిపక్షం. ఈ విధానం నాకు నచ్చింది. మేమిరువురమూ ఒకటేగాబట్టే వివాహమాడవలెనని అనుకుంటు న్నాంగాబట్టీ పరస్పరం ప్రతిపక్షంలో వుండగూడదంటాడు మధు మూర్తి. నేను ప్రతిపక్షభావం వహించడం నవ్వులాటకయినప్పటికీ తనకు సహించదంటాడతను. ఇద్దరమూ ప్రభుత్వపక్షంలోనే వుండా లంటాడు. నేను దానికి ఒప్పుకొనేదాన్నిగాదు. ఇది కేవలం విద్యా సంబంధమైన విషయచర్చ అయినప్పుడు దీనికి జంకడమెందుకు అని అనేదాన్ని. ఎదురు వాదించడమంటే నాకు సరదా. నాలో వున్న ఈ ప్రకృతే యిప్పటి నాయీనిర్లిప్తతతోడి జీవితానికిగల కారణాల్లో ఒకటవుతుంది.

మోహన్‌కుమార్ నాతో మాట్లాడ్డానికి ఏదో ఒక నెపంతో వచ్చేవాడు. నేనుగూడా చనువుగానే మాట్లాడేదాన్ని. అతను నా క్లాసుమేటు. రోజుకు కొన్నిగంటలయినా ఒకేచోటకూర్చుంటాము. అందుచేత నిరంతరం మా పరస్పర సందర్శనం తప్పదు. అతడు అందగాడు, ఆకర్షణీయంగావుంటాడు. మరినాలో అతిణ్ణేమి ఆక ర్షించిందో తెలియదు. అతడు మొదట నన్నాకర్షించాడు. అతని కంటే తర్వాతనే మధుమూర్తి ఆకర్షింపగలిగాడు. మధుమూర్తి ఎప్పుడోగాని కనిపించడు. ఇత డనుక్షణమూ కనిపిస్తూవుంటాడు. మధుమూర్తిని ప్రేమిస్తూవున్నాగూడా ఇతనంటే హృదయంలో ఏమూలనోకొంత సద్భావమూ, కొంత ఆకర్షణభావమూ కలుగు తూనేవున్నాయి

మోహన్‌కుమార్ సుధను ప్రేమిస్తున్నాడనీ-సుధ ఇతన్ని చేసుకుంటుందనిన్నీ యూనివర్సిటీఅంతా ప్రాకిపోయింది. ఇటువంటి దేమాత్రమున్నా బ్రహ్మాండాకారాన్నిధరించి దేశమంతా సంచ రిస్తుంది. కొందరు ఓగువాళ్ళగురించి అయితే కొంతచెడ్డగా కొంత నవ్వులాటగా-చెప్పుకుంటారు. మంచివాళ్ళను గురించిఅయితే కొంత మంచిగానే సానుభూతిగానే-చెప్పుకుంటారు.

ఆమోహన్‌కుమార్ దప్పిచూపులను నేను కనిపెడుతూనే వున్నాను. సుధను వివాహం చేసుకోబోయేంత తీవ్రంగా ప్రేమిస్తూ ఇటువంటి దృష్టివహించడం నాకు అసహ్యంగావుండేది. ఒకనాడు సాహసించి ఏకాంతంలో కనబడిననాకు ఒక జాబందిచ్చాడు.దాన్ని అక్కడే ముక్కలుముక్కలుగా చించివేయలేదు, చదువుకున్నాను. దాంట్లో "ఆకర్షణ వున్నదిగాబట్టే నేను మీ ఆకర్షణలో పడిపో యాను. మీ గుణాలు నచ్చినవిగాబట్టే మిమ్ములకోరుతున్నాను. మిమ్ములనావైపు తిప్పుకోడంకోసమే అబద్ధాలుగూడా ఆడాను. ఆ అబద్ధాలవల్లనే నా విషయంలో మీరు విముఖులైనారని నాకు తెలుసు. ఆ వొక్కచేష్టే మీకోసం యేమిచేయడానికైనా సిద్ధమని రుజువు చేయగలదు. మీ అనాదరణవల్లనే నేను మీ ఛాయగా భావించి మీస్నేహితురాలిని ప్రేమిస్తున్నాను. సత్యం చెప్పాలంటే మీపై నాకుగల మమత ఆమెయెడలేదు. నేను సాటి బ్రాహ్మణ్ణి. అందులో నియోగిని. మధుమూర్తి అబ్రాహ్మణుడు. ఈనాడు విద్యార్థిదశలో ఆదర్శవాతావరణంలో సాధ్యమని భావించినా ప్రపం చంలో అడుగుపెట్టిన తర్వాత నీకే అర్థమవుతుంది అది అసాధ్య మని అప్పుడు నీవే విరమించుకుంటావు. అందని దానికి ప్రాకు

లాడుతూ సహకరించలేనిదాన్ని కాలదన్నుకోగూడదు.'' ఇట్లాంటివింకా వ్రాశాడు. తాను ధనవంతుడైనట్టుగూడా వ్రాశాడు. జాబు ఆమూలాగ్రంగా చదివాను. మరొకసారి చదివాను. కొంతవరకూ సానుభూతిగలిగిందిగాని తారతమ్యాలగురించి ఆలోచిస్తే మధుమూర్తి ఇతనికంటే యెన్నోరెట్లు ఘనమైనవాడు. ఇక కులవిషయంఅందామా దానికేనాడో స్వస్తిచెప్పాను. భాగ్యవిషయం అందామా అది కేవలం అశాశ్వతమైనది.

ఇట్లాభావించా నానాడు. రెండుదినాలు జవాబీయలేదు. ఆ రెన్నాళ్లూ నావెంటపడడం మొదలుపెట్టాడు. జంకుదీరిమాట్లాడడం విన్నవించుకోడం, బెదిరించడం అన్నీ చేస్తున్నాడు. నేనతనికి అర్థమయ్యేరీతిలో నన్ను తనసోదరికంటే భిన్నంగా భావించవద్దనీ ఇక ఆవిషయం ప్రస్తావిస్తే మర్యాదవుండదనీ తనను సోదరునిగా ప్రేమించడం నాకభిలషణీయమేననీ, చెప్పాను. అంతే! తర్వాత కొన్నాళ్ళతను మాట్లాడలేదు.

అపరాధపరిశోధన అంటే మధుమూర్తికిష్టం. అవినీతిగా ప్రవర్తించేవాళ్ళంటే అతనికి అసహ్యం. వాళ్ళనువెలుగులోకితెచ్చి అవమానపఱచేవరకూ తాను ఓర్చుకోలేడు. ఆగుణాన్నిగురించి నాతోచెప్పినపుడు అజ్ఞాతభయంతో సంచలించిపోయాను.

మాహాస్టలు ఆర్ట్సు అండ్ కామర్సు కాలేజీకి ఎదురుగా వుంది. ఆస్థానే ఇపుడు ఫ్యాకల్టీ క్లబ్బున్నది. దానిచుట్టూరా జీడిమామిడి తోటలున్నాయి. కాస్త పడమరగా, వాయవ్యంగాపోతే అది జీడిమామిడిఅరణ్యమే అనాలి. చీకటి పడినతర్వాత మోహన్ కుమార్ హాస్టలుముందునుంచివెళ్ళేవాడట! అపుడు అభిసారికయైన

మాసుధ హాస్టలు వంటింటివెనుకవున్న తలుపుగుండా తప్పించు కొని చీకట్లోకి వెళ్ళిపోతుండట! వారేదో ఒక జీడిమామిడిపొదలో కలుసుకొనేవారట! ఒకనాడు సరిగ్గా ఆసమయానికే మధుమూర్తి మిత్రుడు, మరొకస్నేహితుడు, బయలుదేరి సరిగ్గా అదేసమయా నికి అదేచోటికి పోయారట! వీళ్ళుపోయేటప్పటికి మోహనకుమార్ పారిపోతున్నాడట! లైట్లువేసేటప్పటికి ఆవెలుగులో చెదిరినబెత్తి పోతులాగా తిరిగిచూస్తూ తిరిగిచూస్తూ పారిపోతున్నాడట! సుధ మాత్రం వణికిపోతూ తలవంచుకొని నిల్చిందట!

"ఇది తగినపనేనా" అని మధుమూర్తి గద్దించాడు సుధ నుద్దే శించి.

"ఏది ?"

"ఏదా ? ఆమోహన్‌తో చీకట్లో ఏకాంతంగా వుండడం"

"మోహనేడీ ?"

"ఆపారిపోతున్నవాడు"

"అది అబద్ధం. వాడెవడో దొంగైవుంటాడు. దొంగిలించడా నికివచ్చి వుంటాడు."

"అవును ! మాసధనాన్ని !" అన్నాడు మిత్రుడు.

"నీవంటిపైన ఆభరణాలేమీలేవుగా!" అన్నాడు మధుమూర్తి.

"దొంగకు చూచినంతవరకూ తెలియదుగా !"

"మరి నీవెందుకిక్కడికి వచ్చినట్లు ?"

"అది మీరడగ్గాదదు"

"అవును సత్యాన్నిగురించి అడిగ్గాడదు నీబోటిస్త్రీని"

"కాల్యాప్రత్యాలకని వచ్చానని మీతో ఎట్లా చెప్పటం? మీరది గ్రహించాలి"

"నోర్ముయ్! ఇంతసేపు మాట్లాడావు. జంకకుండా అన్నీ అబద్ధాలాడుతున్నావ్?"

"స్త్రీని ఒంటరిగా చీకట్లోనిలబెట్టి ఇట్లాఅనడం అన్యాయం"

"నీవుచేస్తున్నపని న్యాయంగాబోలు!"

"నీవుమాత్రం తక్కువచేస్తున్నావా? నీకత నాకుతెలీదనుకున్నావా? నీకంటేమించినతప్పు మోహన్‌కుమార్ చెయ్యడంలేదు. హసంతికంటే మించినతప్పు నేనూచేయటంలేదు. మహానీతిపరుడవుగా వచ్చావు. పైగా బెదిరిస్తున్నావు. ఇపుడు గట్టిగా కేకలేస్తాను మీరు ముగ్గురూ నన్నుబలవంతం చేస్తున్నారని అరుస్తాను."

మధుమూర్తి పూర్తిగా చల్లారిపోయి,

"అదికాదమ్మా! మీరుప్రేమించుకోండి. పెండ్లాడండి. అందుకు మేమంతా సంతోషిస్తాం. ఈవిధంగాచేయగూడదు ఇట్లా చేస్తే మిగిలేది వ్యభిచారదోషమేగాని వివాహంవరకూ పోదని మాకుతెలుసు వాణ్ణవకుండా ప్రేమించి, నమ్మి, కడపటికిఇంత దారుణమైన పనికిగూడా దిగావు. అందుచేత నీమేలుగోరిన మేము ద్రోహం జరక్కుండా చూడాలని ఈసాహసానికిపూనుకున్నాము అన్యథా భావించవద్దు" అని వచ్చేశారట! ఈకథఅంతా మధుమూర్తి చెబుతూవుంటే వింటూ ఆఅపరాధపరిశోధకుణ్ణిచూచి భయపడిపోయాను మరలా.

మార్చినెలలో వాయిదావుందని మానాన్న వెళ్ళిపోయాడు. నేను హాస్టల్లోవుండిపోయాను. నేనుచేరిన రెండవనాడే సుధకు

వాంతులు పట్టుతున్నాయి. మేము అజీర్తి అనుకొన్నాం. కొన్ని మందులిస్తే అవినిలువలేదు. మళ్ళా రెండుదినాలు గడిచినాక సుధ ఏకాంతంలో నాచేతులుపట్టుకొని కన్నీరుపెట్టుకొని "నన్ను కడ తేర్చు హసంతీ బుద్ధి గడ్డితిని తప్పుచేశాను'' అన్నది. నేను మా హాస్టలు డాక్టరుదగ్గిరికి తీసుకెళ్ళాను. ఆమెపరీక్షచేసి, చిరునవ్వులో "రెండుమాసాలు నిండినవి" అన్నది. సుధ ఆమెకాళ్ళుపట్టుకొని "డాక్టరుగారూ నన్నురక్షించండి నాకీవాంతులు నిలిచిపోయేటట్లు చేయండి. మీబిడ్డమాదిరిగా మీకడుపులోపెట్టుకోండి'' అనియేడుస్తూ ప్రార్థించింది. ఆమె గ్లూకోజ్ ఇంజక్షన్ యిచ్చింది. వాంతులాగినవి. కాని లోపలి భ్రూణాన్ని ఏమిచెయ్యటం ? సుధ అన్నం తినడమే చాలించింది. అసలు అన్నం సహించడమే కష్టం. పైగా దుఃఖం. డాక్టరే మాగర్భస్రావానికి ఔషుమందివ్వనంటే యివ్వనంది. అటువంటిపని చేయగూడదంది. అసలు మనిషి ఆరోగ్యానికే దెబ్బకొడుతుందన్నది. కాళ్ళూ చేతులూ పడిపోవచ్చునన్నది. మెదడుగూడా దెబ్బతిన వచ్చునన్నది.

మధుమూర్తిని పిలిపించాము. అతనితో నేను జరిగిన కతంతాచెప్పాను. అతనుగూడా అంతా ముందే తెలుసునన్నాడు. ఇక్కడజరిగే విషయాలు మీకంటేముందే మాహాస్టల్లోవాళ్ళు వినగలుగుతారని అన్నాడు. హాస్టలంతా గగ్గోలుగా వుందనిగూడా అన్నాడు. సుధ అదివిని సంచలించిపోయింది. మధుమూర్తినిబ్రతిమాలింది. మోహన్‌ను పట్టుకొనివచ్చి వివాహానికిఒప్పించి రిజిష్టరువివాహం వెంటనే చేయించమన్నది. మధుమూర్తి సానుభూతితో ఒప్పుకొని మిత్రుడితోకలిసివెళ్ళి మోహన్‌కుమార్‌తో మాట్లాడాడు. మోహన్ వాళ్ళసలహాల నేమాత్రమూ ఒప్పుకోలేదు.

క్లాసయిపోయింతరువాత నేను మోహన్‌ను ప్రక్కకుపిలిచి వాదించాను. అతను తప్పించుకోడానికే ప్రయత్నించేస్తున్నాడు. ఆగర్భానికి నేనొక ణ్ణేకారకుడనని నీవెట్లారుజువుచేస్తావనిఅన్నాడు. తాను తప్పించుకోడానికై సుధకు మరింతవ్యభిచారాన్ని అంటగట్టడంచూచి నోటికొచ్చినట్లు తిట్టాను. నమ్మించి, యింతవఋకూ తెచ్చి కారణభూతుడైనవాడు కన్నంలో తేలుకుట్టినదొంగలాగా పెండ్లిచేసుకోవాలిగాని పైగా ఇంతఅన్యాయంగా మాట్లాడినందుకు, సాటి స్త్రీని ఇంతక్రూరంగా గంగలోకిదింపినందుకు కోపం పట్టలేకపోయాను. కాలిచెప్పుతో కొడదామన్నంతకోపం వచ్చింది. "ఛీ! పో! మూర్ఖుడా" అని వెళ్ళిపోబోతున్నాను. "నీవు ఒప్పుకొనివుంటే దాన్నికన్నెత్తికూడా చూచివుండను. దానిలో నీచాయచూచికొని అనుభవించాను."అంటున్నాడునిలబడి. నాకు అరికాలుమంట నెత్తికెక్కింది. నన్నుగూడా వీడిట్లా చేసివుండేవాడేగదా అన్న భావం మెరిసింది. తటాలున కాలిచెప్పులాగాను. దాన్నిచూపించి "నోర్ముయ్ కుక్కా! షండ్లురాలగొడతాను" అన్నాను. అపుడు నాకెంతధైర్యంవచ్చిందో నాకీనాడు భయంవేస్తున్నది అది అనుకుంటే.

౨౫

ప్రిలిమినరీ పరీక్షలయిపోగానే ఎవరివూళ్ళకు వాళ్ళువెళ్ళిపోవడంజరిగింది. ఆవేసవిలో మాకేసుపై తీర్పుచెప్పడంగూడా జరిగింది. మానాన్న ఇప్పటికే భూమిచాలా అమ్మివేశాడనీ-కొన్ని దుర్గుణాలవల్ల ఇప్పటికే ఆస్తినంతా తగులబెట్టేశినాడనీ-భూమి ఇంకా అతనిక్రిందనేవుంటే పిల్లవాళ్ళకు సెంటుగూడాదక్కదనీ-భూమిని ఇకఅమ్మడానికి హక్కుఏమాత్రమూలేదనీ-వచ్చేపంటలో

మాత్రం సగంమే మిద్దరమూ అనుభవించవచ్చుననీ-పన్ను మాత్రం మానాన్నే చెల్లించవలెననీ-ఆమె తరఫునవాదింపబడింది. కోర్టుగూడా అట్లాగే తీర్పుచెప్పింది. ఇదివర కమ్మిన ఎకరాభూమిగానీ లేక ధనంగానీ మైనర్లతరఫునగల సంరక్షణకర్త స్వాధీనంచేయాలని గూడాతీర్మానమైంది. పిల్లవాళ్ళకు సంరక్షణకర్తగా మాసవతితల్లి అని నిర్ణయింపబడింది. వాడుకున్న శబ్బును ఎక్కణ్ణుంచితీసుకరావడం అన్నసమస్య మమ్మల పీడింపసాగింది. మొత్తం అంతా ఇక్కడ కక్కవలెనని మాపినతల్లి పీడింపసాగింది. కడపటికి మాచేతగల మూడువందరూపాయలు, మాకురావలసిన వెయ్యిరూపాయలు బాండు ఆమెస్వాధీనంచేసిననేగాని మమ్మల వదిలిపెట్టలేదు.

కట్టేసికొట్టినా మాచేతుల్లో ఇపుడు దమ్మిడీలేదు. తినడానికి కొంత ధాన్యంవుంది ఏమయినాకావలిస్తే అవడ్లే అమ్మి ఉప్పు. చింత పండు. మిరపకాయ ఇట్లాంటివి కొనేవారం.

నాజాతకమే దురదృష్టజాతకం. ఒక సంవత్సరందాటీదాటక మునుపే నా చదువుకు మళ్ళావిఘ్నం వచ్చిపడింది. నాకేమీ దిక్కు తోచలేదు. మానాన్న ఆలోచిస్తూ కూర్చున్నాడు. నాచదువువిష యంలో నాకంటే పట్టుదలగా ఆలోచిస్తున్నాడుమానాన్న. పట్టువల వున్నంతమాత్రాన యేమవుతుంది ?

జూన్ నెలదాటవస్తూవుంది. జులై ఒకటవతేదిన కాలేజీలు తెరుస్తారు. నాకు దిక్కేతోచలేదు. మానాన్నగూడా మార్గాంతరం చూడలేకపోతున్నాడు. కోర్టుతీర్పును పురస్కరించుకొని మానాన్న కిపుడు అప్పుగూడా యెవరూయివ్వరు. ఈయిక్కట్లన్నీ మధుమూర్తికి వ్రాస్తూ ఇకనేను ఛదువు చాలించవలసి వస్తుందని వ్రాశాను.

ఆమరునాడే శ్యామూరావు ఇంటికొచ్చాడు. ఒక్క క్షణం కూర్చొని "నాకన్నీ తెలుసు హసంతీ! నేను ఇంటికి పెద్దనుకాను. అయినా కొంతసాయంమాత్రం చేయగలను. చేయాలనేవుంది. నీవుమాత్రం అన్యధాభావించకుండా నాసహాయాన్ని స్వీకరించాలి. నేను నీకు సంవత్సరానికయ్యేజీతం పంపుతాను. ఆవిషయంలో మీ నాన్నను ఒప్పించే నీదగ్గరికొచ్చాను." అని నాజవాబుకోసం నిరీక్షించకుండానే బిరబిరా వెళ్ళిపోయాడు. నేను మానవుల్లోని ఉన్నత ప్రకృతిని గురించి తలచుకొని ఆనందబాష్పాలు రాలుస్తూ కూర్చున్నాను.

మధుమూర్తినుండి జాబువచ్చింది. దానినిండుకూ ప్రోత్సాహ సంబంధిక పదజాలమే! మిగిలినదంతా వేదాంతము. సరిగ్గా తాను వస్తున్నబండి పైంచెప్పి, ఆబండిలోనే యెక్కమన్నాడు. ఆనాడే, అట్లాగే యెక్కాము నేనూ మానాన్నా. మావెంట ఒక అరబస్తా బియ్యంమాత్రం తీసుకెళ్ళాము.

జీతంకట్టేశాక మాదగ్గర డబ్బేమీ మిగల్లేదు మధుమూర్తి యిరవై రూపాయలు నాచేతికిచ్చి "ఇంకేదైనా అవసరమొచ్చినప్పుడల్లా అడుగుతూవుండుసుమా, అందుకేమీజంకగూడదు" అన్నాడు. ఆ డబ్బు చేతికితీసుకొని అతని మొగంలోకి చూశాను. తన స్త్రీచేతికి తన సంపాదన అందిస్తున్నపురుషభావం అతని మొగంలో ప్రతిబింబించింది. నీకష్టసుఖాలునావికావా అన్న భావం ఆచూపుల్లో కనిపించింది. అతను వహించినదృష్టే నేనుగూడా వహించాను. ఆడబ్బును కండ్లకద్దుకొని వెళ్ళిపోయాను. యింటికివెళ్ళి ఆడబ్బు మానాన్నచేతి కందిచేటప్పుడు మానాన్నచేతులు అదిరాయి. గట్టిగా నిట్టూరుస్తూ ప్రక్కకుతొలగిపోయాడు.

మాది బాగా బ్రదికిన కుటుంబం. మాకొక అగ్రహారమే వుండేదట! అది బ్రాహ్మణ సమారాధనలకూ తద్దినాలకూ అంతా కరిగిపోయింది. మానాన్న కమామీసుకొచ్చేటప్పటికిగూడా నలభై యెకరాల మాగాణివుండేది. మానాన్న దర్జాగా తిరుగుతూ అంతా వ్యయంచేశాడు. పొరుగూళ్ళో ఆయనకొక ఉంపుడుకత్తెవుండేది. చాలాడబ్బు అటుదాటించేవాడు. ఈమిగిలిన ఆరెకరాలయినా మా సవతితల్లి చేతిలో పడడం మేలయింది.వంశాంకురాలైన పిల్లవాళ్ళ యినా అనుభవిస్తారు.

అట్లా బ్రదికినమానాన్న-డబ్బును మంచినీళ్ళప్రాయంగా కర్చుపెట్టిన మానాన్న-ఒకరికి యిచ్చినవాడేగాని చేయిచాపి యెర గని మానాన్న ఈనాడు అప్పుగానీ-చేబదులుగానీ-కానట్టి యిరవై రూపాయలు మధుమూర్తినుండి-తనకూతుర్ని చేపట్టి తనవంశానికీ తన కులానికీ అపకారం చేయబోతున్న మధుమూర్తినుండి-తీసు కోడం చాలా అవమానమన్నట్లుగా భావించాడు. కాని చేయిపట్టక తప్పిందిగాదు. చేతిలో చిల్లిగవ్వయినాలేదు. పచ్చడీమెతుకులు తిందామన్నా పచ్చడికిగూడా డబ్బులులేవు.

తర్వాతతర్వాత మానాన్న అవసరం వచ్చినపుడంతా మధు మూర్తినుండి డబ్బులడిగితెచ్చేవాడు. ఇప్పుడాఅభిమానంలేదు, ఆ అభిమానం తొలినాడే చచ్చింది. జరుగుబాటులేనపుడు అభిమానం మాత్రం యెంతకాలముంటుంది? ఈ విధంగా తెచ్చినడబ్బును మానాన్న కొంతదర్జాగానే కర్చుపెట్టేవాడు. అది నాకూ బాధగానే ఉండేది. మధుమూర్తికింకా బాధాకరంగా వుండేవి. ఇట్లాతింటూ గూడా మానాన్న మధుమూర్తిమెడ కృతఘ్నతే వహించేవాడు.

మధుమూర్తంటే నా హృదయసర్వస్వమూ అనుకొంటున్న రోజులలో మానాన్న భావాలనూ చేష్టలనూ విమర్శించేదాన్ని. అతను వహించే బాధ్యతను మానాన్నగూడా వహించడని అతన్ని పొగిడే దాన్ని. అతను మాత్రం ఈ బాధ్యత వహించవలసిన బాధ్యత తనకున్నట్లుగా చెబుతూవుండేవాడు. అది కేవలం తనధర్మమైవుండగా పొగడక అనవసరం అనేవాడు. మానాన్నను విమర్శించినపుడుమాత్రం అజ్ఞానులైన పూర్వాచారధురంధరులను విమర్శించడం అవివేకం అనేవాడు. విమర్శించవలసిందెవర్నంటే నవ్యవాతావరణంలో పెరిగి బయట అంతా ఒకటే అంటూ, నానాగడ్డికఱచి, ఇంటికిపోగానే పూర్వాచారధురంధరతను దాల్చుతారే-ఆమూర్ఖుల విమర్శించాలనేవాడు. అంతేగాని అజ్ఞానుల విమర్శించనవసరం లేదనేవాడు. ఇటువంటివాళ్లు చక్కబడాలంటే ఒకటేమార్గం-మనం సర్వధా సమత్వాన్ని ఆచరిస్తూవుండాలి. చూస్తూచూస్తూ ఒకనాడు వాళ్ళుగూడా అందులోకి దిగుతారు, దిగినాక వెనక్కిపోవడం మంటూవుండదు.

ఒకనాడుమాయింట్లో మాట్లాడుతూన్న సమయంలో ఒక యాయవారపు బ్రాహ్మడొచ్చాడు. లేదుపొమ్మంటే యింకా వెళ్ళకుండా నిలబడ్డాడు. "వెళ్ళవయ్యాపొమ్మంటూంటే నీబోటివాళ్ళకోస మిక్కడ అమర్చిపెట్టి కూర్చోలేదెవరూ వెళ్ళు" అని కసిరాడు మధుమూర్తి! వాడు వెళ్ళగానే "వాణ్ణి చూశావా, మొక్కలాగా వున్నాడు! ఇదొకజాతి! గౌరవనీయులైన బిచ్చగాళ్ళు! జరక్కపోతే బిచ్చమెత్తుకోవచ్చునని యీబ్రాహ్మలు ఇట్లా తయారౌతారు. ఇది ఎంత అధమాధమవృత్తో, నీచాతినీచమైనవృత్తో అర్థంచేసు

కోరు!'' అని అన్నాడు. మధుమూర్తికి సంస్కరణదృష్టితప్ప మరొకటివుండదు. నేనాస్థాయిలోలేను. నాకు మాత్రం ఆమాటలు వినగానే మనసు చివుక్కుమన్నది. మానాన్న రుచించనివాడివలె పెడముఖంపెట్టాడు. ఆ బ్రాహ్మణ్ణి మధుమూర్తి ''వాడు'' అన్నందుకు నా మనసుగూడా బాధపడింది. అంతకుముందేయింకొక బిచ్చగాడు వచ్చిపోయాడు. వాణ్ణి గురించి "వాడు" అని ఇద్దరమూ అన్నాము. అసలు మానాన్న "పోరా" అనే కసిరాడు. మరివీణ్ణి ఆవిధంగా మధుమూర్తి అనేటప్పటికి బ్రాహ్మణ్ణిగూడా ఇంత నీచంగా ''వాడు'' అని అంటున్నాడుగదా అని మనసులో బాధ పడ్డాను. సమత్వంకోసం వాదించేనేను గౌరవహీనవృత్తిలోవున్న ఆయిద్దరు బిచ్చగాళ్ళమధ్య తారతమ్యాన్ని తెలిపానానాడు. అట్లా అన వద్దని అతనితో అన్నానుగూడ.

ఒకనాడు ఒకకథవ్రాశాడతను. దాన్ని నేను చదివాను. అది సంఘసంస్కరణకు సంబంధించినకథ. ఆ కథలో ఒకబ్రాహ్మణుడు తనకంటే యెంతో ఉన్నతుడైన ఒక అబ్రాహ్మణుని కులగర్వంతో నీచంగా చూస్తాడు. అటువంటివాళ్ళకు బుద్ధిచెప్పడానికీ సమత్వాన్ని బోధించడానికీ ఈ కథకుడు అతనికి శిక్షవిధిస్తాడు. అదిగూడా నా మనసుకు కొంత బాధగలిగించింది. సంఘసంస్కరణాభిలాషియైన కవి ఆవిధంగా ఒక తెగను తెగనాడరాదనీ హింసనుప్రోత్సహించరాదనీ వాదించాను. నేను చిత్తశుద్ధితో వాదించానని అనను. నేను బాధపడి పాక్షికబుద్ధితో-అతను బ్రాహ్మణుల విమర్శిస్తున్నాడనే అట్లావాదించానుగాని నేను అహింసామార్గంలో వున్నాననిగాదు. అసలు అహింసావాదం నాకర్థమయిందనిగూడా అనుకోను. అది

హింస అనుకోగూడదంటాడు అతను. ఈవిధంగాద్రాసి అసమత్వ వాదులకు ఒక హెచ్చరికను ఇస్తున్నామేగాని నిజంగా మనం ఎవ ర్నీహింసించడంలేదంటాడు. "మనసును బాధపెడితే అది హింస గాగూడదా అంటావేమో! ఆ విధంగా బాధపడేవారు హింసా వాదులంటాను. అసమత్వదృష్టివహించడమే హింసాప్రకృతిఅం టాను. హింసాప్రకృతిగలమూర్ఖులు ఎంతకూ అర్థంచేసుకోకపోతే సామధానభేదదండోపాయలు అవసరమంటాను. అది శాస్త్రసమ్మ తం! రాజ్యాంగసమ్మతంగూడాను" అన్నాడు. అతను అనాడన్నది అక్షరాలా నిజం! అతడు నిష్పాక్షికదృష్టితో సంస్కరణాభిలా షతో-అట్లాఅన్నాడు. నేను పాక్షికదృష్టివహించి అట్లా వాదిం చాను. జుట్టును సంస్కరించడమంటే జుట్టులోని చిక్కుతీసి నున్నగా దువ్వి శిఖబంధించడమే! అపుడు కొన్నివెంట్రుకలు దువ్వెనకు తగుల్కొని ఊడిరావచ్చు. అపుడు శిరస్సుకు కొద్దిగా బాధగూడా జనింపవచ్చు. అయితే శిరోజ సంస్కరణ అవసరం, అభిలషణీయం. అట్లాగే సంఘసంస్కరణకూడ. సంఘంలో సమ త్వానికి ఎవరు భంగకారకులో వారిని విమర్శించడం-వాళ్ళతప్పులు బయటపెట్టడం-ఇట్లాంటివి చేయకపోతే సంస్కరణ ఎట్లాజరుగు తుంది! ఎవర్ని ఉద్దేశించి ఆఘాతలు, విమర్శలు, జరుగుతాయో వాళ్ళు ఉడుకోక్కడం సహజం. గుమ్మడికాయదొంగల్లాగా భుజాలు తడుముకోడం సహజం. నేనుగూడా నా బ్రాహ్మణత్వాన్ని స్ఫురణకుతెచ్చుకొని అతను అసూయతో అట్లా అంటున్నాడని భావించానానాడు.

నిజంగా మన సంఘసమత్వానికి భంగకరంగావున్నది మన కులవ్యవస్థ. బాధితులే కులవ్యవస్థను నిర్మూలించాలని అంటాడు.

కాని కులవ్యవస్థవల్ల బాధలేకపోగా గౌరవం పొందుతున్నప్పుడు బ్రాహ్మణులు చాలమంది ఈవ్యవస్థను రద్దుచేయడానికి సుముఖులు కారు. ఈవిషవృక్షాన్ని పెళ్ళగింపగూడదనేవారి హృదయాలు విష పూరితాలుకాక వేరెట్లా అవుతాయి? ఈవిషవృక్షఫలాలు సేవించి సేవించి మనసంఘం యావత్తు విషమయమైపోయింది. నిజంగా దీన్ని కూకటివేళ్ళతోగూడా కుళ్ళగించివేయవలసిందే! దానికోసం పాటుపడేవారికి ప్రతివాళ్ళూ సాయంచేయవలసిందేగాని నిరుత్సాహ పరచగూడదు. నిరుత్సాహంగాదుగదా నిందించడంగూడా జరిగేదా రోజుల్లో.

సంఘసంస్కరణకు ఎందరో పూనుకున్నారు. వాళ్ళందరి వ్రాతలూ చదివాం. ఎక్కడయినా మీటింగుల్లో అవసరం వచ్చిన పుడు వాళ్ళమాటలు ఉదహరిస్తూవుంటాం. వాళ్ళు మనకాదర్శంఅని ఉద్బోధిస్తాం. బ్రాహ్మణసంఘాన్నివాళ్ళు విమర్శించినందుకు మెచ్చు కుంటాం. మరి కళ్ళను విమర్శించడానికి ఆఒక్క వీరేశలింగానికేనా లైసెన్సువున్నది? ఆఒక్కరామమోహన్‌రాయ్‌కేనా లైసెన్స్ వున్నది!: ఇతర్లకులేదా? వాళ్ళన్నటువంటివే వీళ్ళుగూడా బ్రాహ్మ ణులనంటే వీళ్ళనుతప్పుపట్టడమెందుకు? అబ్రాహ్మణుడుగాబట్టి ఈర్ష్యతోఅంటున్నాడన్న పాక్షికదృష్టి నాలో ఆనాడు చొరబడింది. "నేను బ్రాహ్మణబాలికను. నాకులాన్ని అతనువిమర్శిస్తున్నాడు దూషిస్తున్నాడు" అన్నదృష్టి నాలో ఆనాడు చొరబడింది. ఇటు వంటిదృష్టి కలగకుండా వుండడంకోసమే ఆసంస్కరణ. అన్న సత్యాన్ని ఆనాడు గమనించలేదు. ఈభేదభావం మనసులో కలిగి నాక ప్రేమఅన్నది హృదయానికి అంధకారంలోవుండవలసిందే! దానికితోడు అతనంటే నాకు భయంగూడావున్నది.

నేనంటే మధుమూర్తి ప్రాణంయిస్తాడు. నాకు ఏమాత్రం కష్టంగలిగినా ఓర్చుకోలేడు. నాకు వాత్తేయలో యేమున్నది? ఆ యింటి అద్దెగూడా అతనేయిస్తున్నాడు. పైకర్చులన్నిటికీ అతనే యిస్తున్నాడు. అతనికెట్లావస్తున్నదో నాకుతెలియదు. తనకుప్రాణాధికమైనమిత్రులు కొందరున్నారనీ, వాళ్ళు కొంతమంది కొంత పంపిస్తూవుంటారనీ, అపుడపుడు కొంతఅప్పు చేస్తూవుంటాననీ చెప్పాడు. తాను హాస్టల్లోవుంటే డబ్బు ఎక్కువవుతుందని వేరే కొంతమందిమిత్రులతోకలిసి వంటచేయించుకోడం మొదలుపెట్టాడు. ప్రేమకోసం పాటుపడనిజీవియెక్కడుంటాడు.

అర్ధసంవత్సరపరీక్షలయ్యాక జనవరిలో జీతాలుకట్టాలి. నాకు జీతండబ్బురాలేదు. శ్యామరావు పంపలేదు. సరిగ్గా జీతంకట్టే ఆఖరురోజు శ్యామరావునుండి జాబొచ్చింది దాంట్లో తాను జీతం కట్టలేననీ ఇక తనపైన ఆధారపడవద్దనీ వుంది. ఆజాబు చదవగానే హతబుద్ధినై కూలబడిపోయాను. తిండిదగ్గరనుంచి-ఇతర అవసరాలదగ్గరనుంచి-అన్నిటికీ ఆదుకుంటున్నాడు మధుమూర్తి. అందుకోసం యెన్నెన్నోకష్టాలుగూడా పడుతున్నాడు. ఇటీవల కొంచెం చిక్కిపోయినట్లుగూడా కనుపిస్తున్నాడు. మొన్ననే తన పరీక్షాఫీజు కట్టేశాడు. ఈభారంగూడా అతనిపైన వెయ్యడమాఅని ఎంతో దుఃఖంకలిగింది. ఎంతోబాధపడ్డాను. ఆ బాధలో ఆ మధుమూర్తి ఎంతమధురంగా కనిపించాడో! అటువంటి మమూర్తికి ఆఖరులో ద్రోహంచేశాను. ఆద్రోహం అతనికిగాదు, నాకు నేనే చేసుకున్నాను.

జరిమానాతోగూడా జీతంకట్టడానికి అదిఆఖరురోజు! జీతం కట్టకపోతే పేరుతీసేస్తారు. అవమానం. చదువుకుభంగం. ఆనాడు ఏమీచేయలేకపోయాను. మధుమూర్తిగూడా మార్గాంతరం చెప్ప లేదు. నిస్సహాయురాలనై నాభవితవ్యాన్నిగూర్చిదుఃఖిస్తూకూర్చున్నా నింట్లో. కాలేజీకిపోలేదు. సాయంకాలం నాలుగుగంటలయింది. మధుమూర్తి మాయింట్లోప్రవేశించాడు. మానాన్న అంతకుముందే బయటికివెళ్ళాడు. మధుమూర్తి దగ్గరగావచ్చి కూర్చున్నాడు. అతన్నిచూడగానే నారెండుకండ్లనుండీ అశ్రువులు జలజలారాలాయి నన్నుతీసికొని తనతొడపై నాతలనుంచి "బాధపడకు హసంతీ! దేవుడెప్పుడూ ఆర్తులరక్షించడానికి కంకణబద్ధుడైవుంటాడు. ఆ దేవుడేలేకపోతే అనాధలెప్పటికీ అనాధలుగానేవుంటారుసుమా!" అన్నాడు. నాకాదుఃఖంలో కోపంగూడావచ్చింది. "ఉన్నాడుదేవుడు! రెండేండ్లనుండీ చూస్తున్నాను." అని ఈసడింపుగా అని చటుక్కున లేచికూర్చున్నాను. అతడు చిరునవ్వుతో తనజేబులోనుంచి జీతంకట్టినరశీదు బయటకులాగి "ఇదేనీకు దేవుడి ప్రసాదం" అన్నాడు. ఆనందతుందిలమైన నాహృదయం ఇక భరించలేకపో యింది, అట్లాగే అతనిపైనవాలిపోయాను. అతని అధోగర్భంపై నామొగం అదిమి నాఆనందాయాసాన్ని అపనయింపజేసుకుంటు న్నాను. ప్రథమచికిత్సగా అతను నావీపునిమురుతున్నాడు. చెంపలు గూడా నిమురుతున్నాడు. అదేసమయంలో ధఢాలుమని తలుపు తోసుకొని మానాన్న ప్రవేశించాడు.

కెవ్వుమనికేకేసి బారెడు దూరం ఎగిరిపోయాను మా నాన్నకండ్లు మండిపోతున్నయి. పండ్లు కొరుకుతూ, రొప్పుతూ

"దుర్మార్గుడా తారతమ్యంగూడా ఆలోచించకుండా దారుణానికి పూనుకున్నావా? నీచజాతివాడికి ఏది ఉచ్చమో ఏది నీచమో ఎట్లా తెలుస్తుంది!" అని అన్నాడు. అంటూ నన్ను తన్నడానికివస్తు న్నాడు. ఆయన ఆకారాన్నిచూచి నేను సంచలించిపోయాను. గట్టిగా ఏడవబోయాను. గట్టిగా అరిస్తే ఇతర్లెవరైనా విని వస్తా రేమోఅన్న భయంవేసింది. నోరు నొక్కుకొన్నాను. నాడొక్కలో ఒక తన్నుతన్నాడు కాలితో బలంగా. "అమ్మా!" అని అట్లాగే పడిపోయాను నిర్జీవంగా. కొన్ని ప్రథమచికిత్సలుచేశారు. నేను తేరుకోగానే మానాన్న కన్నీరుకారుస్తూ కూర్చొనివున్నాడు. మధు మూర్తి అక్కడలేడు. "నాన్నా! ఎంతపని చేశావునాన్నా" అని యేడుస్తూ వివశనై పడిపోయాను. "ఏడవకమ్మా లేమ్మా"అంటూ నన్ను లేపి కూర్చోబెట్టి కొంచెం మంచినీళ్ళు పట్టాడు. నేను నలిగి పోయిన జీతం రసీదు చూపించి చెప్పాను. దాన్నిచూచి ఆనంద బాష్పాలురాలుస్తూ "తప్పుచేశానమ్మా! అనవసరంగా ఆవేశ పడ్డాను. అతనెంతో ఉన్నతుడు! నీవు స్మృతిలేకుండా పడిపోయి నపుడు కన్నీరుకారుస్తూ వణికిపోతున్న చేతులతో నీళ్ళుచల్లి నీ మొగంపైన విసురుతూవుంటే చూచి నేను చాలా పశ్చాత్తాపపడ్డాను. అతనెంతనొచ్చుకొనివుంటాడోపాపం!" అన్నాడు. నా దుఃఖం ద్విగుణీకృతంకాగా నేను చాపపైన అటుతిరిగి పడుకున్నాను. "నేనిక మీకడ్డురానమ్మా" అంటూ మానాన్న వెంటనేలేచి వెళ్ళి పోయాడు. ఆ పోవడం పోవడం రాత్రి తొమ్మిదిగంటలకుగాని రాలేదు. నేను దుఃఖంతోదిగులుతో అట్లే ఉండిపోయానుచాపపైన.

మానాన్న వస్తూనే ఒకపిడుగువంటి విషాదవార్త వినిపిం చాడు. తాను క్షమాపణ చెప్పుకోడానికి మధుమూర్తి గదికివెళ్ళా.

వట: మధుమూర్తి ప్రయాణసన్నాహంలో వున్నాడట! ఆ సన్నాహం చూచి మానాన్నకు కొంచెం ఆందోళన కలిగిందట. వెళ్లి అతని చేతులుపట్టుకొని "ఏమీ అనుకోకండి" అని ప్రాధేయపడ్డాడట! మధుమూర్తి మొగానవున్న విషాదచ్ఛాయ ఇంకా తరగలేదట! కాసేపున్నాక "నిన్న మధ్యాహ్నం నాకు తంతివార్త వచ్చింది. మా నాన్న చనిపోయాడు. అందుకు నేను సాయంకాలం యేడు గంటలబండికిపోతున్నా" అని అన్నాడట! మానాన్నగూడా కొంత విషాదస్వరంతో ఈ విషయం చెప్పుకుపోతున్నాడు. నేనేమీ వినడంలేదు. కార్చడానికి కన్నీళ్ళుగూడా లేవు. శరీరమంతా ఒక్కమాటు దిగులుతో, సానుభూతితో గగుర్పొడిచింది.

తరువాతచాలా సేపు మధుమూర్తి గుణగణాలను పొగుడుతూ కూర్చున్నాడు మానాన్న. ఏకులంలో పుడితేయేం గుణముఖ్యంకానీ - ఏ కులంలో పుడితేయేం గుణము కరిసొమ్మా అని అంటూ వంట చేసుకుందాం పదమ్మా అన్నాడు.

మరునాడు మధుమూర్తికి సానుభూతితోను, క్షమాపణలతోనూ, కృతజ్ఞతతోనూ నిండినజాబు వ్రాశాను. ఎంత త్వరలో వీలయితే అంత త్వరలో రావలసిందనీ లేకపోతే నేనుండలేననీ వ్రాశాను. ఆజాబు తనకు చేరకముందే తాను నాకు వ్రాసిన జాబొకటి చేరింది. దాంట్లో ఎక్కువ విషయాలులేవు. మా ప్రేమవిషయం తెలిసిన సోదరులు ఏము కులంలో పిల్లను త్వరగా చేసుకోవలసిందిగా పట్టుపట్టినట్లువ్రాశాడు. ఏ విషయానికీ నన్ను బాధపడవద్దనీ-సాధ్యమయినంతత్వరలో వస్తున్నాననీ-ఏది జరిగినా మనమేలుకోరకేననీ-వ్రాశాడు. జాబు చదివినతర్వాత నాకు కొంత ఉపశమనం దొరికింది.

తర్వాతిజాబుల్లో తానింటిదగ్గరేవుండి పరీక్షలకు చదవదలచి నట్లూ-రెండునెలలవరకూరానట్లూ వ్రాశాడు. కాని తాను ఉండలేక పోయాడు. నేనూ ఆ స్థితిలోనే వున్నాను. రాకతప్పదని నేను వ్రాశాక అతడు కర్మ అయిపోయిన నాన్నాళ్ళకేవచ్చాడు. అతణ్ణి చూడగానే నాలోఎంతో ఆనందమూ, బలమూ ప్రవేశించాయి.

తనకు పరీక్షలు దగ్గరకొచ్చాయి. శ్రద్ధగా చదువుతున్నాడు. నేనుగూడా బాగాప్రోత్సహించాను. ఊరినుండి వచ్చేటప్పుడు తాను ఒక మిత్రుడిదగ్గర అప్పుచేసి రెండువందలరూపాయలు తెచ్చాడు. జాగ్రతగా వాడమని ఒక నూరురూపాయలు నాచేతికిచ్చాడు. మిగి లిన రెండునెలలూ ఒడుదొడుకులు లేకుండా జరిగిపోగా ఇంకా కొంత మిగిలింది. మధుమూర్తి పరీక్షలకు చాలాబాగా వ్రాశాడు. అందరికంటే బాగా వ్రాశాడు. ఫస్టుక్లాసు తప్పకరావాలిమరి!

మధుమూర్తి పరీక్షలయ్యేవరకూ మేమావూళ్లోనేవున్నాం. అందరం కలిసేబయలుదేరాం, మధుమూర్తి శాశ్వతంగా వాల్తేరును వదిలేస్తున్నాడు. బండిలోవస్తూ వాల్తేరుసముద్రంపై పుచూస్తున్నాడు. నీటిమట్టంపైన దట్టంగా ఆవరించిన మేఘాలచూస్తున్నాడు. అతని మొగాన్నిగూడా చిలా మేఘాలావరించినయ్! అవునుమరి! ఎన్నె న్నోమధురస్మృతులకు తావలమై తన జీవితనాటకంలో ప్రప్రథమ రంగస్థలమైన వాల్తేరును ఎట్లా విడిచిపెట్టగలడు! విడచిపెట్టే టప్పుడు బాధపడకుండా ఎట్లా వుండగలడు?

---

౬

ఆవేసవిలో మరికొన్ని విశేషాలు జరిగినవి. నాకప్పుడు యిరవై మూడేండ్లు. మంచిపరువంలోవున్నాను. ఇప్పటికే పెండ్లి యీడు దాటిపోతున్నది. ఇంకా ఆలస్యంచేస్తే అసలు పెండ్లేకాదే మోఅని మానాన్న గతసంవత్సరంనుంచే ప్రయత్నంచేస్తున్నాడు. మధుమూర్తికీ నాకూ స్నేహం గాఢమైపోయినకారణంగా ఆయన కృషి ద్విగుణీకృతమైంది. ఇప్పటంతగాకపోయినా అప్పుడుగూడా కట్నాలఝోరు ఎక్కువగానేవుంది. చదువుకొన్నపిల్లయినాసరే కట్నమీయాల్సిందే! కట్నమీయడానికి మానాన్నచేతిలో యేమీ లేదు. చాలాబాధపడకల మొదలుపెట్టాడు. నాకావిషయంతెలుసు. "ఇంకా ఒకసంవత్సరం పదవాలిగదా నాన్నా" అనిచెప్పి ఆప్రయత్నం విరమించమన్నాను.

మధుమూర్తికి ద్రోహంచేయలేనని ఒకవైపు మనస్సాక్షి పలుకుతుంది అతనంటే భయంగూడా ఒకవైపుకలుగుతున్నది. సాంఘికసమత్వం కావాలంటూనే కులాధిక్యాన్ని వహిస్తున్నాను. ఇదెట్లా పరిణమిస్తుందోఅని భయపడసాగాను.

శ్యామరావు మాట్లాడ్డానికి రాలేదు. నేను అతనికిచెప్పి పంపనూలేదు. అతను తనధోరణి తటాలున యెందుకుమార్చు కున్నాడో అడుగుదామనుకున్నాను. కాని అనవసరమనిపించిపూరు కున్నాను.

పరీక్షాఫలితాలు ప్రకటితమయ్యాయి మధుమూర్తికి ఫస్టుక్లాస్ రాలేదు. సెకంఢ్ క్లాస్ వచ్చింది. ఏదో మోసంజరిగిందనుకున్నాను.

ఆంధ్రా యూనివర్సిటీలో క్లాసులు యిప్పుడం ప్రొఫెసర్లచేతిలో వున్న దని తర్వాత తెలుసుకున్నాను. వాళ్ళు ఫస్టుక్లాసనుకుంటే ఫస్టుక్లాస్. సెకండ్ క్లాసనుకుంటే సెకండ్ క్లాసు. అంతే! దీనికితోడు బ్రాహ్మణా బ్రాహ్మణసమస్య బాగావున్నది. అయితే అందరు అబ్రాహ్మణు లకు ఫస్టుక్లాసులేకుండా చంపారని అనను. మెజారిటీవిషయం మాట్లాడుతున్నాను.

మధుమూర్తి ఉద్యోగ ప్రయత్నం చేశాడు. గుంటూరు హిందూకాలేజీలో ఉద్యోగందొరికింది. అది జూన్ నెలాఖర్లోఅన్న మాట! అతనినుండి నాకు ఉత్తరాలువస్తూనేవున్నవి. ఎట్లాగయినా నాకు కాలేజీజీతం పంపిస్తానన్నాడు. ఏమికష్టాలుపడ్డాడో పంపిం చాడు. అదితీసుకొని బయలుదేరామువాల్తేరుకు. వెళ్ళినవారానికే మధుమూర్తివచ్చాడువాల్తేరుకు. అతన్ని భోజనానికి ఆహ్వానిం చాను. భోజనం అతనికొక్కనికేవడ్డించాను. మానాన్న అతనితో కూర్చోలేదు. భోజనమయ్యాక అతనులేవబోయేసమయానికి మా నాన్నవచ్చాడుసమయానికి అతనిచేత ఆకుయెత్తివేయించాలని. అతని చేత ఆకు ఎత్తివేయిస్తే నావిద్య, విజ్ఞానం, స్నేహం అన్నీగంగ లోకలిసిపోయినట్లే. పైగా అతిథికి అపచారంచేసినట్లవుతుంది. మానాన్న ఎదురుగా నిలబడి విస్తరితీ అని అనటానికిబదులు, "విస్తరి అప్రక్కనపారవెయ్యండి ఫరవాలేదు" అని అంటున్నాడు మానాన్నవైపు అట్లాచూచి వికటమందహాసంచేశాడు మధుమూర్తి. "అనవసరం, మీరులేవండి" అని నేనన్నాను. నేను అనకపోయినా అతనావని చెయ్యడు. ఎత్తేసుంటే ఆ ఆకును మొగానికేసి పులిమే రకం! అటువంటి సంసారయింట్లో పెంచబడ్డ మెందుక!

అని ఇదివరకెన్నిసార్లో అనివున్నాడు [illegible]. అతను మండుతున్నట్లుగావున్నాడు. తనకూతురే అపచారం తలపెట్టిందిగదా అని బాధపడుతున్నట్లున్నాడు. నేను ఊరికేనిలబడ్డాను. ఇదంతా గమనిస్తూనేవున్నాడు మధుమూర్తి. రచయితగదామరి!

నవీన వాతావరణంలో వుండి నవ్యవిజ్ఞానాన్ని పొందుతూగూడా అజ్ఞానంలోపడిపోతూవుంటా మొక్కొక్కప్పుడు. మాయింట్లో బ్రాహ్మణుడు అనబడేవాడెవడు తిన్నా ఆకు ఎత్తివేస్తూవచ్చాను. ఎవడైనా ఒకమనిషి తిన్నపుడు ఆకుఎత్తడంలో భేదాలెందు కనుసరిస్తున్నారో ఈఅజ్ఞానులు! ఎవడుతిన్నా అది ఎంగిలే! జాత్యహంకారాన్ని ఇంకా సాగిద్దామనుకొనేరోజుల్లో-జాతిభేదాన్ని చెడకుండా సాగిద్దామనుకొనేరోజుల్లో-అజ్ఞానవంతులు పాటించేపద్ధతి అది. మరి నేనుగూడా ఆనాడు మధుమూర్తివంటి వ్యక్తియెడగూడా-వివాహమాడదామనుకొనేంతటి ఆదరవ్యక్తియెడగూడా-గౌరవను ప్రదర్శించలేకపోవడం కేవలం అన్యాయం.

ప్రక్కయింటివారు మాయింటి యజమానులని ఇదివరకే చెప్పాను. వాళ్లు అబ్రాహ్మణులు-మానాన్నవెళ్లి వాళ్ళ అమ్మాయిని పిలిచాడు. పదేండ్లపిల్లవచ్చింది. ఆకు తీమన్నాడు. ఆకుతీసి చెప్పినప్రకారం శుద్ధిచేసింది. అంతవరకూ మధుమూర్తి ఒక్క మాటగూడా మాట్లాడలేదు. మొగం మాడిపోతున్నది. ఇంతలో వరండాలో "ఏమండీ!" అన్న పురుషకంఠం వినవచ్చింది. నేను అనుమానిస్తున్నట్లు అక్షరాలా జరిగింది. ఆపిల్ల తండ్రి అతను. ఆప్రాంతంలోనే రెవిన్యూ ఇన్స్పెక్టరుగావున్నాడు. ఆపిల్లగూడా ఒకటవఫారం చదువుతున్నది. పెద్దమనిషి పిలిచి 'తీ' అని అన

గానే మారుమాటాడలేక మొగమోటమిచేత తీసివెళ్లింది. అదిచూచి మండిపడి వాళ్ళనాన్న వచ్చాడు. అతనాదినం అన్నమాటల్లో ఎంత అభిమానం ఉట్టిపడిందో ఈనాడు మాత్రమే బాగా అర్థం చేసుకో గలుగుతున్నాను. ఆయన పిలుపుకు మానాన్న సమీపించాడు. మేం గూడా దగ్గరదగ్గర జరిగాం. "అతిథి మర్యాదలు తెలియనివాళ్ళు అతని కన్నం యెందుకుపెట్టారు? అతనికి అభిమానంలేక మీ యింట్లోతింటే మా కభిమానం లేదనుకున్నారా? చిన్న పసిపిల్లకు మీ బ్రాహ్మణాధిక్యం పసచూపిస్తున్నారా? మేం అధికులం అని ఆ పసికందు హృదయంపైనగూడా ముద్రవేయదలచుకొన్నారా? ఎంత చదువులు చదివినా మీ బ్రాహ్మణజాతి ఇంతే! అసలు మీ బ్రాహ్మణజాతికి కొంపే యీగూడదు. మా యిండ్లల్లోకూర్చుని, మా తిండితింటూగూడా మమ్ముల్నే వేరుచేసేఅవిశ్వాసపుజాతిమీది" అని గుక్కతిప్పుకోకుండా అని లోపలికి వెళ్ళిపోయాడు. అవన్నీ చలకోలదెబ్బలవలె మాముగ్గురికీ చురుక్కుచురుక్కుమనితగిలినవి.

కాలేజీ అయిపోయాక నేను హాస్టలుకెళ్ళాను. అక్కడికి కొచ్చాడు మధుమూర్తి. నేను క్షమాపణకోరాను. అతను సీరియస్‌గా "నో! క్షమించే విషయంగాదది. నీలో చిత్తశుద్ధిలేదు. అదేవుంటే యీనాడు బాగా ప్రవర్తించివుండేవానివి. ఆయనకెప్పు విషయాల్లోనో యిష్టంలేదు. అయినా మనలపోదోసుకోలేడు. ఆయన కిష్టంలేనిపనులు ఎన్నో జరిగినవి. అవన్నీ మొదటి పర్యాయం బాధగలిగించేవుంటాయి. పోనుపోనూ అవి అలవాటయి పోయాయి. పీపూర్వులంతా హోటళ్ళలో అందర్నీ తాకుతూ ఎవరో

తిన్న యెంగిలిబోకుల్లో యెప్పుడైనా తిన్నారా? రైళ్ళల్లో అందర్నీ తాకుతూ ప్లాట్‌ఫారంపై అమ్మే దుమ్ముపదార్థాలు తిన్నారా! ఈ విజాతీయ చదువులు చదివి బ్రాహ్మణేతరాధికారులక్రింద దాసోహం అని పడివున్నారా? హోటళ్ళలో హాస్టళ్ళలో మాంసాములు తిని ఇంటికొచ్చి మడికట్టుకొని రుద్రాక్షల పిల్లులవలె కూర్చున్నారా? ఇవన్నీగూడా ఒకనాడు ఉపక్రమించినవేనా? ప్రతిపనికీ ఒక ఉపక్రమణవుంది ఎవరోఒకరు ఏనాడోఒకనాడు దాన్ని ఉపక్రమించాలి. ఉపక్రమణేలేకపోతే అభివృద్ధిలేదు ఈనాడు నీవు ఆకు ఎత్తివేసివుంటే ఆయన బాధపడడం సహజమే! రేపు మరలాతీస్తావు అంతగా బాధపడడు. తర్వాత అది పరిపాటైపోతుంది. ఆపైన వాళ్ళేసమర్థిస్తారు. పైగా ఆచరిస్తారు. తెలిసిగూడా నీవాపనిచేయనందుకు నాకు బాధ అనిపించింది. మీనాన్న యెదురుగా నీవాపని చేయలేనిదానివి సమత్వం యేమాత్రం చెప్పగలవు? అన్యకులంలో ఎట్లా వివాహమాడగలవు? ఆ పొరుగింటి పిల్లను పిలిచి ఆపని చేయిస్తారా? ఆపిల్ల మీతో యెవరికంటే తక్కువో కాస్త చెబుమా? "అతిథిదేవోభవ'' అని మన వేదాలు చెబితే వేదానుసారం జీవిస్తున్నాం అని డాంబికాలు పలికే యీబ్రాహ్మణజాతే దానికి విరుద్ధంగా సంచరిస్తున్నది. పైగా ఆసూక్తులకు అపార్థాలూ, పాక్షికార్థాలూ, సవరణలూ ప్రతిపాదించి వికృతంచేసి తమ ఆచరణను సమర్థించుకుంటారు!! అని ఇంకాయేమేమో ఘాటుగా మాట్లాడాడు. అదంతా సత్యమే! అయితే ఆనాడుమాత్రం ఉడుక్కున్నాను పెద్దవాళ్ళకు విరుద్ధంగా చేయడం వారి మనసు (Sentiments) ను నొప్పించడంగాదా అని అనుకున్నాను. దానికి ప్రాధాన్యమిస్తే అని

యెడతెగని సమస్యఅనీ-అభివృద్ధి సంస్కరణలు ఒకఅడుగుగూడా సాగవనీ-ఈనాడయితే అర్థమయిందిగాని ఆనాడు నాకా దృష్టి కలగలేదు. అందుకే అతనియెడ కొంచెం విముఖత్వం కలిగింది.

మధుమూర్తి ప్రిన్సిపాలుకిష్టుడు. కాని ఆయనను సహాయం కోసం యేనాడూ అర్థించలేదు. నాతో వాదించిన అనంతరం ప్రిన్సిపాలుగారింటికి వెళ్ళాడు. నా విషయం పూర్తిగాచెప్పి గవర్నమెంటుస్కాలర్‌షిప్ యిప్పించమని కోరాడు. ప్రిన్సిపాలు నవ్వుకొని సరేనన్నాడు. జయావహుడైన ఆ ధీరోదాత్తుడు నాకావిషయం చెప్పకుండానే వెళ్ళిపోయాడు. తాను ఆర్జించిన మొదటినెల జీతంలో సరిగ్గాసగం దమ్మిడీలతోసహా పంపించాడు. ఆనందంతో అర్ధాంగిగా స్వీకరించి కండ్లకద్దుకొని అప్రకారం జాబువ్రాశాను.

ఉద్యోగం నాలుగునెలలుగూడా సాగలేదు. ఇంతలో తొలగించారని జాబువ్రాశాడు. అతడు బ్రాహ్మణుడు కానందువల్లనే ఆపనిచేశారనివ్రాశాడు. ఇటువంటిపంక్తులు నాకు విషపుగుళికల వలె గొంతులోదిగబడేవి. అతనికి బ్రాహ్మణా బ్రాహ్మణసమస్య పట్టుకొందనీ, బ్రాహ్మణుల ఆధిక్యాన్ని ఓర్వలేక అట్లాఅవుతున్నాడనీ, అనుకొనేవాణ్ని. అసలు-బ్రాహ్మణుల ఆధిక్యంచూచి-అన్న శబ్దంలోనే సత్యంలేదుగదా అన్నదృష్టి ఆనాడు నాలోలేదు సమత్వంకోసం పాటుపడేవాడు దానికివిరుద్ధంగా ప్రవర్తించేవారిని విమర్శిస్తారనీ-అది నిష్పాక్షికమేననీ-నేనీనాడయితే అర్థంచేసుకుంటున్నానుగాని ఆనాడు ఈర్ష్య, ద్వేషము, అని ఇట్లాంటిపదాలతోనే సమ్మానించేవాణ్ని. నిజంగా హిందూకాలేజీలో నూటికితొంభైతొమ్మిదిమంది బ్రాహ్మణులేఅని తర్వాత తెలిసింది. మధుమూర్తి స్థానంలో ఒకమూడవక్లాసుబ్రాహ్మణుణ్ని వేశారట!

అతనిఉద్యోగంపోతే నాకుఎంతో బెంగపట్టుకొంది. తానేదో కొంతపంపేవాడు. హాయిగాకాలం గడిచిపోతూవుండేది. ఇకనెట్లా అన్నసమస్య పట్టుకొంది. ఒకనెల ఆర్థికంగా ఎంతో బాధపడ్డాను. ఆనెలంతా మధుమూర్తి నామస్మరణతప్ప మరోటిలేదు, అతనున్నప్పటికంటే అతనులేనప్పుడు అతనిఅవసరం, అతనివిలువ, అతిశయించాయి. అక్టోబరులో ఒకనాడు నన్ను ప్రిన్సిపాలు పిలిపించాడు. భయంభయంగావెళ్ళాను. నన్నుచూచి ముసిముసినవ్వులు నవ్వుతూ మరలా సీరియస్‌గాఅయి నీకూ మధుమూర్తికీ సంబంధం యేమిటి? బంధువులా" అన్నాడు. కొంటెగా. నాకు గుండెలు దడదడ లాడాయి. ముచ్చెమటలుపోసినవి. వెంటనే చిఱునవ్వు నవ్వాడు. "నీకు గవర్నమెంటు స్కాలర్‌షిప్‌వచ్చింది. ఆఫీసుకెళ్ళి తీసుకో పో!" అన్నాడు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై సరాసరి హాస్టల్లోకివెళ్ళాను. మధుమూర్తి నిజంగా యెంతమధురమైనవాడు! నాతో ఆనాడుపోట్లాడి నేరుగా ప్రిన్సిపాలుదగ్గరికెళ్ళడం యిందుకోసమేనన్నమాట! అవును! కార్యశూరులు ముందుగా చేయబోయే పనినిగురించి వాగుతూకూర్చోరు. ఫలితాన్నిచూచిన తర్వాతగూడా తమగొప్పతనాన్ని చాటుతూకూర్చోరు. గత రెండు సంవత్సరాలుగా రాకుండా యీసంవత్సరంవచ్చిందంటే ఇది కేవలం మధుమూర్తి ప్రయత్నమే! ఈవిధంగా మధుమూర్తిపైమనసు పోనిచ్చి చాలసేపు మధురంగా ఊహించాను. వెంటనే-మాసంబంధాన్నిగూర్చి ఇంకా యెంతమందికి చెప్పాడేమిటి? అన్నప్రశ్నగూడా ఉదయించింది. యూనివర్సిటీలో సగంమందికిపైగా తెలిసిన విషయాన్ని ఎవరికీ తెలియదనీ-దాన్ని బయటపడనీగూడదనీ-

ఆత్మవంచనలో పడ్డాను. ఇతర్లకు చెప్పాడేమో-అందరికీ తెలిసిపోతుందేమో-అని నేను సందేహించడంలోనే తెలుస్తున్నది నా ప్రేమలో మోసం వున్నదని. అతనిని చిత్తశుద్ధితో వివాహంకోసం ప్రేమించడంలేదని అనుకోడానికిదే తార్కాణం. మేము వివాహమాడబోయేటప్పుడు దొంగతనంగా వివాహమాడబోతామా ? అందరికీ పత్రికలు పంచిపెట్టిగదా వివాహమాడ్తాము ! అటువంటప్పుడు కొందరికి-ముఖ్యంగా మనబాగును కాంక్షించేవారికి తెలిస్తే తప్పేమిటి ? అదేగాదు తప్పక పెండ్లాడబోయేటప్పుడు అందరికీతెలిస్తే మాత్రం తప్పేమిటి ? ఈవిధంగా పదుగురికీ తెలియడంవల్ల అతనికే దెబ్బతగిలింది. అతనికి ఫస్టుక్లాసు రాకుండాపోవడానికి నా కారణంగా అతనిపై విముఖత్వం వహించిన బ్రాహ్మణ ప్రొఫెసర్లే కారణం. నేను వక్రంగా ఆలోచించే, నా జీవితాన్నిగూడా వక్రం చేసుకున్నాను. అతడు కొన్నిసార్లు అభిమానాన్నిచంపుకొని గూడా నాకోసం ఎన్నెన్నో శ్రమలు పడుతూవుంటే అతన్ని కృత్రిమంగా ప్రేమిస్తూ నా భావాన్ని అర్థంచేసుకోలేని బుద్ధిహీనుడుఅని గూడా అన్నాను. అతడు క్షమాహృదయుడు. వైవాహిక జీవితంలో మానసికమైన ఐక్యతేగాకుండా ముఖ్యంగా శారీరకైక్యతగూడా గలిగివుంటాంగాబట్టి ఎన్నెన్ని వచ్చినా సమన్వయించుకొని పోవచ్చునని అతని వాదం. అట్లా జరగదని నా వాదం.

నేను నా స్కాలర్‌షిప్ ఉదంతాన్నివ్రాసి అభివందనలూ, అభివందనాలూ తెలిపిన తర్వాత నాకు పదినాళ్ళకుగాని అతను వ్రాయలేదు. ఆ జాబులో తాను మద్రాసులో ప్రభుత్వకళాశాలలో అసిస్టెంటు లెక్చరర్ పదవి సంపాదించినట్లు వ్రాశాడు. నాకు చాలా ఆనందం కలిగింది.

నాకు అందమంటే చాలా లోభంవున్నది. అందుకోసమే అపుడపుడూ మోహన్‌కుమార్ మాట్లాడ్డానికివస్తే మాట్లాడనిచ్చేదాన్ని. వాడు మరలా నన్ను వెంటాడడం మొదలుపెట్టాడు. సుధ వాణ్ణిపుడు కన్నెత్తిగూడా చూడడంలేదు. ఒకనాడు మళ్ళా వివాహ ప్రసక్తి తెచ్చాడు. ఈ యువకులు ప్రేమ వెఱ్ఱిలో పడితే అంతా మరిచిపోతారు. నేను మధుమూర్తిని వివాహమాడతానని అతనికి తెలుసు. వివాహమాడినా ఆడకపోయినా ఒకణ్ణి ప్రేమించి వాడి వెంట తిరిగిందన్నపిల్లను పెండ్లాడడానికి సాహసించిన యువకుణ్ణి నే నిప్పటికి చూడలేదు. కేవలం నన్ను మోసగించి అనుభవించి పోవడానికే వాడీయెత్తు వేస్తున్నాడని నాకు బాగాతెలుసు. అందుచేత మరలా ఒకసారి గట్టిగా ఛీవాట్లు పెట్టాను. ఎన్ని తిట్టినా వాడు వదలడు. పట్టుపట్టి వెంటతిరిగితే యేనాటికైనా హృదయం కరిగి లొంగగలదన్న సత్యం అతను అనుసరిస్తున్నాడు. అది కొంతవరకూ నిజమే అయినా దానికి అపవాదం వుందన్నవిషయం విస్మరించినట్లున్నాడు. ప్రాధేయపడటంగూడా మొదలుపెట్టాడు. ఒకనాడు ఆర్ట్సుకాలేజీలో పడమటికొనన క్లాసు అయిపోయాక అందరూ ముందుగా వెళ్ళారు. నేను చీర సర్దుకోవలసిన అవసరం వుండడంవల్ల వెనుకకు ఆగాను. నన్ను చూచి వీడుగూడా ఆగినాడు గాబోలు! నేను చీర చక్కబెట్టుకుంటూ వుండగా పైట కొంగుపట్టుకున్నాడు. వీడు కొక్కోకం బాగా చదివినట్లున్నాడు. అయినా నా మనస్తత్వం తెలుసుకోలేకపోతున్నాడు. తటాలున వెనక్కితిరిగి చూశాను. అగ్గిగా మండిపోయాను. వెంటనే చెప్పు తీసికొని చెంపకేసి కొట్టాను. కొంగు విడిచి చెంప తడుముకుంటు

న్నాడు! రెండు తిట్టి చరచరా వెళ్ళిపోయాను. సాయంకాలానికల్లా నాకొకజాబందింది. దాంట్లో నాకతంతా వాడికి తెలుసుననీ-చిన్నప్పుడు శ్యామారావుకూనాకూగల సంబంధం-మేము పారిపోవడం-తర్వాత రామేశం ఉదంతం-ఇవన్నీ తెలుసుననీ-ఇట్టి దుశ్చరిత్ర గలిగిగూడా మధుమూర్తివంటి స్వచ్ఛమైనవాణ్ణి కలుషితం చెయ్యడానికి పూనుకున్నాననీ-అందుకేదినమే మధుమూర్తికి అన్నీ తెలుపుతూ జాబు వ్రాస్తున్నట్లు బెదిరిస్తూ వ్రాశాడు. అది చదువుకొని హతబుద్ధినై చాపమీదవాలిపోయాను.

సరిగ్గా అది స్నాతకోత్సవంరోజులు. మధుమూర్తివచ్చాడు. హోస్టల్లోదిగాడు. మాయింటికొచ్చాడు ఆసమయంలోనే మా నాన్న వూరువెళ్ళాడు. మేం కులాసాగా మాట్లాడుకున్నాం. చాలా చాలావిషయాలు మాట్లాడుకున్నాం. తప్పనిసరిగా అతన్ని పెండ్లడతాననే నమ్మకం అతనిలోవున్నది. నాఅభిప్రాయాన్ని అతనికి చెప్పాలన్నట్లుగా ప్రకరణానుసారంగా "నేను బ్రహ్మచారిణిగా వుండిపోతాను" అన్నాను. "నేను నీకు తగనిదాన్ని" అనికూడా అన్నాను. నేనునీకు తగను అన్నదానిని అక్షరాలా తీసుకొని "నీవేనాకు తగినదానివి" అనేవాడు. నాభావాన్ని అర్థంచేసుకోని దానికి బుద్ధిహీనుడని మనసులోఅనుకొనేదాన్ని. అతడా వక్రభావాన్ని ఊహించనేఊహించేవాడుగాడు.

నాచరిత్ర అంతమంచిదిగాదు. ఆశంక నన్ను బాధిస్తూనే వున్నది. ఆశంకను పురస్కరించుకొని భయంఆవేశించింది. మధుమూర్తి అపరాధపరిశోధకభావమూ, అవినీతిపరుల క్షమించేహృదయం లేకపోవడమూ-నాభయాన్ని ద్విగుణీకృతంచేశాయి.

డిగ్రీ తీసుకున్నాడు. మధుమూర్తి బయలుదేరాడు. ఇక అతను వాత్తేరుకురాడేమో! నేనుగూడా యికవుండను. ఇక ఎక్కడ కలుసుకుంటామో! కలుసుకోలేమేమో! మాకు వివాహంకాదేమో! నాకోసం ఎంతచేశాడు! నన్ను ఎంత నమ్మాడు! ఈభావాలన్నీమనస్సులోదూరి బాధపెట్టాయి. నేను దుఃఖం ఆపుకోలేకపోతున్నాను. దౌర్బల్యం నాలో ఆవేశించింది. గట్టిగా ఏడ్చాను. అందరూచూస్తున్నారు. అయినా ఏడ్చాను. నమ్మినవాడికి ద్రోహం చేయబూనుకున్నానుగదాఅని యింకాయేడ్చాను.అతను ముందుకొచ్చి అటుయిటూ చూస్తూ "ఇదేమిటి హసంతీ! మనంత్వరలో కలుసుకుంటాంగా" అని ఓదార్చాడు. బండికదిలింది. అంతకంతకూ దృష్టిపథం దాటిపోతున్నది. తనతోగూడా నామనసునులాక్కొని మధుమూర్తివెళ్ళిపోయాడు. ఈకళేబరాన్ని యీడ్చుకుంటూయిల్లుచేరాను.

నాకు స్కాలర్‌షిప్‌వస్తూనేవుంది. మధుమూర్తిపంపుతూనే వున్నాడు. శ్రద్ధగా చదువుతూనేవున్నాను. ఒక్కొకయెడ మధుమూర్తియెడ ప్రేమభావాన్ని వహిస్తూనేవున్నాను. మరొకవైపు స్వతంత్రభావం పెంపొందించుకుంటూనేవున్నాను.

పరీక్షలకు బాగానేవ్రాశాను. వాత్తేరు వదిలిపెట్టే దినం వచ్చింది. ఆభావం మనసులోదూరగానే గుండెల్లో గభిల్లుమంది. ఎన్నెన్నో ఘట్టాలు ఒకటొకటే గిర్రునతిరిగాయిమనోదృష్టిపథంలో. ఎన్నెన్నో అనుభూతులు హృదయంలో చొరబడ్డాయి. బాధతోనే వదిలాను వాత్తేరును. అంతే ఈనాటికీ వాత్తేరును తిరిగిచూడలేదు.

౭

వేసవిలో వివాహప్రయత్నాలు జరిగినవి. నాకు వివాహమంటే మళ్ళావకసారి అనిష్టత కలిగించింది. ఇది నిజంగా ద్రోహ

చింత. స్వచ్ఛమైన వైవాహికప్రేమతోనే మధుమూర్తి అంతపాటు పడ్డాడు. నాకోసమైఅతను ఎవర్నీవివాహమాడకుండావుంటున్నాడు. నేను అవివాహితనుగావుండిపోతానంటే అతనికి ద్రోహం తలపెట్ట డమే. అతడు అపరాధపరిశోధకుడు. ఆవిషయం తెలిసినప్పటి నుంచీ నాకుభయం. నాకళంకితచరిత్రను మోహన్‌కుమార్ ఈ పాటికేనాడో వ్రాసివుంటాడు. ఏమీ యెరగనట్లు మధుమూర్తిసంచ రిస్తున్నాడు. ఆవిషయం అతనువ్రాశాడా లేదా అని నేనెట్లాఅడగ గలను? అనుమానంతో అనవసరంగా బాధపడుతూ కూర్చున్నాను.

ఒకనాడు మానాన్న నెత్తిమూటలుతెచ్చి బట్టలమ్మేవాడితో బేరాలాడుతున్నాడు నన్నుగూడా పిలిచాడు. ఒకచీర, ఒకపంచ, తీసి బేరంఆడుతున్నాడు. అతనుచెప్పిందాంట్లో అర్ధానికంటేతక్కు వకు అడుగుతున్నాడు మానాన్న. "ధర సరిగ్గాచెప్పరా అబ్బాయ్" అంటూన్నాడు మానాన్న. అతనికిగూడా యాభైయేండ్లుంటాయి. అయినా అబ్బాయిఅనే పదాన్నుపయోగిస్తున్నాడు మానాన్న. మా నాన్న జంధ్యాన్నిచూచి "అంతేస్వామీ, తమబోటి వారిదగ్గర యెక్కువతీసుకుంటే అదిమాకరుగుతుందాండీ" అంటున్నాడు. రంగుగ్యారంటీయేనా?" అన్నాడుమానాన్న "మీకబద్ధం చెబుతానా స్వామీ ఈరంగుతప్పదని "ఈజంధ్యం సాక్షిగా ప్రమాణం చేస్తు న్నాను" అనిఅంటూ మానాన్నజంధ్యంవంటి జంధ్యమే బయటికి లాగి చేత్తోపట్టుకొని చూపాడు. మరి ఆప్రమాణము చీరరంగు నుద్దే శించో - లేక - జంధ్యం రంగునుద్దేశించో - నాకు అర్థంకాలేదు అతను మాసినచొక్కా వేసుకున్నాడు. పంచ మోకాళ్ళవరకూ ఎత్తి కట్టివున్నాడు. నెత్తికి ఒక టవల్ చుట్టుకొని వున్నాడు. మానాన్న

కొనాలనిబేర మాడడంలేదు. ఊరికేనేఆడుతున్నాడు. బేరం కుదరనందువల్ల అతను వెళ్ళిపోయాడు. అతనువెళ్ళిపోయాక "చూశావా అమ్మాయ్! ఇతడే వీరక్షత్రియకులుడు. బాగాచూడు. అంటే తొగటవాడన్నమాట! నేత నేసేజాతుల్లో ఇవొకటి. వాళ్ళకు తోడు పైగా జంధ్యమొకటి! "అన్నాడు అవహేళనగా.

అదంతా మానాన్న మధుమూర్తినుద్దేశించిఅన్నాడు.నిజమే! ఎంతతక్కువజాతినుండివచ్చాడు! మాకూ వాళ్ళకూ ఎక్కడపొసుగుతుంది! వాళ్ళజీవితవిధానానికి మాజీవితవిధానానికి ఎంత తేడా వుంది! అని యీవిధంగా అనుకోసాగాను ఎంతోమంది పురోహితులను, మాబంధువులను, అంతకంటే అధ్వాన్నంగా కనబడడం చూశాను. నశ్యంకంపు, పొగచుట్టకంపు, బీడీకంపు కొట్టడం చూశాను. సారాయితాగి తైతక్కలాడిన అగ్రహారీకులు మాఅగ్రహారంలోనే వున్నారు. ఎంతోమందియాయావరపు బ్రాహ్మణులను చింకిబట్టలతోనూ మాసినబట్టలతోనూ వుండడం చూశాను. వాళ్ళంతా ఉన్నతులే అన్నభావంతో నేనేనాడూ అసహ్యించుకోలేదు. ఎట్లా వున్నా వాళ్ళల్లోతేడాలేదన్నభావం మొదటినుండీపాతుకుపోయింది. తేడాలేదని బోధించినారు మొదటినుండీ. కొన్నివిషయాల్లో బోధించకపోయినా తేడాలేదన్నట్లుగా అందరూ ఆదరించారు. అబ్రాహ్మణులు బ్రాహ్మణులతో అన్నివిషయాలలో సమానంగా వున్నా, కొన్నివిషయాలలో మెరుగ్గావున్నా, తేడావున్నట్లు ఆదినుండీ సంచరిస్తూవుంటే తర్వాతవాళ్ళుగూడా నేర్చుకొని "తేడా" అనే రంగద్దాల ధరించి చూడసాగారు. లేకపోతే ఆబట్టలమ్మేవానిజీవితవిధానంకంటే మాజీవితవిధానంగొప్పదా? నాబ్రతుకు ఎట్లా బ్రదికానో

మానాన్న ఎట్లా బ్రతికాడో-అట్లాంటివారిపుడెంతమంచున్నారో-తెలియందెవరికి? అసలు ముష్టైత్తుకొనిబ్రదికేజాతికంటే నికృష్టపు జాతి మరొకటివుంటుందా?

నా మనసుమాత్రం ఆనాడు చివుక్కుమన్నది. చిన్నతనం వేసింది. ఆ తర్వాత మానాన్న "చూశావా హసంతీ! వాళ్ల యిండ్లల్లో-వాళ్ళమధ్య-యెవరైనా ఆచారంగల యింటిబిడ్డ-ఒకబ్రాహ్మణబిడ్డ-జీవించగలదా?" అన్నాడు. నాకు నిజమే అని తోచిందప్పుడు. ఎవరైనాగూడా తాము వెళ్లినయింట అనువైన వాతావరణం కల్పించుకోలేందే హాయిగా జీవించలేరనీ-అది మనచేతిలోనే వుందనీ-అన్న సత్యం నాకానాడు తోచలేదు.

ఒక తహసిల్దారు రెండవపెండ్లికోసం ప్రయత్నం చేస్తున్నాడని మానాన్నకు తెలిసింది. వెంటనే ఈయనగూడా ప్రయత్నంచేయడం మొదలుపెట్టాడు. అతనికిపుడు నలభై రెండేండ్లు. ఇరవైయేండ్లు ఉద్యోగం చేయ్యగా చేయగా ఇప్పటికి తహసిల్దారయ్యాడు. అదిగూడా డిప్యూటీ తహసిల్దారుగా వున్నపుడు ఎంతెంతో లంచాలుపోస్తే అయింది. పాపం భార్య పోయింది. పిల్లలు నలుగురున్నారు. ఆయన చదువు మెట్రిక్యులేషను. అతను మా యింటికి నన్ను చూడడానికివచ్చి నాతో మాట్లాడుతూన్నంతసేపు నాహృదయం యెంత యెదురుతిరిగిందో చెప్పలేను. ఆచదువుగల భర్త యం.యే. పెండ్లాముతో సరితూగగలడా అన్నవిషయం అతనికి సందేహమే! అతను డిప్యూటీ కలెక్టరు గూడా అయితే కావచ్చు. గురుముఖాన యెం.యే. వరకూ చదివిన నాచదువూ-చదువు ఏనాడో మరిచిపోయి కేవలం అధికారాహంకారాలతో

క్రింది ఉద్యోగస్థుల పీడించుకతినే అతని ప్రవర్తనా-ఒకదాని సరసన ఒకటి కూర్చోలేవు. నా కప్పటికి యిరవైనాలుగేండ్లు. అప్పటికే వివాహవయస్సు దాటిపోయిందన్నమాట! పూర్వపద్ధతిలో అయితే-అంటే-పదిహేనవయేటనే పెండ్లయివుంటే నలుగురు బిడ్డలయినా కలిగివుండాలి. అటువంటి నావయస్సుకూ ఆయనవయసుకూ యింకా పద్దెనిమిదేండ్లు తేడావుంది. మేమింకేమి సుఖమనుభవించడానికి పెండ్లాడాలి?

తహసిల్‌దారు వెళ్ళిపోయినాక "నాకు వివాహం వద్దు"న్నాను. అందుకు మానాన్న వేరే అర్థం తీసి, "మధుమూర్తిని పెండ్లాడతావా అమ్మా! మన కులమెక్కడ అతని కులమెక్కడ? మనం గురువులం. వాళ్ళు సేవకులతో సమానం. ఈ చదువులు వచ్చి కాదంటేమాత్రం మన జన్మల ఘనత యెక్కడికిపోతుంది? మనదెంత పవిత్రవంశం! అటువంటి వంశంలోనుండి నీవు ఒక అబ్రాహ్మణ్ణి చేసుకున్నావంటే మనవంశమూలపురుషులుసైతం మైలపడి మనల శపించరూ! మనకు పుట్టగతులుంటాయా? తినడానికి మెతుకుపుడుతుందా? నీ హృదయంలో యీ బీజం పడినందునే మనం యింత కష్టాలపాలయ్యాం. లేకపోతే యిట్లాంటివి కలుగుతాయా? సృష్టికి విరుద్ధంగా నడవగలమా అమ్మా! మనలను గురువులుగా భావించేవాళ్ళు, మనల్ని స్వామీ స్వామీ అని చేతులు జోడించుకొని దూరంగా నిలబడేవాళ్ళు మనతో వియ్యమందడమా? వాళ్లూ మనమూ ప్రక్కప్రక్కన కూర్చొని వియ్యమందుకోడమా! ఈ పరిస్థితి ఊహించగలమా? తర్వాత మనకేమాత్రమయినా మర్యాదవుంటుందా? అట్లా జరిగితే బ్రాహ్మణుల

కంతా బంధువులు నేసేవాళ్ళూ, దున్నేవాళ్ళూ, కల్లుగీసేవాళ్లూ, కుండలు చేసేవాళ్ళూ కొయ్యపనిచేసేవాళ్లూ అవుతారు. వాళ్ళందర్నీ బంధువులని చెప్పుకొని యేం గర్వించగలమో నీవేచెప్పు!" అని యీ విధంగా మాట్లాడాడు. నేను ఆనాడు యేమీ జవాబు చెప్ప లేదు. పైన పేర్కొన్నవాళ్ళకంటే ఆయన, ఆయన చెబుతూవున్న ఆయనకులంవాళ్లూ యే విధంగా గొప్పో నాకీనాటికీ అర్థంకాలేదు. అయితే ఆదినం నోరు విప్పకుండా కూర్చున్నాను. దుర్భావాన్ని నేను ఎదుర్కొనలేను. అది మానాన్నకు కొంత ప్రోత్సాహ మిచ్చింది. మధుమూర్తిని విమర్శిస్తూ కూర్చున్నాడు తర్వాత. మధుమూర్తిని విమర్శించడానికాయనకేమీ కారణాలులేవు. కేవలం కులస్పర్థే! నన్ను ప్రేమించడం తప్ప ఈయన కేకీడూచేయ లేదు. పైగా ఎంతో మేలుచేశాడు. తానిపుడు ఆధారపడుతున్న తన కూతురు ఇంతపైకి రావడానికి చాలవరకూ కారణభూతుడు మధుమూర్తే! అతన్ని అనవసరంగా విమర్శిస్తూవుంటే నాకు దుఃఖం వచ్చింది. అతన్ని సమర్థించకుండా వుండలేకపోయాను. ఆయనకు కోపం హెచ్చింది. నానా దుర్భాషలాడాడు. అతన్ని చేసుకుంటే నీమొగం చూడను అని అన్నాడు, నాకు కోపం పట్టకుండావచ్చింది, "నీకవసరంవుంటే చూస్తావు, లేకపోతే చస్తావు" అని కఠినంగా అన్నాను. అదివిని ఎంతోబాధపడ్డాడాయన. చప్పచల్లారి, దీనస్వరంతో "నన్ను చావమంటావామ్మా! నిన్ను చూచికొని బ్రతుకుతున్నాను. నాకు ఈ లోకంలో బ్రతకాలనిలేదు. నిన్ను చూచుకొనే జీవిస్తున్నాను. నీపైన ఆధారపడ్డాను. నన్ను కడతేరుస్తావని నమ్ముకున్నాను. నన్ను నీచేతికూడుతినేటట్లు చేయవాతల్లీ! కులం

చెడితే నీచేతికూడు ఎట్లాతింటానుచెప్పు. ఈ ముసలి తండ్రినీ కాదంటావామ్మా" అని ఏడ్చాడు. నా హృదయం కరిగిపోయింది. "లేదు నాన్నా చేసుకోను నాన్నా" అన్నాను. చేతిలో చెయ్యిగూడా వేశాను.

తెలిసివుండి తప్పిపోవడం ఒక్కొక్కసారి సంభవిస్తూ వుంటుంది. మనం ఉద్రేకంలో పడిపోయినపుడు తెలివి పనిచేయకుండాపోవడం సంభవిస్తూవుంటుంది.నేను తెలివితప్పి, మానాన్న చేతిలో చెయ్యివేశాను. అది వేశేనాటికి నేనెంతపవిత్రమైనదాన్నో దేవుడికేతెలియాలి. మూర్ఖుల మూర్ఖత్వానికి పట్టుదలకూ లొంగి మాటయిచ్చాంగదా అనిదాన్నిపట్టుకొని కూర్చోడంగూడా అంతకంటే తెలివితక్కువ. ఆతెలివితక్కువనే ఆనాడు చేశాను.

తరువాత కొన్నాళ్ళకు ఆతహాశిల్దారు, వివాహమాడటానికిష్టపడలేదని తెలిసింది, అతను నిజంగాతెలివైనవాడనీ–మానాన్నకంటే తెలివైనవాడనీ అనుకున్నాను.

జూన్‌నెలమొదట్లో పరీక్షఫలితాలొచ్చాయి. నాకు సెకండ్ క్లాసిచ్చారు. కొన్నికాలేజీలకు దరఖాస్తుపెట్టుకున్నాను. ఒకనెలకు సరిగ్గా మద్రాసు వుమన్‌క్రిష్టియన్‌కాలేజీలో లెక్చరరుగా నియోగించినట్లు ఆర్డరువచ్చింది. పరమాత్మకు కోటివందనాలర్పించి ఆనూరురూపాయలఉద్యోగంలో ప్రవేశించాను. ప్రవేశించిన రెండవనాడే ప్రసన్నారావుగారినీ మధుమూర్తినీచూడడానికి ప్రెసిడెన్సీ కాలేజీకి వెళ్ళాను. మొదట ప్రసన్నారావు గదికెళ్ళాను. తర్వాత మధుమూర్తిని చూద్దామనుకున్నాను. తీరాపోతే యిద్దరూఒకేచోట వున్నారు. నన్నుచూచి ఆశ్చర్యచకితులయ్యారు. "దా హాసంతీ"

అని పూర్వపుపద్ధతిలోనే ఆప్యాయనంగా ఆహ్వానించారుప్రసన్నా రావుగారు. వెళ్ళికూర్చున్నాను. ప్రసన్నారావుగారికిపుడు ఇరవై యెనిమిదేండ్లుంటాయి. ఇంకా అవివాహితుడుగానే వున్నాడు.

"ఆరోగ్యంగావున్నారా మాష్టరుగారూ" అన్నాను నేను.

"భగవంతుడికృపవల్ల" అన్నారు మెల్లగా నవ్వుతూ.

"మీరు గురుసేవకొచ్చారా?" అన్నాను మధుమూర్తితో.

"అంతకంటె వేరేపనేముంది?" అన్నాడు మధుమూర్తి.

కాసేపుమాట్లాడుకున్నాం. నాఉద్యోగంవిషయంచెప్పినాక వాళ్ళిద్దరూ చాలా సంతోషించారు. "వేసవిలోసరిగ్గా జవాబీయలేదేమి?" అన్నాడు మధుమూర్తి. దానికినేను జవాబీయలేదు.

వేసవిలో తానుఎంతో ఉత్సాహంతో నాకు జాబులువ్రాసిన మాటనిజమే! నేను అన్నిటికీ జవాబులీయలేదు. ఇచ్చిన కొన్ని గూడా అతన్ని నిరుత్సాహపరిచేవే! ఇక వివాహానికి అడ్డేమీలేదు గదాఅని భావిస్తూవుండినఅతన్ని ఆజాబులు ఆశ్చర్యచకితుణ్ణి చేసి వుంటాయి. నాకు వేసవిలో మతిచెడిపోయినట్లయింది. మానాన్న ఒకప్రక్కన కులం కులంఅని యేడుపు. కులంవారంతా మాకులం గొప్పదనాన్నిగురించి నాటగ్గరదండకాలుచదివేవారు. మాకులాన్ని ఆకాశంనుండి వూడిపడినట్టుగావర్ణిస్తూ ఇతరకులాన్ని ఏమీగానట్టుగా తీసిపారేసేవారు. నేనుగూడా ఆవాతావరణంలోపడి నాకులం గొప్పదనాన్నిగూర్చి గర్వించేదాన్ని. మధుమూర్తిని చేసుకోడంలో చాలా త్యాగంచూపుతున్నానని అనుకొనేదాన్ని.

మధుమూర్తికి ప్రసన్నారావుగారిని ఇదివరకే జాబులద్వారా పరిచయం చేసివున్నాను. మధుమూర్తికి సరిగ్గా ఆదేకాలేజీలో

ఉద్యోగం దొరకటం అతనిఅదృష్టమనేమో ! ప్రసన్నారావుగారు మాగురువుగా తెలుసునేగాని అంతకంటె భిన్నంగా అతనికి తెలి యదు. అసలు తర్వాత ప్రసన్నారావుగారిదగ్గర నాగురించి ప్రసం గంవచ్చినపుడు మాప్రేమవిషయంకూడా చెప్పాడు. ప్రసన్నారావు గారు సంతోషవచనాలుపలికి ప్రోత్సహించారుగాని నాసంగతిమెరిగి వుండడంవల్ల అపుడే అనుమానించారు.

అనాడే మధుమూర్తి నాకిసకువస్తానన్నాడు. నేను అక్కర లేదన్నాను. మధుమూర్తి ఆశ్చర్యపడ్డాడు. నేను ఆర్థికంగాగూడా యిపుడు స్వతంత్రను. అందుచేత మావివాహానికి యిదివరకున్న అడ్డంకులుకూడా లేవుగదా అనిఅనుకున్నాడు మధుమూర్తి. నా హృదయంలోని మార్పును కనిపెట్టడానికి ఏనాడూ మధుమూర్తి ప్రయత్నించలేదని నాఅభిప్రాయం. మారుతున్నదని తెలిసిగూడా తెలిసినట్లు నటించగూడదని అతని ఆశయం. నాపొరపాటును నేనే అర్థం చేసుకోగలనని అతని అభిప్రాయం. అతనియెడల ఒక మోస్తరు భయం-ఒకమోస్తరు విముఖత గతసంపత్సరం మొదటి నుంచేవున్నాయి. అతనితో ఎంతోఅవసరంగాబట్టి అవి బయటపెట్ట లేదు. అవసరం తీరగానే కొంతప్రదర్శించాను. అదే నాలోవున్న దుష్టత్వం ! అన్యాయగుణం.

ఆలోచించుకుంటూ వెళ్ళి మెరీనాబీచిలో నీటికి దగ్గరగా కూర్చున్నాను. నాస్మృతిపథంలో వాత్తేరులో తొలినాటి దృశ్యాలు తిరుగసాగాయి. అట్లా భావిస్తూ చూస్తున్నా. మధుమూర్తి దగ్గర వుంటే బాగుండుననిపించింది. రసతన్మయత్వంలో మధుమూర్తిని పెండ్లిచేసుకొనితీరవలసిందే అనుకున్నాను.

రాత్రి తొమ్మిదిగంటలకిల్లు చేరాను. మానాన్న ఎవరోఒక అపరిచితుణ్ణి పరిచయంచేస్తూ "ఈయనది మనజిల్లాయేనమ్మా! మనబంధువులుగూడా అవుతారు. ప్రస్తుతం నెల్లూరులోవున్నారు. బోర్డులోవుద్యోగం. వాళ్ళబ్బాయి విషయమైవచ్చారు" అన్నాడు.

"ఏం వుద్యోగంచేస్తున్నారండీ మీఅబ్బాయి" అన్నాను.

"ప్రస్తుతం తాలూకాఫీసులో యూడీ (U.D.) క్లర్కండీ"

"ఎన్నాళ్ళుగా చేస్తున్నారు?"

"ఉద్యోగంలో ప్రవేశించి పదేండ్లయింది"

"సరే!" అంటూ లోపలి కెళ్ళిపోయాను. లోపలి కెళ్ళాక నేను ప్రశ్నించినతీరు అంతబాగా లేదేమో అనిపించింది. డ్రెస్సు విప్పుకుంటూవుండగా "అమ్మాయి ఒప్పుకున్నట్టేనా? "అన్నాడాయన,

"ఆ విషయం అనలేదుగా! వస్తుందుంటండి" అన్నారు మా నాన్న.

"ధోరణిచూస్తే ఒప్పుకున్నట్టే మన సంబంధానికి! అయితే పెండ్లి మీరు చేసియిస్తూ కనీసం వెయ్యిన్నీనూటపదహార్లన్నా చెల్లించాలి"

"ఇంత చదువు చదివించి ఇంత వుద్యోగంచేస్తూ పైగా వెయ్యిన్నూటపదహార్లా?"

"అంత చదువుతోనూ అంత వుద్యోగంతోనూ మాకేంపనుందండీ!* వంశ మర్యాదవుండిగదూ! మీరేమీయీకపోతే మాకు చిన్నతనంగా వుంటుంది"

నేను బయటికొచ్చాను, తీవ్రంగా ఆ పెద్దమనిషితట్టు చూశాను. నా చూపులకే ఆయన సంచలించిపోయాడు, కొంచెం

కోపంగా "మీ అబ్బాయి ఉద్యోగం యెంతటిదో తెలుసు. మీ అబ్బాయి వయసుగూడా ముప్ఫయినాలుగేండ్లని మీరేఅన్నారు. పైగా అతని విలువ-యం.యె. చదివి లెక్చరర్ పనిచేస్తూ పైగా వెయ్యిన్నూటపదహార్లిచ్చే స్త్రీ విలువ అన్నారు. ఇక వచ్చినదారినే దయచేయండి; మీ సంబంధం నాకక్కరలేదు. భోజనంమాత్రం చేసిపొండి" అన్నాను. ప్రతిమాటకూ ఆయన సంచలించిపోతున్నాడు. మానాన్న మండిపోతున్నాడు.

మరునాడు సాయంకాలం మధుమూర్తి దగ్గరికి పోదామనుకున్నాను. ఆనాడు మధ్యాహ్నం మా టీచర్లగదిలో వుండగా బ్రాహ్మణాబ్రాహ్మణ సమస్య వచ్చింది. అబ్రాహ్మణులు బ్రాహ్మణుల నిందిస్తున్నారు. బ్రాహ్మణులు ప్రతిగా యేదో అంటున్నారు. నేనుగూడా కలుసుకోక తప్పిందిగాదు. గట్టిగా వాదించాను. అబ్రాహ్మణులు మనుషులే గాదన్నాను. శుభ్రత అన్నది యెరుగనే యెరుగని మూర్ఖులన్నాను. అందుచేత మేము తప్పక నీచంగా చూస్తామనికూడా అన్నాను. అబ్రాహ్మణులంటే ద్వేషం జుట్టెక్కిందానాడు. అంతే మధుమూర్తిని హృదయంలోనుండి బైటికి గెంటేశాను.

మధుమూర్తి అపుడపుడూ కొన్ని ఉత్తరాలుమాత్రం వ్రాసేవాడు. అందులో కొన్నిటికి జవాబు లిచ్చేదాన్ని. నా హృదయం అప్పటికి అర్థంచేసుకున్నాడు. తర్వాత వ్రాయడం చాలించాను. ఆ తర్వాత కొన్ని నెలలకుగాని మేం కలుసుకోలేదు. అదిగూడా ప్రసన్నారావుగారి వివాహంలో. ప్రసన్నారావుగారి నేనేనాడోపోగొట్టుకున్నాను. నేను మధుమూర్తిని చప్పకచేసుకుంటానన్నదృష్టితో

మధుమూర్తిని ఆయనకు పరిచయంచేశాను. ఇక ప్రసన్నారావుగారి విషయం కలలోగూడా అనుకోలేను.అనుకున్నా ఆయనక్షమించరు.

అంతకు వారందినాలక్రితం ప్రసన్నారావుగారినుండి వచ్చిన ఆహ్వానపత్రికలో మా శాంతపేరుచూచి ఆశ్చర్యపడ్డాను. ఆనందించాను. కొద్దిగా ఈర్ష్యగూడా గలిగింది. అందరికీ తెలిసేటట్లు ప్రేమించిగూడా నే నాయన్ను పొందలేకపోయాను. శాంత ఎంతో నెమ్మదిగా కనబడుతూ, లోలోన ప్రేమిస్తూ కడపటికి ప్రసన్నారావుగ్గారిని చేసుకొని ధన్యురాలయింది. ప్రసన్నారావుగారు ఏడాదిక్రితమే యీ సంబంధాన్ని నిశ్చయం చేసుకున్నారట. ఇరుపక్షాల తల్లిదండ్రులా ఒప్పించడానికి ఇంతకాలంపట్టింది.

వివాహం మహావైభవంగా జరిగింది. వైభవమంటే వేలకు వేలు తగులబెట్టారనిగాదు. బంధువులు, ఎంతోమంది స్నేహితులు ఎంతో ఆనందంతో పాల్గొన్నారు. ఆ వివాహంలో అన్నీ నడుంగట్టుకొని చేస్తున్నాడు మధుమూర్తి. అది కులాంతర వివాహమైనా,అక్కడ అంతా ఒకటే అన్న భావమే కనబడుతున్నదిగాని వేరొక భావం కనబడలేదు. నేనొకదాన్నే భిన్నమైన వ్యక్తిని. నాలో సమత్వదృష్టిలేదు గాబట్టి కాస్తదూరంగానే వున్నాను. మా నిర్మలగూడా చాలా హుషారుగా పనిచేస్తున్నది. అది నామాదిరే బ్రాహ్మణపిల్ల అయితేనేం? అంతా ఒకటే అనుకొంది. అంతా తనదిగా చేస్తున్నది. ప్రతిదానికీ మధుమూర్తిని సలహాలడుగుతున్నది. పెత్తనమంతా వాళ్లిద్దరిదేనా అనిపించింది.

వివాహమండపంలో అలంకరించబడిన వధూవరుల చూస్తున్నాను. శాంత ఎంత మనోహరంగావుంది. నేను చాలా ఈర్ష్య

వహించాను. ప్రసన్నారావుగారిని పోగొట్టుకొన్నానుగదా అని దుఃఖం వచ్చింది. రెన్నాళ్ల తర్వాత ప్రసన్నారావుగారినుండి సెలవు తీసికొని బయలుదేరాను మద్రాసుకు.

చెంగల్పట్టుజిల్లా ఇన్‌కంటాక్స్ ఆఫీసరేమీ ముసలాయన కాదు! ఐ. యె. ఎస్ (I.A.S.) పరీక్షలో ఉత్తీర్ణుడై ఈ వుద్యోగం సంపాదించాడు అయిదేండ్లక్రితం. నాఫొటో ఒకటిచ్చి అతని ఫొటో ఒకటి తెప్పించాడు మానాన్న. మనిషి చాలా అందంగా వున్నాడు. తనకు తీరికలేదని నన్నూ మానాన్ననూ చెంగల్పట్టు వచ్చిపోవలసిందిగా కోరాడు. మేంవెళ్ళాం. పెద్దఆఫీసరు మరి! అట్టహాసంగావుంది కతంతా. ఎంతోమంది ప్యూన్లు! ఎంతోమంది గుమస్తాలు! చాలాదర్జాగావుంది. నిజంగా అతన్నే. చేసుకుంటే అంతా మనచేతనేనడుస్తుంది. అందరుప్యూన్లు రోజూ సలాంకొడుతూ మనఆజ్ఞల శిరసావహిస్తారు. నాకు ఒకగదియేర్పాటుచేయించాడు. మానాన్నకు ప్రక్కనేవున్న చిన్నగదియేర్పాటుచేయించాడు. నాగదంతా అతివేలమనోహరంగావుంది. దేవతాస్వాగతార్థం అలంకరించినట్లుగావుంది. నేను దాన్నిచూచి మురిసిపోయాను. ముందే ఆయన అందానికి ఆకర్షింపబడ్డాను. ఆదర్జాచూచి సెబాస్ అనుకున్నాను. ఈఏర్పాట్లుచూచి మనసులో ఎన్నెన్నో కోరికల పెంపొందించుకున్నాను.

సాయంకాలం టిఫిన్‌పుచ్చుకున్నాక చాలాచాలావిషయాల గురించిమాట్లాడుకున్నాం. మానాన్నను అసలు పలకరించలేదాయన. ఒకప్యూన్‌గా చూస్తున్నాడంతే! నాకది నచ్చకపోయినాఒకమోస్తరుగా సరిపుచ్చుకున్నాను.

రాత్రి భోజనానంతరం మానాన్నను సినీమాకు ప్రోగాపం పించాడు. మేమిరువురమూ కారులో పార్కు_కెళ్ళాం. అప్పటికీ తొమ్మిదిగంటలుదాటింది . పార్కు_లో యెవరూలేరు. అదే మంచి దనిపించిందినాకు. మేము వివాహాన్నిగురించి చాలాచాలా విష యాలు ముచ్చటించుకుంటున్నాం. పరస్పరం ఇష్టంగలిగి ముచ్చ టించుకుంటున్నాం. సువాసనలతోను చల్లనిగాలితోను నిండినవాతా వరణం ఒకమో_స్తరు మ_త్తెక్కి_స్తున్నది. మేమిద్దరమూ కొంత కాలంక్రితమే స్నేహితులమయినట్లుగా భావిస్తున్నాను. మాట్లా డుతూ మాట్లాడుతూ అతను నాచేయిపట్టుకున్నాడు. నేను విడిపిం చుకో ప్రయత్నించలేదు. అట్లాతాకుతూనేకూర్చున్నాం. నాలో ఎడ తెగకుండా విద్యుత్ప్రవాహం ప్రవహిస్తూవున్నది. నాశరీరం మ_త్తె క్కి_నట్లయింది. శరీరం కామానుభవానికి సుముఖత్వం చూపుతు న్నది. అతను మావివాహానంతరం మాజీవితం యెట్లా వుండబో తుందో, ఎట్లావుంటే బాగుంటుందో_ ఇట్లాంటివిషయాలు చెప్పుకు పోతున్నాడు. మావివాహం జరిగినట్లేభావిస్తూ ఆమాటలు అస్ప ష్టంగావింటూ పారవశ్యంలో వుండిపోయాను.

నాస్థితి జాగ్రతగా కనిపెడుతూనేవున్నాడతను. నేనుసోలి పోతూవుండడం చూస్తున్నాడతను. అక్కడనుండిలేద్దాం అన్నాడు. బయలుదేరాం. నేనునాగదిలో ప్రవేశించాను. అంతాఘుమఘుమలు. ఆయనగదికీ నాగదికీమధ్య తలుపువుంది. తనగదితలుపులుబిగించి మధ్యతలుపులు తెరచుకొని నాగదిలో ప్రవేశించాడు. ఎంత మధు రాకారంతోవస్తున్నాడు! వచ్చి నాగదితలుపులుగూడా బంధించి దగ్గరగా_నామంచం దగ్గరగా_నాయెదకుసమీపంగా కుర్చీలాక్కొ_ని

కూర్చున్నాడు. లేవబోయిన నన్ను అట్లాగేపడుకోమన్నాడు. వివాహం వెంటనేజరిగించడానికి మీకేమయినా అభ్యంతరాలున్నాయా? అని అందుకున్నాడు. మాట్లాడుతూనే నామెడతాకాడు. కపోలాన్ని స్పర్శించాడు. శరీరం ముద్దగట్టుకొనిపోయింది నాకు. వివశనైపోయాను. అతను నన్నులోబరచుకున్నాడు. నేను లొంగిపోయాను.

మైకంవదిలినాక నాగుండెలు వేగంగాకొట్టుకోడం మొదలు పెట్టాయి. అజ్ఞురాలినిగా వున్నపుడూ విజ్ఞురాలినిగా వున్నపుడూ కూడా ఒకేమోస్తరుగా ప్రవర్తించాననుకొని ఖేదపడ్డాను. వివాహమైనతర్వాత కామకార్యం జరగాలేగాని ముందుగాజరిగితే ఆస్నేహం వివాహంవఅకూరావడం చాలవఅకూ సందేహం. అదిగూడా నన్నొకమూల బాధిస్తూనేవుంది.

ఉదయంఅయింది. మానాన్న యెక్కడోయెవరోగావున్నాడా యింట్లో. ప్యూన్‌హోదాలోవుండిపోయాడు. వాళ్ళుచెప్పినట్లుగా ప్రవర్తించుకుంటున్నాడు.అదయినా తనకు గొప్పగానేవుంది. బాధ వదిలిందనుకొని సంతోషిస్తున్నాడు. ఆసమయంలోనే ఒకముసలి ప్యూను నన్నుచూచి నిన్నైన్నా "మోసగిస్తే మోసగించాడు. పెండ్లాడితే బాగుంటుంది తల్లీ" అని కనికరిస్తూవెళ్ళిపోయాడు. నామస్తిష్కంకాస్త చురుగ్గా పనిచేయడం మొదలుపెట్టింది. నేను మోసగింపబడ్డానేమో అన్నభావానికి అంకురార్పణజరిగింది.

ఉదయం యేడుగంటలకే ప్రయాణసన్నాహాలుచేస్తున్నాడా ఫీసరు. నిన్నగాని, రాత్రిగాని, పలుకరించినంత ఆదరంతో పలుకరించడంలేదు. నన్నుపిలిచి "నేను అర్జెంటుపనిమీద వెళ్తున్నాను. మీరు మద్రాసుకుపదండి నేను మీఅడ్రసుకు అన్నివివరాలూవ్రా

స్తాను." అన్నాడు. ఆచెప్పేధోరణిలో తప్పించుకొనేధోరణినాకు చూచాయగా తట్టింది. నన్నునేను విమర్శించుకొంటూ నిలువుట ద్దంలో చూచుకున్నాను. ఎంతోనలిగినట్లు కనిపించాను.నాపైననాకే రోతకలిగింది. ఎంతోతప్పుచేశానని దుఃఖించాను.

మద్రాసుచేరాను. నిరీక్షిస్తూకూర్చున్నాను. హృదయంలో ఆందోళనగావుంది. రెండురోజులుబాధపడినాక నిరీక్షించినకవరు అందింది. కొంతకుతూహలంతో-కొంతసందేహంతో కవరుచిం చాను. అతనిమోసానికి గుండెలుపగిలిపోగా అట్లాగేచప్పచల్లారిపో యాను. తెప్పరిల్లగానే భయంపట్టుకొంది. గర్భంవస్తుందేమోఅన్న భయం గలిగింది. ఆభయం అనుక్షణమూ ఒక పిశాచంలాగా బాధించడం మొదలుపెట్టింది. ఒకవేళ ఏదయినాఅయితే మాస్నే హితులముందు తలెత్తుకునితిరుగుతానా! ప్రాణంవదలాల్సిందేగాని. భగవంతుడు కరుణించాడు. శిక్షపైనశిక్షవేయకుండా బ్రదికించాడు.

చెంగల్పట్టునుండిదిగిననాటి సాయంకాలమే మధుమూర్తి కనిపించాడు. అతన్ని ఆప్యాయనంగాఆహ్వానించాను. కానిఅతను నన్ను ఎగాదిగాచూచి కొద్దిపాటి అవహేళనగా "బాగానలిగినట్టు న్నావే" అన్నాడు. ఆమాటవిని ఉలిక్కిపడ్డాను నేను. అంతా చూచినమనిషి వేసినప్రశ్నలాగావుందది, గుమ్మడికాయబదొంగలా గాభరాపడ్డాను.

ఒక కొన్నాళ్ళు రామకృష్ణామఠం దప్ప ఎక్కడికీవెళ్ళే దాన్నిగాదు. ఏకాంతంగా కూర్చుంటే ఏవేవో దృశ్యాలలో పాటు చెంగల్పట్టు దృశ్యంగూడా మనోనేత్రపథంముందు తిరిగేది. భయమూ, జుగుప్స కలిగేవి మనసులో. వివాహం ఇక కాదేమో

అనే భయం కలిగేది. కాకపోతే వుండలేనేమో అన్న ఆశక్తత హృదయాన్నావేశించేది.

నెలదాటగానే మామూలు స్థితికొచ్చాను. ఇతర్లకంట పడకుండా పాపాన్ని పరిహారంచేసుకున్నానని ధైర్యం వహించాను. నిర్మల వచ్చిందని ఒకసాయంకాలం నాకు పిలుపు వచ్చింది ప్రసన్నారావుగారి నుండి. శాంతపిలుపుమీదా-అయ్యవారి ఆహ్వానం మీదా-వచ్చిందట నిర్మల. నాన్నాళ్ళుండి మద్రాసు చూచిపోతుందట! నన్నుచూచి "అట్లా చిక్కిపోయావేమిటే!" అన్నది. సకాలంలో వివాహం కాకపోతే అంతే లెమ్మన్నది శాంత. ఆనాటంటా అక్కడే వుండిపోయాను. వాళ్ళతోపాటు కులాసాగా భోంచేసి కులాసాగా కబుర్లాడుకున్నాం.

మరునాడేదో మాట్లాడుకుంటూవుండగా ఉద్యోగాలవిషయం వచ్చి బ్రాహ్మణాబ్రాహ్మణ సమస్యవచ్చింది. మళ్ళా చర్చలోపడ్డాం. నేనూ శాంతా మధుమూర్తి నిర్మలా వాదించుకుంటూవుంటే ప్రసన్నారావుగారుగూడా అందుకున్నారు. ప్రసన్నారావుగారి ధోరణివేరు. నిదానంగా మాట్లాడతారు గాబట్టి ఒప్పుకోవాలనిపిస్తుంది. ఆయన అన్నదేమంటే "తప్పును తప్పుగా అందరూ ఒప్పుకోవలసిందే! ఎవరో ఆక్షేపించారని ఉడుక్కుంటే ప్రయోజనం యేమున్నది? అందులో సత్యమెంతో అసత్యమెంతో చూచుకోవాలి." అన్నారు. అందుకు నిర్మల "నిజంగా అట్లాగే చూడాలి, చూడు హసంతీ! నీవు యింత వాదించావుగదా! నిజంగా తప్పు మన బ్రాహ్మల్లోనే యెక్కువవున్నది. అబ్రాహ్మణులు మనపైన నేరం మోపడానికి ఎంతైనావున్నది. అసమత్వంతో చూచేది మన

మౌనాకాదా? అందుకు, అసమత్వంతో చూస్తారెందుకు అని వాళ్ళంటే మనం కోపపడుతున్నాం. అమర్యాద చేసేదిమనం! కులంపేరుతో-కులాధిక్యతతో మనం వాళ్ళను యెటువంటివారినైనా తక్కువగా చూస్తాం- మనసాటివాడు, మనకంటే యెక్కువ గుణాధికతా-విద్యాధికతా-శుచీశుభ్రతా-కలిగివున్నా - ఇంట్లోకి రానివ్వం. అథవా వచ్చినా సాధారణంగా సమ మర్యాదతోచూడం; భోంచేస్తే సాధారణంగా విస్తరియెత్తం. మన కులంవాడనబడేవాడు ఎట్టి నీచుడైనా వాడింట్లోకి రావడానికి అడ్డులేదు. వాడు తిన్న ఆకు యెత్తడానికి మనకూ అడ్డులేదు. ఏదయినా ఉద్యోగాని పది ఖాళీలు ప్రకటిస్తే-అవన్నీగూడా మనకు రాలేదనీ-అర్హతల సరిగా చూడడంలేదనీ-అర్హతలేనివాడుగూడ గోలపెడుతున్నాడు. మీరు ఎంతోమందికి విద్యాబోధచేస్తున్నారు. మనం అందరితోనూ కలిసి చదువుకున్నాం. మన బ్రాహ్మలంతా మంచి మార్కులు తెచ్చుకుంటూవచ్చారా? ఎంతమంది మార్చిసెప్టెంబరులు చూచినవారు? "తెలివాకరిసొమ్మా బెస్తగుర్రమ్మా" అన్నారట యెవరో-ఏవిషయంల్లో తీసుకున్నా, మనల్ని ఆక్షేపించడానికి అబ్రాహ్మణులకెన్నయినా కారణాలున్నాయిగాని, మనకులేవు. మనకున్నదల్లా వాళ్ళు మనల్ని అంటున్నారని, లేదా ఉద్యోగాలలోను విద్యాలయాల్లోనూ పోటీకివస్తున్నారని! అంతేనంటావా?" అన్నది.

నిర్మల చెప్పింది నిజమే అనిపించింది. ఆమాటలే ఏ మధుమూర్తో మరొకరో చెప్పివుంటే ఒప్పుకోలేపోయి వుండేదాన్నేమో! నిర్మల చెప్పింది కాదనలేకపోయాను. ప్రసన్నారావుగారు అంటున్నారు మరలా.

"బ్రిటీషువారు మన దేశానికి రాకపూర్వం కేవలం అజ్ఞానం తాండవిస్తూవుండేది మెజారిటీజాతుల్లో. ఉన్నదున్నట్లుగా స్వీకరిస్తూ వచ్చారేగాని అదట్లా యెందుకున్నదని యెవరూ అనుకోలేదు. బ్రాహ్మణుడు సకల నీచగుణాలకూ పుట్టఅయినా స్వామీ అంటూ గౌరవించవలసిందేననీ - భూసురులుగాబట్టి పూజించవలసిందేననీ నమ్మేవారు. అట్లా నమ్మి ఆచరించకపోతే బ్రాహ్మణుల దగ్గర పొగడ్తలందుకుంటూవుండిన రాజులు శిక్షించేవారు. బ్రాహ్మణత్వం ఏనాడోపోయింది. అంతశ్శుద్ధి భారతకాలానికి ముందే అంతరించింది. బాహ్యశుద్ధిగూడా క్షీణించడం మొదలుపెట్టింది. బ్రిటిషు వాళ్ళు వచ్చాక వాళ్ళకు వాళ్ళభాషలోనే పాలనా వ్యవహారాలు సాగించవలసి వచ్చింది. కొంతమంది గుమాస్తాలు కావలసి వచ్చారు. ఇంగ్లీషుబళ్ళుపెట్టారు. అంతకుముందు ఏజాతి అయితే విద్యను గుత్తకుగొనివుండినదో ఆ బ్రాహ్మణజాతి ఇంగ్లీషువిద్యను త్వరగా గ్రహించింది. దానికి ప్రతిఫలంగా దాస్యవృత్తి లభించింది అంటే గర్హనీయమైన దాస్యవృత్తి-అంటే సేవకావృత్తిని-ప్రప్రథమంగా స్వీకరించినవారు బ్రాహ్మణులు. ఇపుడావిద్యకూ, ఆ సేవకావృత్తికీ అబ్రాహ్మణులు పోటీవస్తున్నారని ఈర్ష్య. నిస్సారమైన యెముకలకోసం కుక్కలు కొట్లాడుకున్నట్లు ఈ సేవకావృత్తి కోసం అహమహమికతో పోటీపడి ఒకరొకరు నిందించుకుంటున్నారు." అన్నారు. ఆలోచిస్తే అదంతా నిజమని తోచింది.

అవిషండుగరోజులు గాబట్టి ఆమూన్నాళ్లూ అక్కడేగడిపాం. హాయిగానే నడచిపోయింది కాలం. ప్రసన్నారావు శాంతల జీవితం నాకు ఈర్ష్య కలిగించింది. నే నుండవలసిన స్థానంలో

శాంతవుంది. శాంత తెలివైంది. నేనే తెలివిలేకుండా ప్రవర్తించాను. వివాహం చేసుకొని తీరాలని బుద్ధిపుట్టింది. మధుమూర్తిని అడగాలని అనుకున్నాను.

నాలుగోనాడు నేను వెళ్ళేముందు శాంత అడిగింది "నీవెక్కడికో పెండ్లిచూపుల కెళ్ళావట" అని. "నీ కెవరు చెప్పారు?" అని అడిగాను. "మధుమూర్తి" అని జవాబిచ్చింది. "అతనికెట్లా తెలుసు" అన్నాను. అది అతన్నే అడగమంది. "తుమ్మెద పుష్పం దగ్గరకొస్తే పుష్పానికి విలువగాని తుమ్మెదకోసం పుష్పం వెళ్ళడమేమిటే" అంది నిర్మల.

ఇల్లు చేరగానే మధుమూర్తికి జాబు వ్రాశాను. దానిలో అతని యెడబాటు కోర్చుకోలేననీ ఆతని శరీర సాన్నిహిత్యం వల్లనే నా మనశ్శరీరాలు రెండూ స్వస్థత వహించగలవనీ, ఎంత త్వరలో వీలయితే అంత త్వరలో వివాహమాడవలెననీ, ఈజాబు అందగానే నాతోవచ్చి మాట్లాడవలసిందనీ-వ్రాశాను. అది పోస్టులో వేశాను. మధుమూర్తి రాలేదు. కాని మరునాడుదయం మధుమూర్తి నుండి జాబు వచ్చింది. సంతోషంతో చించాను. కొన్నాళ్ళనుండీ నా నుండి అతనికి ఆహ్వానంలేదు. తిరస్కారమేగాని పురస్కారం లేదు. అందుకే మొగమోటమిచేత అతనితో ఈ విషయం మాట్లాడలేక వ్రాశాను. అతను సంతోషించి రావలసినవాడు. రాలేదు. అయితే జాబు వ్రాశాడు, విప్పాను. దాంట్లో—

"హాసంతీ! తెలియనితనంలో చేసిన పాపానికి నిష్కృతి వుంది. తెలిసి చేసినపాపానికి నిష్కృతిలేదు నిన్నుగురించి మోహన్‌కుమార్ నాకేనాడో జాబు వ్రాశాడు. నేను నిన్ను పెండ్లా

డాలని అనుకున్నవాణ్ణిగాబట్టి నిన్ను గురించి సర్వస్వమూ తెలుసు కోవలసిన అవసరం నాకున్నది. ఏ పురుషుడైనా ఈవిధంగానే తెలిసికోవాలనుకుంటాడు. కొందరీపనిచేయలేరు. కొందరుచేస్తారు. నేను అన్నీ కనుగొన్నాను. నీ కళంక చరిత్ర నాకుబాగాతెలుసు. అయినా అది అజ్ఞానవయస్సులో చేసినపని. వాతావరణప్రాబల్యంలో, తెలియని ఉద్రేకంలో-చేసినపని అది! అందుకనే నేను దానికి ప్రాధాన్యమీయకుండా ప్రేమించాను. కులాంతర వివాహమనే ఆదర్శంకోసం నిన్నే వివాహమాడాలనుకున్నాను. ఈవర్ణవ్యవస్థ అనే విషవృక్షానికి వేరుపురుగు కావాలని కాంక్షించాను. మొదట నీవు సమత్వవాదినివిగా కనిపించావు. తర్వాతతర్వాత మారావు. ఎవర్నయినా నేను సమదృష్టితో విమర్శించాను. నాది పాక్షికదృష్టిఅనీ-బ్రాహ్మణద్వేషి అనీ అన్నావు. "ఏం, బ్రాహ్మణ ద్వేషి' అయితే మహాపాపమా? సంఘంలో సమత్వం రావడానికి బ్రాహ్మణవాదం అడ్డుగావున్నదంటే నిందించగూడదా? విమర్శించగూడదా? ఆర్థికరాజకీయవిషయాల్లో కాపులను, కమ్మలను, తెలగలను, ఇట్లాంటివారిని విమర్శించినపుడు, నీవెపుడన్నా కాపద్వేషి అనీ, కమ్మద్వేషి అనీతెలగద్వేషి అని అన్నావా? లేదు. మీ జాతి నొక్కదాన్నే అనగూడదనీ దాన్నంటే పాపమనీ మాత్రం నీ అభిప్రాయంగాబోలు! నీవు చక్కబడతావనీ, కాలంసర్వౌషధమనీ నేను ఓపికపట్టాను నీదృష్టిలోనిమార్పుగూడా కనిపెడుతూవచ్చాను. నేను యూనివర్సిటీలో వున్నంతకాలం నాధర్మాన్ని నేను నిర్వర్తిస్తూవుంటే నీ ధర్మాన్ని నీవు విరుద్ధంగా నిర్వర్తిస్తూవుండేదానివి. నేను నీకు చాలాంతో వ్యవధి ఇచ్చాను. ఆ వ్యవధికాలంలో చక్కబడతావను

కున్నాను. ఇంకా బిర్రబిగిసిపోయావు. కుల విషయంలో నానాటికీ పాషండురాలివయిపోయావు.

నిజమే! నీ కనిపించివుంటుంది ఆకులంలో అతన్ని పెండ్లాడి వాళ్ళతో యెట్లాకలిసి వుండడమని; వ్యక్తిస్థానాన్ని గుర్తించలేకపోతున్నావన్నమాట! మన మాదిరే యెంతోమంది ప్రేమించుకున్నారు. అందులో కొంతమందయినా పెండ్లాడారు. వాళ్ళందరూ కాకపోయినా కొందరయినాహాయిగావున్నారు. ఆకొందరూ హాయిగా వుండకపోవడానికి కారణం వాళ్ళేమాత్రమూగాదు. సంఘం! వీళ్ళంతా కుక్కలమాదిరి వాళ్ళపైపడి నానా హింసలూ పెడతారు. హింసలు పడడానికి కాదుగదా పెండ్లాడేది! అవి కొన్నిసార్లు వీళ్ళబంధాలు తెగగొట్టేస్తాయి. లేదా పరస్పరం నేరారోపణలు చేసుకొనేటట్లుచేసి సంసారాన్ని బాధాపూరితంచేసేస్తాయి. ఆ విధంగా అయ్యేవరకూ తరిమిన సంఘం అపుడు వేలెత్తి "అదిగో! అదిగో! చూడండి; ప్రేమించి పెండ్లాడినవారేమయ్యారో" అంటుంది. వీళ్ళెన్నిచేసినా కొందరు తెలివిగలవారు హాయిగానే జీవిస్తూ వుంటారు. ఆర్థికంగా ఒకడికీ లొంగివుండకపోతే అందరూ మనకు దాసులే అవుతారు. అంతేకాని మనల్ని వెలివేసి యేదో చేస్తాంఅని బెదిరించలేరు. నీవునీకులాధిక్యతను చూచుకొని అనవసరంగా బెదిరావు. నన్ను నీకంటే తక్కువవాణ్ణిగాభావించావు. ఆ విధంగా భావించడంలోవున్న నీ తక్కువతనాన్ని గుర్తించుకోలేదు.

అవన్నీ అట్లావుంచు! నీవు మద్రాసువచ్చింతర్వాత ఎట్లా ప్రవర్తించావో గుర్తుకుతెచ్చుకో. నేను నీకోసం నిరీక్షిస్తూవుంటే,

నీవు ఇతర్లకోసం ప్రతీక్షించడం మొదలుపెట్టావు. వివాహమాడ నని ఒకప్పుడన్నావు. బ్రహ్మచారిణిగా వుంటాననిగూడాఅన్నావు. బ్రహ్మచారిణీత్వానికి ఏనాడో తెలియనితనంలో ఒకసారి తిలోదకా లిచ్చావు. తెలివిగలిగినతరువాత చెంగల్పట్టులో మరొకసారి ఆ మంత్రాన్నే పునశ్చరణచేశావు. నేనూ ఒక విద్యాధిక స్త్రీనని ప్రాణాలుపెట్టుకొని బ్రదుకుతున్నావు. నీకులాధిక్యత ఇట్లాంటి పనులు చెయ్యమని ప్రోత్సహించిందా ? సిగ్గు లేకుండా భయం లేకుండా నాదగ్గరికి సాహసించి పెండ్లాడతానని వస్తున్నావా ? చదువుకున్న స్త్రీ సంఘానికిచూపే ఆదర్శమిదేనా ? నిష్కల్మషంగా నీప్రేమకోసం నిరీక్షిస్తున్న నాకు నీవర్పిస్తున్నది ఆత్మవంచనతోడి హృదయమూ-కలుషితమైన శరీరమూనా ?"

జాబు చదివాను శరీరమంతా అచేతనమయిపోయింది. మనసు సంకల్పవికల్పాలు కట్టేసింది.

౮

నాజీవితంమీద మళ్ళావకసారి విరక్తి జనించింది. అన్ని దారులూ మూసుకపోయినట్లుగా భావించాను. సుఖంగా జీవించే యోగ్యత ఇకలేదనిపించింది.

వేసవిలోనాకందిన ఆహ్వానపత్రికలోనిర్మలామధుమూర్తులు వధూవరులుగాచిత్రింపబడివున్నారు. ఆపత్రికలోనామనసు లయించి పోయింది. అట్లాగే దానితట్టు చూస్తూనే ఎంతసేపోకూర్చుండిపో యాను. ఎన్నెన్నో ఘట్టాలు ఒకదానివెనుక ఒకటి స్మృతిపథంలోకి రావడం మొదలుపెట్టినయ్. అనుగుణంగా ధారలుకట్టి కన్నీరు కూడా కారడం మొదలుపెట్టింది.

మధుమూర్తిని పోగొట్టుకున్నాను. శాశ్వతంగా పోగొట్టు కున్నాను. నేనెంతో అజ్ఞానంతో ప్రవర్తించినట్లూ అన్యాయంచేసినట్లూ అపుడు తెలుసుకున్నాను. చేజారిపోయినతర్వాతనే కన్ను తెరుస్తూ వుంటారుమానవులు. అపుడే ఆవస్తువుయొక్క అసలువిలువతెలు స్తుంది. ఎంతవిలువైనవస్తువయినా అది మనఎదురుగా-మనకోసం వున్నంతకాలం దాన్ని గౌరవంగాచూడము!

నేను మధుమూర్తివివాహానికివెళ్ళేను. వెళ్లానేగాని ఆవాతా వరణంలో వుండలేకపోయాను. శాంతాప్రసన్నారావులు, నిర్మలా మధుమూర్తులు, వీళ్ళమధ్య నేను అపరాధినిలాగా భావించుకు న్నాను. అవును! నేను అపరాధినినిగాకపోతే ప్రసన్నారావుగారి ప్రక్కన శాంతవుండడానికి వీలులేదు. ఒకవేళ అట్లా గాకపోయినా మధుమూర్తిప్రక్కన నిర్మల వుండడానికి వీలులేదు. వాళ్ళు ఎంత సర్దాగావున్నారు. ఆవేసవంతా నన్ను వాళ్ళదగ్గిరే వుండమన్నారు. వాళ్ళకు కులాసాగావుంది. నామనసులోబాధవాళ్ళకెట్లాతెలుస్తుంది! నేను రెన్నాళ్ళుగూడా వుండలేక వచ్చేశాను.

వాళ్ళంతా ఎంతహాయిగావున్నారు! ఎంతప్రేమమయజీవి తాన్ని గడుపుతున్నారు! పూర్వజన్మలో నేనేజంటను విడదీశానో!!

మానాన్నబాగా ముసలివాడయ్యాడు. పైగా మనోవ్యధ. భార్యవిషయమూ, కూతురివివాహవిషయమూ ఆయనమనస్సును అనుదినమూ బాధపెట్టసాగినయ్! సరిగ్గా తిండిగూడా తినకుండా ఆలోచిస్తూ కూర్చునేవా డొకొక్కసారి. ఒకొక్కసారి మధు మూర్తికేచేసివుంటే బాగుండేదనీ తాను మమ్మల్నవిడదీసి పాపాన్ని మెడకుతగిలించుకున్నాననీ దుఃఖించేవాడు. చేతులుకాళ్ళు [illegible]

పట్టుకొనే ఇట్లాంటిరకాలుకోటానకోట్లు ఈప్రపంచంలో! ఈదుఃఖం తో ఆయన బాగానీరసించిపోయాడు. తర్వాత వంటపనిగూడా నా పైన్నేపడింది. కడపటికి ఒకముసలమ్మను తెచ్చుకున్నాను. ఆమె మడితో మడిపేరిటచేసే అశుభ్రతతో నాకు తలవాచిపోయింది. నిరాశావాదంఒక్కొక్కసారినాలోవిజృంభించి ఆముసలిదానిపూర్వా చారంపై దండెత్తేవాన్ని. ఏదో మొదట్నుండీ అలవాటుపడిన వాళ్ళంతల్లీ అంటూ మెత్తగాజవాబు చెప్పేది. ఆమె మెత్తదనాన్ని చూచి నమ్మకంతో ఇంటిపెత్తనమంతా యిచ్చేశాను. దొంగచాటు గా కూడవేసి బంధువులకు పంపడం మొదలుపెట్టింది. మూన్నాళ్ల కొకసారి అజీర్తిబాధతో పడుకుంటూవుండేది. విసిగిపోయి తరిమే శాను. నేనే చేసుకోడం మంచిదనిపించింది.

రాత్రులు నాకుసరిగా నిద్రపట్టదు. మనసు పరిపరివిధాలా పోతుంది. శరీరం కామావృతమౌతుంది. నరాలబాధ జనిస్తుంది. వివాహంపైకి-అన్యలింగసమాగమంపైకి-మనసు పోతుంది. నిస్స హాయతతో యేడుస్తాను. కానిప్రయోజనం?

నామాదిరి యం.ఏ. ప్యాసయినవాడే కావాలనుకున్నమాట నిజమే: యెవడుదొరుకుతాడు? పోనీ కాస్త తక్కువగావున్నా ఫరవాలేదనుకున్నాను. కాని వచ్చేవాడులేడు. కొంచెంచదువుకున్న పిల్లను చేసుకోడానికి జంకేయువకుడు అంతచదువుకున్నదాన్నీ- వయసుమీరవన్దాన్నీ-జీవితవిషయంలో కొన్నికొన్నినిశ్చితాభిప్రా యాలు కలదాన్నీ-పైగా ఉద్యోగంచేస్తున్నదాన్నీ-చేసుకుంటాడా? తనకంట్రోల్లోవుండదని సాహసింపడు.

వివాహవిషయం బండయిపోయింది. వివాహం కాదేమో అన్నభయం యెక్కువయింది. ఆభయంకలిగేకొద్దీ వివాహంపై ఇచ్ఛ ద్విగుణీకృతం త్రిగుణీకృతం కావడం మొదలుపెట్టింది కోరికలు విచ్చలవిడిగా సంచరించమొదలిడినవి. శరీరమంతా అదొకమోస్తరు తీయని బాధతో చిరపరలాడసాగింది.

ఇదేవిధంగా మరికొన్నేండ్లు గడిచినవి. నన్ను గవర్నమెంటులోకి తీసుకున్నారు. అనంతపురానికి వేశారు. అక్కడ ఒక యింట్లో-చిన్న పోర్షనులోచేరాను ప్రక్కవాటాలో వున్నవారు అబ్రాహ్మణులు. ఆ యిల్లుగూడా అబ్రాహ్మణులదే! బ్రాహ్మణులు అబ్రాహ్మణులకు సాధారణంగా యిండ్లివ్వరు. వాటా (Portion) అయితే మరీకఠినం. మళ్ళా బ్రాహ్మణులు వెళ్ళి అబ్రాహ్మణుల యిండ్లల్లో వుండగలరు. ఈ మనఃప్రవృత్తి వీళ్ళను వాళ్ళు ద్వేషించడంలో ఒక కారణంగూడా అవుతుంది. వాళ్ళు మాంసాదులు వండుకుంటారని వీళ్ళవాదం. మనం తిననిది వాళ్ళుతింటారని అసహనం. అంతకంటే యేమీలేదు. లేకపోతే తిండి విషయంలో ఉచ్చనీచాలేమున్నాయి? జీవహింస అని అందామా, అన్నీ జీవహింసతో కూడుకున్నవే! మాంసాహార శాకాహారములురెండూ జీవహింసాయుక్తములే! అధికము అల్పము అన్న భేదముతప్ప-రెండింటిలోనూ హింసవున్నది. అసలు ప్రకృతిలోనేహింసవున్నది. పెద్దచేప చిన్నచేపను మ్రింగాలి. ఒకమృగం మరొకమృగమాంసమును తిని జీవిస్తున్నది. శాకాహారులు జీవిస్తున్న చెట్లకొమ్మలు విరిచి ఆకుకూరలు తింటున్నారు. పండి, ఎన్నోవిత్తనాలుగలిగి, ఎన్నో తనవంటి వృక్షాల పెంచగలిగిన కాయను కోసుకొని తింటు

న్నారు. చెట్లకుగూడ బాధవుంది. సంతోషంవుంది. దుఃఖంవుంది. కాబట్టి శాకాహారులు మాంసాహారులకంటే గొప్పఎట్లా అవుతారో వాళ్ళేవూహించాలి. హింస హింసే! అది పెద్దదయినా, చిన్నదయినా దాని స్వభావంఒకటే! ఇకమీదటనయినా ఈ శాకాహార మాంసాహారభేదం సన్నగిల్లుతుందని భావిస్తాను.

మా ప్రక్కవాటాలో వున్నవారు భార్యాభర్తలూ ఇద్దరు బిడ్డలూను. ఒకమగపిల్లవాడు ఒక ఆడపిల్ల. అంతే! ఆ భార్యాభర్తలు ఎంత ఒద్దికతోవుంటారు! ఒకర్ని విడువలేక ఒకరు వాళ్ళుంటే, ఒకరికోసం ఒకరు వాళ్ళంతపడి చస్తూంటే నా కటువంటి ప్రాప్తం లేకపోయెగదా అని దుఃఖించేవాన్ని. ఆ పిల్లల్ని ఎంతో ముద్దుగా చూచుకొనేవాన్ని. ఎంతచూస్తే యేముంది? పరాయి పిల్లలు పరాయి పిల్లలే! ఎప్పుడయినా ఆ యిల్లాలికి భర్తపైనా పిల్లలపైనా విసుగు వచ్చినపుడు "మీకతే మేలండి! హాయిగా ఏపీడా లేకుండా వుంటున్నారు!" అని అనేది. మొదటి రోజుల్లో అయితే నిజమే అనేవాన్నిగాని, అపుడు ఎంతోసానుభూతితో "నేను సుఖంగా వుంటున్నానని మీరూహిస్తున్నారా?" అనేవాన్ని. ఇరుపాట కాసేపు చర్చగూడా చేసుకొనేవారం. ఒకనాడిట్లాగే చర్చవచ్చినపుడు ప్రక్కింటి అమ్మాయివున్నది. కొంత వరకూ చదువుకొన్నది. భర్త ఒకక్లర్కు. హక్కులకోసం పోట్లాడేపిల్ల. అంతకుముందునాడే సాయంకాలమే భర్తతో హక్కుల విషయం పోట్లాడిందట! ఆ విషయమంతా చెప్పుతూ "చూడండీ! కాళ్లుమొగమూ కడుక్కొని ఆ కుర్చీలో నిర్లిప్తంగా పడిపోయే ముందే ఆ పేపరెక్కడుందో చూస్తే వెదుక్కొని కూర్చోగూడదూ!

అందులో కూర్చొని నేనెంత పనిలోవున్నాసరే వచ్చి అందివ్వాలట! ఇట్లాంటివే యెన్నో! ఆవిధంగా నేనెందుకందివ్వాలి? అట్లా అందిమ్మనడంలో ఆధిక్యభావంలేదా? తనకోసం నేను పరుగెత్తి పనులు చేయడంలో న్యూనతాభావంలేదా! మరి స్వతంత్రమెక్కడ" అంది. అందుకు వెంటనే పొరిగింటామె అంది-"అది పొరపాటమ్మా! అసలావిధంగాచేయడంలో స్వతంత్రత, ప్రీతి, లేవంటావా? అదొకబాధ్యతగా యెందుకుచేస్తావు? అదొక ధర్మంగా ప్రేమభావంతో చెయ్యి. అందులో న్యూనత యెందుకు కనిపిస్తుంది? నీవాపనిచేసేటప్పుడు ఎమటివ్యక్తి ఆధిక్యభావానికి దాస్యంచేస్తున్నావో ప్రేమభావానికి ప్రతి.గా చేస్తున్నావో చూసుకో! అలిసి వచ్చిన పురుషుడు ఆవిధంగా అడగడంలో ఆధిక్యభావం నీకెట్లా కనిపించింది? అటువంటప్పుడు నీవు మాత్రం అతనికి సాయపడటం ధర్మంగాదా! ప్రియంగాదా?" అని. ఆమాట వినగానే ఆ అమ్మాయి జ్ఞాననేత్రం తెరువబడినట్లు ఆ అమ్మాయి మొగంలో నేను కనిపెట్టాను. ఆ అమ్మాయి పడిన అపార్థంలో ఈనాటికీ చదువుకున్న చాలమంది స్త్రీలు పడుతూవుంటారు.

ఒకనాడు ఆయిల్లాలికి జ్వరంవచ్చింది. వెంటనేఆమెభర్త సెలవుపెట్టేశాడు. పెట్టి యెంతోశ్రద్ధతో మందులిప్పించాడు. ఆమెకు బాగుకాగానే కొండంతవిపత్తునుండి విముక్తుడయినట్లుగా భావించి ఆనందించాడు.

నాకు తర్వాత ఒకనాడు జ్వరంవచ్చినప్పుడు మానసికంగా గూడా ఎంతోబాధపడ్డాను సెలవుపెట్టి పడుకున్నాను. మందుతెచ్చిచ్చేదిక్కు గూడాలేదు. మానాన్న చనిపోయి కొంతకాలమయింద

ప్పటికి. వంట నేనే చేసుకుంటూవుండేదాన్ని. ఇపుడు దిక్కెవ్వరు "ఎటువంటిపరిస్థితి కల్పించావురాస్వామీ" అని దేవుణ్ణి తిట్టుకొ న్నాను. మరలా క్షమించుస్వామీ అని నమస్కారం చేశాను. ఆచేతులతో మొగంగప్పి అట్లా వాటిని పైకెత్తిచూచుకున్నాను. నాయెడమచేతితట్టు దృష్టిపోయింది. ఆచేతినే ఒకనాడు మధుమూర్తి చేతిపైవేసి సాముద్రికం చెప్పమన్నాను. నీకువివాహంకాదన్నాడు. అట్లాగేనాకు వివాహంకాలేదు.గీతను క్రిందుచేయగలననుకున్నాను. అట్లా చేయలేకపోయాను. ఇంతకాలానికి ఆవిషయం జ్ఞాపకమొ చ్చింది. చేతిగీత వివాహంకాకుండాచేసిందని ఈనాటికీ అనుకోను. నాతెలివితక్కువతనమూ అహంకారమూ చేశాయనిమాత్రం అను కుంటాను.

మందు, పాపం ప్రక్కింటివాళ్ళే తెచ్చిచ్చారు. అవసర మైనవన్నీ యిచ్చారు. చాలాజాగ్రతగా చూసుకున్నారు కడపటికి పథ్యంగూడా వాళ్ళేపెట్టారు ఎన్నిచేసినా ఆయన ఆమెకుచేసినటు వంటిసేవ నాకెట్లా లభిస్తుంది? ఆ మానసికతృప్తి నాకెట్లా లభి స్తుంది?

మొదట కొంతకాలం మాపెద్దతమ్ముడు. నాదగ్గరుండేవాడు. దేనికైనా ఆధారంగావుంటాడని వాణ్ణితీసుకొచ్చాను. హైస్కూల్లో చేర్చాను. నేనంటే వాడికంతప్రేమలేదు. నామాట నేమాత్రమూ లెక్కించేవాడుగాదు. చిన్నప్పటినుండీ వాడికినేర్పిన నేర్పువల్లనో లేక వాళ్ళతల్లి మొదలయినవారు నావిషయంవచ్చినపుడు ప్రదర్శిం చినవైఖరీమూలంగానో-వాడికి మొదట్నుండీ నేనంటే ఔదాసీన్యం యేర్పడింది. పెరిగేపిల్లవాళ్ళదగ్గర పెద్దలు కాస్తజాగ్రతగా మెల

గాలి. లేకపోతే పెద్దవాళ్ళకుండే రాగద్వేషాలూ, అసూయ, అసహనాలు, ఇత్యాది భావాలు అప్రయత్నంగా వీళ్ళలో నెలకొని వచ్చేంతవఱకూ అంటుకొనివుంటాయి. నాప్రస్తావనవచ్చినపుడంతా వాళ్ళమ్మ, ఇంకా దగ్గరబంధువులు ప్రదర్శించిన ఉదాసీనభావాలు వాడు అలవర్చుకున్నాడు. క్రమేణా నేనుగూడావాణ్ణి అంతగా ప్రేమించడం విరమించుకున్నాను. కేవలం బాధ్యత మాత్రమే ప్రదర్శిస్తూవచ్చాను. కొంతకాలంనుండి వాడికివాడే దూరమయాడు

దేవుడు ఒక్కొక్కసారి మనలనుఏకాకుంచేస్తూవుంటాడు. ఒక్కొక్కసారి మనకుమనమే మనఅవివేకకారణంగా ఏకాకులమైపోతూవుంటాము.

ప్రాపంచికవ్యక్తికి ఏకాకితనం అతికష్టమైంది. అది బాధతోను, అసంతృప్తితోను కూడుకున్నది. ఆడువాళ్ళవిషయంలో అయితే భద్రతారాహిత్యంతోను, అపాయాలతోనుకూడుకొన్నట్టిది.

చరిత్రక్లాసులో ఒకపిల్లవాడున్నాడు. వాణ్ణి కేవలం పిచ్చివాడనటానికి వీల్లేదు. నేను క్లాసులో బోధిస్తూవుంటే మొదట మొదట మెన్నో చిలిపిప్రశ్నలు వేసేవాడు. నేను ఒకనాడు కోప్పడ్డాను. వాడు క్షమాపణ చెప్పుకోడానికన్నట్లుగ నేనుండే యింటికొచ్చాడు. క్షమాపణ చెప్పుకున్నాక కూర్చున్నాడు. నేనుగూడా వాత్సల్యంతో వాడికి సంబంధించిన ఆ విషయమూ యీవిషయమూ మాట్లాడించాను. వాడు అంతసేపూ నా మొగాన్ని నా శరీరాన్ని చూస్తూ కూర్చున్నాడు ఆకలిచూపుల్తో. నేను లోలోపల అసహ్యించుకుంటూకూర్చున్నాను. ఆనాటినుండి వాడు మాయింటికి రాసాగాడు, నేను వెళ్ళమనేదాకా వెళ్ళేవాడుగాదు. ఒకనాడేంజరిగిందంటే,

వాడు వెళ్ళిపోతూ అక్కడ ఒకజాబు విడిచి వెళ్ళాడు. దానిపైన నాపేరున్నది. అది అందుకొని చదివాను. అందులో అంతా నన్ను గురించివర్ణన.

నా కప్పటికి ముప్ఫయిమూడేండ్లు. వాడికి మహా(వుంటే యిరవై రెండుగూడా వుండవు. బి. ఎ. క్లాసు చదువుతున్నాడు. నా చక్కదనాన్నిగురించి యింతవఱకూ ఒకమాటగూడా చెప్పలేదు నేను. ఎందుకంటే అందం అన్నది బాహ్యానికి సంబంధించింది కాదని నాకు బాగా తెలుసు. అదిలేకనే, నేనీ అధ్వాన్నపు జీవితం జీవిస్తున్నాను. మామూలు అందం-ఇట్లాంటి వాళ్ళను ఆకర్షించే అందం-నాకేనాడూవున్నది. నాది నిజంగా చక్కని శరీరం. గోధుమవర్ణం. యువకుల ఆకర్షణకు అది చాలా తగివుంటుంది.

వాడు ఆ జాబులో వివాహంకోసం అభ్యర్థించాడు. వాడికీ నాకూ ఎంతలేదన్నా పదేండ్లకుపైగా తేడావుంటుంది. తేడావున్నా ఫరవాలేదని వాదిస్తాడువాడు. షేక్స్పియర్‌ను. జాన్సన్‌ను ఉదాహరిస్తాడు. ఏమిటేమిటో వ్రాస్తాడు. అది చదివేకొద్దీ నా కసహ్యమూ భయమూ వేసినవి.

వాడు వట్టి ఓగుమనిషి. నలుగురి దగ్గరా నన్ను గురించి వాగేవాడు. నా పేరు గోడలకెక్కింది. నా ప్రక్కన వాడిపేరు గూడా యెక్కింది. నాకు తల తీసివేసినట్లయింది.

వాడు యింటికి వస్తూనేవున్నాడు. వద్దన్నామానడు. ఎన్ని సార్లో తిట్టాను. మాట్లాడనే వద్దన్నాను. మాట్లాడకుండామానడు. రాకుండావుండలేనంటాడు. చచ్చిపోతానంటాడు. నీ చేతులతోనే చంపెయ్యమంటాడు. వాణ్ణేట్లావదులుకోడం? ఒక దయ్యంమాదిరి

పట్టాడు. నాకేమీతోచక అసహాయతతో యేడ్చేదాన్ని. సాటిలెక్చ రర్లదగ్గర యేడ్చేదాన్ని. స్త్రీని అబల అని అంటే మొదటిరోజుల్లో ఉద్రేకపడేదాన్ని. ఇపుడు అనుభవంవల్ల అర్థమయింది అబలా పదానికి అర్థం.

ఒంటరిగా స్త్రీ బయటసంచరిస్తే భద్రతయేదీ? చదువు సంస్కారంగలిగిన సంఘంలోనే స్త్రీకి భద్రత లభించకపోతే మరెక్కడలభిస్తుంది?

సరిగ్గా ఒకవారానికి ప్రసన్నారావుగారు బదిలీఅయి అనంతపురంవచ్చారు. నాకు ఎంతో నైతికబలం సమకూడినట్లయింది. వచ్చి ఒక మంచి యింటిని బాడుగకు తీసుకున్నారు. వారి కిద్దరు కొడుకులూ ఒక కూతురూను. పెద్దవాడి కయిదేండ్లు. పిల్లలు అందరూ ఆకారంలో ప్రసన్నారావుగారిని పోలివున్నారు. రంగు మాత్రం మా శాంతది. వాళ్ళు వచ్చాక నన్ను వాళ్ళయింట్లోనే వుండమన్నారు. మొదట ఇచ్చగించలేదు. తర్వాత అదేమంచిదని పించింది. అందులోనే నా కొకగది నిచ్చారు. భోజనాదులంతా అక్కడే!

వాళ్ళయింట్లో నాకెంతో ఆనందంగా వుండేది. ధైర్యంగా గూడావుండేది. శాంత నన్నెంత బాగానో చూచుకొనేది. ప్రసన్నారావుగారాప్యాయతతో ఆదరించేవారు. ఆ ఆదరణలో యెంతో సుఖంతో వుండేదాన్ని.

సజ్జనులతోడి సాంగత్యం సర్వదుఃఖాపహరణం. అట్టివారి సాన్నిహిత్యం ఆత్మబలానికి ఆలవాలం. గాలి, నీరు, ఉప్పు ఎంత ఉపయోగకరమైనవో సజ్జనులుగూడా అంత ఉపయోగకరమైన

వారు. అవి ప్రాణికోటికి ఎంత హితకారకములో సజ్జనులుగూడా అంతే !

ఈ సజ్జనసాంగత్యంలో ఆనందమయజీవితంజీవిస్తున్నాను. ఆత్మధైర్యాన్ని పెంపొందించుకున్నాను. అయినా నాకెక్కడో లోటు కన్పిస్తున్నది. ఆలోటును పూరించుకోవాలన్న భావంగూడా వేధించజొచ్చినది.

ప్రసన్నారావుగారు ఒకప్పుడు నాకుప్రియులు. నన్ను వివాహమాడగోరినవారు. ఆయనహృదయంలో నాకెప్పటికీ స్థానం వుండవచ్చుననుకొన్నాను. కావులేకపోలేదు అయితే నేను భావించినతీరులో ఆస్థానంలేదని తర్వాత తెలుసుకున్నాను. భార్యతో సర్వవిధాలా తృప్తికరజీవితాన్ని అనుభవిస్తున్నపురుషుడు పరస్త్రీని ఏనాడూ కోరడు. ఏదో ఒకరూపంలో అసంతృప్తివున్నపుడే ఆలోటును పూరించుకోడానికి అన్యవ్యక్తుల సమాగమాన్ని కాంక్షిస్తాడు. ప్రసన్నారావు జన్మతః సజ్జనులు. సాంసారికజీవితంలో ఏ లోటూరాకుండా శాంత భద్రతవహిస్తుంది. పైగా ఆమెరూపంలో గూడా యేలోటూలేదు. కాబట్టి ఆయన స్వచ్ఛజీవితాన్ని జీవిస్తున్నాడు.

నాలో కామభావం—అణిచిపెట్టివుంచిన కామభావం—దాన్ని అనుభవించాలన్నతృష్ణ—మరొకసారిపెల్లుబికినవి. నేను వయసులో వున్నాను. కామవాంఛ కొంచెంగూడాదిరలేదు. నాయిష్టమైనవ్యక్తి నాయెదుటనేవున్నాడు. అనుభవించాలనుకున్నాను. నాకోరికకుప్రతిఫలం దొరికితీరుతుందని భావించాను. నాభావం చేష్టలమూలకంగా వ్యక్తంకాజొచ్చింది. మాటలనుగూడా నర్మంగావదలడం మొదలుపెట్టాను. పసికట్టాడు ప్రసన్నారావుగారు. పన్నాగంలో పడలేదు.

లోలోపల నవ్వుకున్నారు. శాంత చాలా మెలకువగలది. తాను అను మానించి జాగ్రత్తగా కనిపెట్టసాగింది.

ఒకనాడు ఆకాశం మేఘావృతమై వున్నది మేడమీది గదిలో ప్రసన్నారావుగారు కూర్చొని కిటికీలోంచి ఆకాశాన్ని పరిశీలిస్తు న్నారు. చల్లని గాలి హాయిగా వీస్తున్నది క్రింద శాంత వంటపనిలో నిమగ్నమై వున్నది. ఇదే సందను కొని గబగబా పైకెక్కిపోయాను ప్రసన్నారావుగారిని సమీపించాను. ఆయన నావైపు చూడలేదు. ఆకాశం వంకే దీక్షగా చూస్తున్నారు నేను ఆయన వెనుక నిలబడి ఆకాశం వంక చూశాను. వెనుక నుండే ఆయన వైపు చూశాను. నా హృదయంలో కామవికారం ప్రవేశించే అక్కడికి వచ్చాను. ఆ వాతావరణంలో అది రెచ్చగొట్టబడింది. ప్రసన్నారావుగారికి అతిసమీపంలోకి జరిగాను. శరీరమంతా కంపిస్తున్నది. "నీ వస్తువే గదా జంకెందుకు" అంటున్నది అంతరాత్మ. "అనుకోడానికయినా నీకు హక్కెక్కడిది" అంటున్నది బుద్ధి "కాదే" అనుకొన్నది మూఢాత్మ. చేతులు పైకి లేచినవి. హృదయం జంకుతూనేవున్నది. సాహసించి చేతులు ఆయన భుజాలమీద పడినవి. తటాలున వెనక్కి తిరిగి చూశారు. నా మొగం చూచి గాభరాపడినట్లుగా కుర్చీ దిగారు. నేను నా చేయి చాచి మరలా ఆయన చేతిని గ్రహించి నా మూతి దగ్గర పెట్టుకొన్నాను. ఆయన ఆ చేతిని లాగుకొన్నారు. ప్రశాంతతతో చిరునవ్వు నవ్వి ఏ ప్రాణి ఎంత చేసుకొని ఈ ప్రపంచంలో అవతరిస్తుందో అంత మాత్రమే అనుభవిస్తుంది. నోముకోనట్టి అనుభవాలు రావాలనుకు న్నంత మాత్రాన రావు. నీవిప్పుడు చేస్తున్నదేదైతే చేస్తున్నావో దానిని మొదట నీవాదాండదగ్గరవుంచుకోవటం ఆరంభించావు. కాని అజ్ఞానంచేత

కాలదన్నేసుకున్నావు. దానిని మరొకవ్యక్తి ఆసక్తితో గ్రహించి అమృతభాండంలో వేసి పూజించుకుంటూవున్నది. అమృతాచ్ఛాదిత మైన ఆవస్తువును అనుదినమూ అనుభవిస్తూ ఆవ్యక్తి నా హృదయానికి అమృతమూర్తి అవుతున్నది. ఆహృదయాన్ని మరలా బలాత్కారంగా అపహరించి నీముందుపెట్టలేను. ఇంత చదువూ చదివి అతితుచ్ఛమైన పద్ధతిలో అనుభవించడానికినీవుపూనుకోవద్దు. వివాహయోగ్యమైనవయసులో లభించిన అమూల్యావకాశాల కాలదన్నేసుకున్నావు. ఆ వయసు కాస్త మీరినాక కోరికలుతీరకపోగా కామమరీచికలవెంట పడుతున్నావు. తృప్తితోనూ అసంతృప్తితోనూ కొంత అనుభవించావు. ఈజన్మకిది చాలుననుకొని ఇకనైనా పవిత్రభావాలతో పవిత్రజీవితం జీవించు. పారమార్థికదృష్టి అలవరచుకో. లేకపోతే ఈనీ కోరికల జయించలేవు." అన్నాడాయన.

ఆయన అన్ని సుఖాలూ అనుభవించిన మనిషి. ఇంకా అనుభవిస్తున్నారుగూడా. ఆయనకయితే కామదృష్టి తగ్గింది. అనుభవించనినాకు ఆవాంఛ చావలేదు. అది ప్రతినిత్యమూ నన్ను పీడిస్తూనేవున్నది.

నా భావాన్ని ప్రకటించిన అనంతరం ప్రసన్నారావుగారికి గూడా అక్కడ నా ఉనికి నచ్చలేదు. జాగ్రత్తగా అంతా కనిపెట్టి తెలుసుకొన్నది శాంత. నాపైన చాలా కోపమూ అసూయా వహించింది. స్త్రీ తాను ప్రేమించిన యితర వ్యక్తికి తన ప్రాణ యిమ్మన్నా యిస్తుందిగాని తన ప్రియునిలో భాగం కావాలంటే మాత్రం ఓర్చుకోలేదు. శాంతలో కలిగిన మార్పువల్ల నే నాం

యింట్లో ఉంగిలేకపోయాను. ఆ వూళ్ళోనే వుండలేకపోయాను. రాజమండ్రికి బదిలీ చేయించుకుందామనుకున్నాను. కాని పాత స్మృతులు బాధిస్తాయన్న భయంతో గుంటూరు బాలికల కళాశాలకు బదిలీ చేయించుకున్నాను.

అంతా బాలికలు. ఈ వాతావరణం నాలో కొంత ఉపశమనాన్ని కలిగించింది. వారి సమస్యలు తీర్చుతూ, వారికి కొన్ని హెచ్చరికలిస్తూవుండేదాన్ని. ఎంత యిచ్చినా వారిదృష్టి విచిత్రంగా వుండేది. మేము కాలేజీల్లో చదివేనాడు ఏదృష్టయితే వహిస్తూ వచ్చామో ఆ దృష్టేవహిస్తున్నారు పిల్లలు చాలమట్టుకు. ఒకనాడు వివాహవిషయమైన చర్చకు నేను అధ్యక్షత వహించడంజరిగింది. అటువైపు కొంతమంది ఇటువైపుకొంతమంది చేరి గట్టిగావాదించారు. వాద సారాంశమువల్ల ఆడుపిల్లలు ఎంత దురభిప్రాయంలో వున్నారో 1950 తర్వాతగూడా దృష్టి మార్చుకోకుండా పాత త్రోవన్నే ఏవిధంగా ఆలోచిస్తున్నారో-కనిపెట్టి నేను బాధపడ్డాను. ఆనాడు ఎంతో హెచ్చరికతో-సహేతుకంగా, సతార్కికంగా, స్వీయానుభవాన్ని పురస్కరించి చాలా విషయాలు చెప్పాను. స్త్రీకి వివాహం చాలా అవసరం అన్నాను. భద్రతా స్వేచ్ఛల ప్రసాదించేది వివాహమేఅని చెప్పాను. ఆ తర్వాత నాకు కొంతమంది అనుయాయులు ఏర్పడ్డారు.

ఒంటరిజీవితం చాలా కష్టమైందని ఇదివరకే చెప్పాను. నేను ఒంటరి జీవితంలో చాలాచాలా కష్టాలుపడ్డాను. ఛాత్రులు

ఒంటరిగా పడుకుంటే ఏవేవో ఆలోచనలు కలుగుతూ వుంటాయి. అపుడంతా అసంతృప్తితో బాధపడేదాన్ని. నా కోరికల ఏదోఒక మార్గంలో తీర్చుకోడానికి నేనున్న పరిస్థితిలో మార్గాంతరాలులేక అలమటించేదాన్ని.

ఈ నాడింకా కాలూచెయ్యీ ఆడుతున్నది. అదికాస్త ఉడిగి నాక దిక్కెవరు? నాలుగుడబ్బులు కూడవేస్తే ఎవరోవొకరు చూస్తారు. మరి, మన బిడ్డలు చూచినట్టు చూస్తారా?

నా యీ జీవితగాధను ఇంతటితో ముగిస్తున్నాను. ఈకతను అందరితోపాటు యువతులుగూడా చదువుతారు. అసలిది వ్రాస్తున్నది వారికోసమే! ఇది చదివినతర్వాతగూడా వివాహం అక్కరలేదని ఏయువతయినా-చదువుతూ వున్నాసరే-అన్నదంటే-అనవీయండి-నా మాదిరి ఏకాంత సుఖజీవితాన్ని అనుభవించగలదు! అట్లాభావింపనివారుమాత్రం, మా శాంతా నిర్మలలవలె ప్రశాంతంగా భర్తలతోజీవిస్తూ బిడ్డల కని ప్రేమిస్తూ వుంటారు.

స్త్రీ స్వేచ్ఛగా జీవించవచ్చు. స్వేచ్ఛ అన్నది వివాహం లేకుండా వున్నంతమాత్రానరాదు. వైవాహికజీవితంలో స్వేచ్ఛ వున్నది. అక్కడే స్వేచ్ఛవున్నది. అసలు స్వేచ్ఛఅదే!

స్త్రీ ఉద్యోగం చేయవచ్చు. ఆ జీవితంలో సుఖంమాత్రం తక్కువ. భర్త-కాపురం-పిల్లలు-అందులోవుండే బాధ్యత, ప్రేమమయజీవితం, స్వేచ్ఛ, ఈ ఉద్యోగాలలో లేవు.

స్త్రీలు విద్యార్థిదశలో-హైస్కూళ్ళల్లో, కాలేజీల్లో-పెండ్లంటే పేకిభావంతో చూస్తుంటారు. వివాహమన్నది ఎంత సుఖదాయ

కమో ఎంతభద్రతాదాయకమో స్వేచ్ఛాప్రదాయినో-తెలియకనే అట్లాఅంటూవుంటారు. అట్లా అంటూఅంటూవుండగానే, వివాహ వయసుమీరిపోతుంది. వివాహపువిలువఅపుడర్థమవుతుంది. అపుడు ప్రాకులాడతారు వివాహంకోసం. అయితే కావడం బహుకష్టం.

స్త్రీ యౌవనదశలో-ఎవరైనాసరే-అవకాశంకోసం ఎదురు చూస్తూవుండాలి. అంతవఋకూ చదువుకుంటూవుండవచ్చు. అవ కాశందొరికి వరుడులభించెనా ఆఅవకాశాన్ని విడనాడుకోగూడదు. చదువుకు ఆ అవకాశాన్ని ఏమాత్రమూ బయివ్వకూడదు. స్త్రీకి సంసారంలో వున్నంతసుఖం చదువులోలేదు. ఏకాంతజీవితంలో లేదు

స్త్రీకిగాదు-పురుషుడికిగాదు-ఎవరికైనాసరే: కులం లేదు. శాఖలేదు. ఆచారంలేదు. సంప్రదాయం లేదు. ఏమీలేదు. అన్నీ వట్టిభావాలు. మార్చుకోవాలనుకుంటే అవన్నీ మార్చుకోవచ్చు. అవసరంకొద్దీ మనం ఎన్నోమార్చుకున్నాం. పూర్వాచార దురం ధరులే అవసరంకొద్దీ ఎన్నో మార్చుకోడం మనం చూస్తూనే వున్నాం. అది కపటంఅంటే అనండిగాక: అవసరంవస్తే మానవు డన్నీ విడనాడుకోగలడు. మనజన్మ కేవలం ఛాన్సు. మనం ధని కులయిండ్లల్లోపుడితే ధనికులమయ్యాం. బీదలయింట్లోపుడితే బీదల మయ్యాం. అట్లాగే గొప్పవంశంలో పుడితే ఉన్నతవంశజుల మయ్యాం. హీనవంశంలోపుడితే హీనవంశజులమయ్యాం. అంతే గాని అది మనచేతిలోలేదు. ఆమాత్రానికే విర్రవీగడం, క్రుంగిపో

వడం అజ్ఞానం. మనం కావాలనుకుంటే యేమయినా మానుకోగలం. అట్లాగే క్రొత్తవి అలవర్చుకోగలం. కొత్తవాతావరణం-అనువైనవాతావరణం సృష్టించుకోగలం! శాకాహారమాంసాహార భేదాలుగూడా యిటువంటివే! ఆహారవిషయంలో హెచ్చుతక్కువలు భావించేవారు మూర్ఖులు. నీవాయింట్లో పుట్టలేదుగాబట్టి నీకా అలవాట్లు పట్టుబడలేదు. పుట్టినావనుకో-ఆ అలవాట్లు అలవడేవుంటాయి. అంతమాత్రానికే భేషజం పనికిరాదు.

ఇదంతా-ఎంతో అనుభవించినమీదట, అపార్థంలోవున్న నా సోదరీమణులకోసం వ్రాస్తున్నా. దీన్ని చదివి ఒకసారి తమ ఆత్మపరీక్షచేసికొన్నారా-నేను ఆనందిస్తాను. చదివిగూడా దీన్ని గురించి ఆలోచించకపోతే-వ్యథాసహితమందహాసం చేస్తాను.

సంపూర్ణం